1937



సర్వతోముఖమై విజృంభించిన ఆంధ్రశిల్పం యవద్వీపంలో బోరోబదూరులో, సౌగంధి కమ్మై, ఆంధ్రపల్లవుల కాలంలో మహాబలిపుర కాంచీక్షేత్రాదులందు పుష్పించినది. ఎల్లోరా కొండలు తొలిచి కైలాసము నిర్మించి జగత్తును విస్మయంకొల్పింది ఆంధ్రశిల్పులే.

ఆంధ్రశాతవాహనుల కాలంలో, కాకతీయుల యుగంలో, విజయనగర సామ్రాజ్య శుభ ముహూర్తాలలో ఆంధ్రశిల్పము ఆనందరూప మైంది.

ఆంధ్రుల చిత్రలేఖనము అజంతాగుహల్లో, లేపాక్షిలో, కొండపల్లిలో, మధుగల్లో, తంజావూరిలో నేటికిని అక్షరమైన అమర గానం చేస్తూంది. నవ్యాంధ్రశిల్పం యిప్పుడిప్పుడు గ్రీష్మతాపాన్ని దాటి, వానకాలపు పుష్టిని చేకూర్చుకొంటున్నది.

ఇట్లా పరిపరివిధాల ఆలోచించుకొంటూ, యీ ఆంధ్ర మహావైభవ మంతా నా శశికళాదేవి విలాస విన్యాసాలుగా కలలు గంటూ, కావ్యగానశిల్పాకృతియైన నా పుష్పాస్త్రదేవతకు రూపకల్పన చేసుకొంటూ వుంటాను.

చంద్రుడు మనఃకారకుడు. పాశ్చాత్యులు వెఱ్ఱికి చంద్రాఘాత (Moon-struck) మని పేరుపెట్టారు. బాపిరాజు వట్టి వెఱ్ఱివాడని మా దర్బారుస్నేహితులు నవ్వుకొంటారు.

“కాదయ్యా, భరతశాస్త్రము సంగతి చూడండి. ఆంధ్ర నృత్య సంప్రదాయం నేటికీ యితర సంప్రదాయాలకంటె అందచందాలు కలదని చెప్పుకొంటూన్నారు. కూచిపూడి భాగవతుల నాట్యగంభీరతా, తంజావూరి లాస్యమధురిమా నేటికిని సజీవంగావున్నాయి. ఆంధ్రశిల్పము బర్మా, కంబోడియా, జావా దేశాలకు వ్యాపించినట్లుగానే మన తోలుబొమ్మలాటలుకూడ జావాదేశంలో నెలకొని మహాంధ్రవైభవాన్ని మీకు ప్రత్యక్షం చేస్తున్నవి. ఆంధ్రబ్రాహ్మణులు మలయాళదేశపు రాజపురోహితులుగా వెళ్లినప్పుడు తమ నాట్యకళకుగూడ అక్కడ గురుపీఠం సంపాదించారు. దాన్నే యిప్పుడు కథాకళి అని అంటున్నాము.” అంటూ నేను ఆవేశంతో వాదిస్తాను.

“అయితే ప్రపంచనాగరికత అంతా ఆంధ్రనాగరికతలోనుంచే పుట్టిం దంటా వటయ్యా” అంటారు మిత్రులు. శశికళాదేవీ దివ్యసౌందర్య కౌముదీస్నాతుడనైన నేను “అవును, ఆ మాటలోను కొంతనిజమువుంది” అంటాను. అంత మిత్రులంతా గంభీర భావంతో ‘జయ! ఆంధ్రవీరా! జయ! భరతనాట్యాలబావా! బళి బళీ!” అని చప్పట్లు కొట్టుతారు.

నా శశికళమాత్రం “కళాప్రియం భావుకా, భయముకే”దని వెన్నుచరచి హెచ్చరిస్తూ వుంటుంది.

## 3

పరమేశ్వరుని ఛాయాస్వరూపమైన, లీలావినోదమైన యీ ప్రకృతి ఎంత సౌందర్యం పుణికిపుచ్చుకొంది! ఈ దివ్యసౌందర్యాన్ని తెలిసి అనుభవించగలిగినవారు కావ్యగాననృత్యశిల్పాది కళాస్రష్టలు. కళాకోవిదులు కాకపోయినా కళాభిజ్ఞులైనా అయివుండాలి. ఒక్కొక్కప్పుడు ఉద్విక్తప్రకృతియందలి దృశ్యాలకంటె సుందరాలైన పరమభావాల్ని సంపూర్ణంగా మూర్తించగలిగే కళాసౌందర్యం ఎంత ఉత్కృష్టమైంది!

ఆ పరమభావమే ఉన్నతపథాల సంచరించే వ్యక్తులకు ఉద్బోధకమైన శక్తి మూర్తిగా గోచరించి ఆ పుణ్యపురుషులచేత ఉత్తమ సృష్టి చేయించగలుగుతుంది.

కాళిదాసుకు అతని భార్యయే గురువైనది. జయదేవుడు పద్మావతీ చరణచారణచక్రవర్తిగదా. శ్రీలీలాశుకులు చింతామణిని పూజించినారు. బిల్హణుని కావ్యాని కాతని ప్రేయసియే నాయిక అయింది.

రాధాదేవి లేని శ్రీకృష్ణు డెక్కడ? శంకరుడు ఉభయభారతీదేవిని శారదాపీఠస్థను చేసినాడు. రామకృష్ణపరమహంస భార్యను పూజించినాడు. వివేకానందునకూ, సన్యాసిని నివేదితకూ పవిత్రస్నేహం. బుద్ధుడు ఆమ్రపలిని గౌరవించినాడు. క్రీస్తు మేరీ మేగ్డలీన్ కన్యను ఆశీర్వదించినాడు. ఫాతిమా దేవి మహమ్మదు పైగంబరుస్వామికి ఆశాభూమిక.

డేంటీమహాకవి మనఃపథాంచ [illegible]” కన్య నాట్యమాడుతూ సహస్రచంద్రికా స్వరూపయై మహాకావ్యం సృష్టింపజేసింది. లినోర్డా డావెంసీ ప్రపంచాద్భుతంగా మొనాలిజా కన్యను చిత్రించినాడు. షెల్లీ మేరీని పూజించినాడు. కీట్సు ఫేనీని స్మరిస్తూ హరించిపోయినాడు. ఆర్నాల్డు మార్గరెట్టును గానం చేసినాడు. రోజెట్టీ తన ప్రేయసి వపువుతో తన కావ్యసంపదను పూడ్చిపెట్టినాడు. ఆమెను గంభీర కంఠంతో ‘Blessed Damozel’ అని పాటలు పాడినాడు ఆకాశమువైపు చేతులు చాచినాడు. బెత్ వెన [illegible] దివ్య గాంధర్వ చంద్రికలు అల్లివేసినాడు.

నాకు చిన్నతనాన్నుంచీ శశికళాబాల అట్టి మహదాశయమూర్తి. ఆద్యము లేని ప్రథమ సృష్టిలోనుంచి దైవ్యీభూతశక్తి గర్భితమైన ఒక్క జీవకణము తన విశ్వనాట్యకౌన్ని ప్రారంభించింది. అందులోని పురుషశక్తిని నేను; స్త్రీశక్తిమూర్తి శశికళాదేవి. అవతారాలు తాల్చి తాల్చి, చాలించి చాలించి నేటికి ఆంధ్రదేశంలో జన్మం ఎత్తాను. నా ఆశాస్వరూపమైన శశికళ లలితకళాస్వరూపిణి.

ఈభావం నా చిన్నతనంలో అస్పష్టంగా ఉంది. నా వయిన ఈ కొద్ది లలితకళలకు ఆమెయే వివిధరూపాల్లో కారణమూ, ఉద్బోధకమూ అయింది. ఒకప్పుడామె చిత్రకళాస్వరూపమై సూర్యసుతే అయినది. సూర్యుని పురుషశక్తి చంద్రుని స్త్రీశక్తిని పొంది, చంద్రికాబాలను మూర్తీభవింప చేసిందికదా! అప్పుడామె నీలవర్ణి నీ స్వరూపమై కృష్ణాదేవి అయింది.

ఆ నాచిన్నతనంలో అస్పష్టంగా గోచరించే యీ దివ్యబాలికదెక్కు మొగమై,

“ధవళమైనదీ, తలపు కాననిది,
దానికి మొదలూ చివరా లేనిది,
నీకు ఇవతల,
నాకు అవతల,
తెర ఉన్నాది బాలా!
తెర ఉన్నదే!

51-వ పేజి చూడుడు

# 'ర్దను, . దౌత్యము

విశ్వనాథ సత్యనారాయణ



నాచనసోముఁడు, శ్రీ కృష్ణ రాయలు, తెనాలిరామకృష్ణుఁడు, నాంధ్రసారస్వత సృష్టిలో ముప్పురు విశ్వామిత్రుల వంటివారు. వీరి సృష్టి తక్కిన సారస్వత సృష్టికర్తల కన్న మిక్కిలి విలక్షణమైనది. రామకృష్ణుని సృష్టిలోని వైలక్షణ్య మంతయు శబ్దము నాశ్రయించినది. శ్రీ కృష్ణ రాయలవారిది శబ్దమును భావమును రెంటిని గలిపి జోడించినది. శ్రీ రాయలవారు రామకృష్ణునివలె శబ్దముల నతుకుటలో వైలక్షణ్యమును జూపించలేదు. కాని యన్వయములో, లోకోత్తరములైన భావములలో జూపించినాఁడు. భావము లోకోత్తరమనఁగా సామాన్య బుద్ధులకు గోచరించని భావమని యర్థమేకాని, మనుష్య బుద్ధి కతీతమైన భావమని కాదు. లకుముకి పిట్టలు దిగుడు బావి యడుగునకు బోయి చేపను దన్నుకొని పైకెగిరి వచ్చుట; యుషఃకాల మందానిలమునకు ఘంటారావపు గంటలు కదలి తెల్లవారిన దనుకొని కాకులు కూయుట; ఈ భావములు చాలమందికిఁ జెప్పిన తరువాతఁ బరిచితములుగాఁ గనిపింపవచ్చును. కాని యిట్టి భావములే యితర కవియు నేల వ్రాయలేదు? శ్రీ కృష్ణరాయఁడే యేల వ్రాసెను? అవికూడ వర్ణనాంశములై యానంద జనకములు కాగలుగునని యామహామేధావికే తెలిసెను. అవి చెప్పుటలోఁ గూడ నాయన సులభముగాఁ జెప్పఁడు. సులభముగాఁ జెప్పలే దనుకొనుటయే కాని యట్లు చెప్పినచో వానిశోభ యెంతవఱకుఁ బోవునో సహృదయు లెఱుఁగుదురు. తిక్కన కవితలో నంత బిగువు లేనిచో సంజయ రాయబారము, అనుశాసనికము, యుద్ధపర్వము మొదలగు భాగము లెంతశోభావిహీనములో యగును. కొన్ని భావములకు బిగువు రంజించును. కొన్ని భావములకుఁ దేలికతనము, పలుచదనము శోభ తెచ్చును. సహృదయ హృదయవేద్యమైన యీవిషయ మిచ్చట విస్తరింపఁబడదు. తెగిపోయిన యేనుఁగుతల వ్యత్యస్తముగా నుంచినట్లు బ్రహ్మరక్షస్సు మొగమున్నదని వర్ణించుట శ్రీ రాయలవారి వంటి మహాచక్రవర్తి మాత్రమే కల్పించ గలిగిన యుపమాలంకారము. కవి యనుభవములను బట్టి యతని యాత్మలోని బిగువునుబట్టి వర్ణనాంశములును బలుకుబడియు భిన్నములుగా నుండును.

ఈ ముప్పురిలో మొదటివాఁడునాచనసోమనాథుఁడు. ఈ ముగ్గురిలో నితనిని గలుప నక్కరలేదు గాని యితని బాణాసురకథ యితని కాస్థానము నిచ్చును. తక్కిన కావ్యమునందును నొక ప్రత్యేకవైలక్షణ్యము మిక్కిలిగా భాసించుచున్నది. ఆంధ్ర సారస్వతమున బోతనగారు శ్రీ కృష్ణదేవుని లోకాభిరామమూర్తిగా వర్ణించెను. శ్రీనాథ ధూర్జటులు పరమేశ్వరుడైన శివుని, బోతన్నగారి కృష్ణునివలె హృదయ నయనాభిరామ మూర్తిని జేసిరి. కాని పండితులకు మాత్రమే వారిసృష్టి హృదయంగమ మగుచున్నది.

తెలుఁగుదేశపు బూర్వపు దినములలో నారాయణుఁడు పరదైవముగానున్న గీతామత మొకవంకను, శివుఁడు పరదైవతమైన శైవమత మొక వంకను ప్రబలి దేశమును రెండు వంకలకు లాగుచున్నపుడు తిక్కనగారు హరిహరనాథ రూపమునకుఁ బ్రాచుర్యము తెచ్చిరి. కాని యాయన యుపాస్యదైవము కథాగతవస్తువు కామిచే వలసినంత సొగసు సంపాదించు కొనలేదు. నాచన సోమన్న తన కావ్యమునం దదియొక ప్రత్యేకపుఁ బనిగాఁ బెట్టుకొనెను. సోమనాథుని ప్రత్యేకత బహువిధములుగా నున్నది. ఒకటి యతఁ డేర్చుశబ్దముల యందలి వైశిష్ట్యము. రెండవది యతఁడుతెచ్చు లోకోక్తులు,

వానిని బరహూచిత్య ప్రతిపాదన హేతువులుగా నతుకుట. మూడవది యతని మానసిక పరిణామ ప్రదర్శనపద్ధతి. ఈయన విశ్వామిత్రసృష్టి రామకృష్ణునివలె విలక్షణా ఝల్పంయోగముచేతఁగాక, కృష్ణరాయలవలె నపూర్వ భావ తదనుగుణ శబ్ద సంకలనా వైచిత్రిచేతను గాక, మూడవరకముగా నున్నది. వీరిముప్వురి వైలక్షణ్యముల తారతమ్యము నిర్ణయించుటకుఁ గాక యీ వ్యాసము నాచన సోమనాథుని మఱియొక మహాశక్తిని విస్తరించుటకు వ్రాయఁబడుటచేత నది సంక్షిప్తము.

సోమనాథుఁడు తిక్కనగారియందు మిక్కిలి గౌరవము కలవాఁడు. అది యతని గద్యలోఁ గనిపించును. ఈయన తనగద్యలో సాహిత్య రసపోషణుఁడనియు సంవిధాన చక్రవర్తియనియుఁ దన బిరుదములుగాఁ జెప్పుకొన్నాఁడు. సాహిత్య రసపోషణ బిరుదము విచిత్రమైనది. కవులందఱు సాహిత్య రసపోషణము చేయరో! ఇతఁడొక్కఁడే చేసెనో! సాహిత్య రసపోషణకు, వట్టి రసపోషణకు భేదమున్నదో! ఉన్నదనియే సోమనాథుని యుద్దేశ్యము. వట్టి రసపోషణముకన్న సాహిత్య రసపోషణ భిన్నమైనది. వట్టి రసపోషణము మంచి పలుకుబడితో లోకోక్తులను సంగ్రహించుటతో చేయఁబడవచ్చును. ఇట్టి రసపోషణ యక్షగానములయందు, వీథినాటకముల యందు, తందాన పాటలయందు గూడఁ గన్పించును. సాహిత్య రసపోషణము వానియందుఁ గన్పించదు. ఉత్తమ కావ్యములయందే యది గోచరించును.

యక్షగానాదులయందుఁ గంటె సాహిత్య మూలకంబము లైన కావ్యములయందలి రసము జిగియు బిగువు కలిగి శబ్దశక్తిద్వారా యొక దివ్యమైన వస్తువువలె భాసించును. ఒక సామాన్యునకుఁ గోపమువచ్చినచో లోకమునందలి కోపోక్తులన్నియు వల్లెవెట్టును. ఒక మహాపురుషునకుఁ గోపము వచ్చినచో బరిమిత శబ్దములతో దానిని వెల్లడించి తక్కిన కోపమంతయు నొక యవిస్పష్ట శరీరావయవ చాలనముచేత, నొక చిన్ని గుంఫిత హాసముచేత నాకోపమును వెల్లడించును. భావము రసమున కాలంబమగుటచేత రౌద్రరస మిర్వురియందు, నొకనియందు విస్తృతమై పేలవమై సులభగ్రాహ్యమై, మఱియొకరియందుఁ గుంచితమై గంభీరమై కృచ్ఛ్రగ్రాహ్యమై యొప్పుచున్నది. ఇది వట్టి రసపోషణకు సాహిత్యరసపోషణకు గల భేదము.

సోమనాథుని కూర్పు లీరెండవరకమునకే. ఈ సాహిత్య రసపోషణమునందు సోమనాథుని మించినవాఁ డాంధ్ర సారస్వతమున నింకొకఁడు లేఁడు. కాని యిందు మఱియొక ప్రశ్న పుట్టుచున్నది. ఈ భేదము నాయకుల నాశ్రయించి పుట్టుచున్నది. భిన్ననాయకాశ్రయణము చేత తద్భిన్నత్వ ముండవచ్చును గదా యన వచ్చును. అసలు సాహిత్యమే మఱియు సామాన్య నాయకులఁ బరామర్శింపదు. మన కావ్యపురాణాదుల యందున్న సర్వపాత్రములు దేవతాంశ సంభూతులో, తాదృశులో. కావుననే సోమనాథుని వైశిష్ట్యము.

జనార్దనుని దౌత్యమునకు సంజయ రాయబారము ప్రాతిపదిక కావచ్చును. కాని తిక్కన తీర్పువేఱు. తిక్కనకుఁ బలుకుబడిలో నున్నంతబిగువు తీర్పులయందు లేదు. అనఁగా నాచనసోమనాథుని కున్నంత లేదని యర్థము. తిక్కన చాల విషయములు వాచ్యములుగాఁ జేయును. సోమనాథుఁడు బహువిషయములు స్ఫూర్తికి వదలును. తిక్కన గుణీభూతవ్యంగ్యమునే మిక్కిలి నాశ్రయించును. సోమనాథుఁడు దానిని వదలిపెట్టఁడు కాని, స్ఫూర్తిచేతఁ జాల విషయములు పరిత్యగ్రాహ్యములుగా వదలిపెట్టును. కొన్ని నాచన సోమనాథుని పద్యముల బిగువులు తిక్కనగారి యందుఁ గన్పింపవు.

సంజయుఁడును జనార్దనుఁడు నిద్దఱు దౌత్యము పోయినచోట నభిమానము కలవారు. సంజయుని దభిమానము మాత్రమే. జనార్దనునిది జ్ఞానభక్తి. జనార్దనునకు హంసడిభకులకు శరీరములు కోసికొని యిచ్చునంతటి చెలిమి. ఎప్పుడోకాని జనార్దనునిమీద హంసడిభకులకుఁ గోపము రాదు. వచ్చినను నది సమయానుకూలముగాఁ దెప్పించుకొనక తప్పనిది. దుర్వాసుని హంసడిభకులు పరాభవించినపుడు జనార్దనుఁడు వారిని నిందించెను. కాని వారు వానిమాటలు లెక్కసేయ లేదు. అతఁడును వారియందు ప్రేమగల మాటలే కోపముతో ననెను. వారిర్వురు రాజసూయము చేయుదు మనిరి. జనార్దనుఁడు పరరాజుల శౌర్య ముగ్గడించెను. వారు వినలేదు.

“ఏ యుత్తరంబు చెప్పిన నీ యానయ నీకుఁ జెలిమి
నీతో మిగులఁగ, జేయుటనొండన నేర నస్మాయ తల్లం
పునకురాదు సూ నిను గనినఁగ”

హంసడిభకులకు మొదటినుండి తుదివఱకు జనార్దనునియం దిదియే భావము. అతఁడు వీరియందుఁ బ్రేమ కలవాఁడే. భగవంతునియందు భక్తియుఁ గలవాఁడు.

“శ్రీవత్సలాంఛనునే డెల్లి కనుంగొనఁ గలిగినఁ
జాలుఁ గృతార్థుండ పొమ్ము”

అని యతఁడు దౌత్యమునకుఁ బోయెను. అనఁగా దౌత్యమున కన్న వారి చెలిమికన్న నతనికి భగవంతుని జూచుటయే ముఖ్యము. ఈ సంగతి యతని దౌత్యమంతటను విస్తరింపబడియున్నది. భగవంతుఁడు జనార్దనుని గుశలప్రశ్నము లడిగెను. ఏమి పనిమీఁద వచ్చితివని యడిగెను. జనార్దనుఁడు ‘నీకుఁ దెలియదా ?

“లోపల వెలుపల వెలుపల
లోపలగా నుండు నఖిల లోకమ్ములకున్
నీ పరతత్వము చిత్రము”

అనెను. జనార్దనుఁడు తత్వవేత్త. కొన్ని లోకములకు లోపల వెలుపల నుండును. కొన్ని లోకములకు వెలుపల లోపల నుండును. జ్ఞానమయలోకములందు వెలుపలనైన యీ సృష్టి బీజవదంతర్నిష్ఠమై యుండుటయు, భూలోకాదులయం దాత్మ పిహితమై యంతర్భాగమున నుండుటయు నన్న యీ పరతత్వము నతఁడు దర్శించెను. ఇదియుఁగాక నీ పరతత్వము ‘అంత ర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః” అను వేదార్థమును జెప్పుచున్నది. మఱియును దన శరణాగతత్వమునుగూడఁ జెప్పుచున్నది. “నేను నీకు లోపలివాడను. హంసడిభకులయొద్ద వెలుపల నుంటిని. నేను నీకు శరీరముచేత వెలుపలివాఁడను. భక్తిచేత నీకు లోపలివాఁడను” అని యొక్కమాటలోఁ దన శరణాగతత్వము, తన యుపనిషదర్థ నిష్ణాతృత్వము భగవంతునకుఁ దెలియఁజేసెను.

“ఉండుట తప్పు వారియెడ నుండమి తప్పిట రాక తప్పు రాకుండుట తప్పు తప్పులకు నొప్పులకున్ గతి నీవ దేవ!”

మొదటి పద్యములోఁ దన శరణాగతత్వమును జెప్పి యీపద్యములోఁ దన వచ్చిన పని మనవిచేసెను. దౌత్యమును విస్తరింపు మని భగవంతుఁ డడుగగా “నిన్ను లవణము రాజసూయయాగమునకుఁ గప్పము తెమ్మని” రని మిక్కిలి సూక్ష్మముగాఁ జెప్పెను. ఈ నాల్గు మాటలతో దౌత్య మైపోయినది. ఇతఁడు భగవంతుని జూచుటకు వెళ్లెను. దౌత్యము నెఱవేర్చుటకుఁ బోలేదు. నిజముగా దౌత్యము నెఱవేర్చినది హంసడిభకులయొద్ద. అది యెట్లో చెప్పఁబడును.

కృష్ణుఁడు జనార్దనుని హంసడిభకు లేమనిరో చెప్పుమని ప్రోత్సహించెను.

“ఏలికల ప్రల్లదమైనను చెప్పజెల్లు తప్పని పలుకైనఁబోలు వినఁబంతము చల్లకువచ్చి ముంతదాచిన గతి నింతమాటువడఁ జెప్పినఁ గార్యము కానవచ్చునే!” ఇతని వైలక్షణ్య మీరచనలో నున్నది. చల్లకువచ్చి ముంతదాచుటయను లోకోక్తిని సంగ్రహించుటకు బంతమన్న శబ్దమునందుఁ గ్లిష్టార్థము ప్రాప్తింపఁజేసెను. “వినఁ బంతము” అట్టిమాటలు వినఁగా మాకుఁ బ్రతిజ్ఞ. పంచుదము, చుగ్దుక్కలకుఁ దకారము ప్రాప్తించి మన మెవరినైనఁ బంపింతుము, చల్లకువచ్చి ముంతదాచిన నేమి లాభము ? అని యర్థము కుదిర్చినచో వచ్చు ధాతువునకుఁ బోవు అను ధాత్వర్థము ప్రాప్తింపవలయును. అది యంత యనిష్టాపత్తి కాదు.

ఇతని దౌత్యము విని యాదవు లందఱు తలకొక్క మాటగా ననిరి. కృష్ణుఁడు దౌత్యమునకు రెండు సమాధానములు చెప్పెను. ఒకటి జనార్దనునకు, రెండు హంసడిభకులకు. జనార్దనునితో నాచేతఁ జక్రాయుధమున్నది, వారిని జంపుదు ననెను. హంసడిభకులతోఁ జెప్పు మని మఱికొన్ని మాటలు చెప్పెను. కృష్ణుఁ డతని దౌత్యపరమార్థ మెఱిగెను గాన వాని నాత్మీయునిగా మన్నించి హంసడిభకులు నాముందు నిలువలేరు, వారిని సంహరింతు నని రహస్యము చెప్పెను. సోమనాథుని సాహిత్య రసపోషణమును సంవిధాన చక్రవర్తిత్వము నిట్టి స్థలములయం దున్నది. ఒకవేళ హంసడిభకులు గెలిచినచో జనార్దనుఁడు దౌత్యములోఁ జేసిన మోసము వలన నతని కాపద కలుగవచ్చును. భగవంతు డిట్లు తచ్ఛంకానివారణము చేసెను. ఈ మాటతో నతని శరణాగతత్వమును స్వీకరించితి నని చెప్పెను. అతని నాత్మీయులలోఁ జేర్చుకొంటి నని చెప్పెను. అంతయు స్ఫూర్తియే. ఒక్కటి వాచ్యము గాలేదు.

శివకేశవుల యవినాభావము నాచన సోముని కావ్యమున నొక్కచోట వాచ్యమై మఱి యెల్లచోట్ల స్ఫూర్తిమత్తుగా నున్నది. ఆ రెండు తేజస్సుల యేకత్వమొకరి యవసరము కొలది, రెండవ తేజ మ్మొదుగుట

బాణాసురకథయందు మిక్కిలి ప్రపంచింపబడెను. దాని సూచనయు నీ భాగములో నున్నది. హంసడిభకులతోఁ గృష్ణుఁడు జనార్దను నిట్లు చెప్పు మనెను.

"అగునో కావో వరములు దిగవిడువగరాదు హంస డిభకుల నంచుఁ, మొగరించిన హరునైనను జగ మెఱుగగఁ దోలితమ్ము జంపెద ననుమీ!"

వరము లవునో కాదో యట. ఇచ్చిన వరము లేల గావు? ఆ యవుగాములలోఁ దాను వేఱే వ్యాఖ్యానము చేయునా? అయినట్లు కానట్లును జేయునా? హరు డెదిరించినను నతనిఁ దోలునఁట. శివుని వరములు విష్ణువు చాలమాఱులు వృథాకరించెను. శివునితో నెదురుబడి యుద్ధము చేసెను. ఒక్క బాణుని సందర్భములో శివుని విష్ణువు గెలిచెను. అసలు శివకేశవులకు యుద్ధ మెన్నడు జరుగలేదు. రామాయణమునందలి శివవిష్ణ్వధికతా సందర్భకథయందు శివుని ధనుస్సు స్తంభించినది. దేవత లది విష్ణుని యధికత్వ మనుకొనిరి. ప్రత్యక్షముఁగా శివుఁడు విష్ణువుతోఁ బోరాడిన దొక్క బాణాసురత్రాణ సందర్భమున నే. శివుని బాఱదోలుదు ననుటకూడ నిదియే. అవతారకార్యవ్యగ్రుఁడైన విష్ణుని ముందు మాత్రమే శివుఁడు నిలువఁజాలఁడు. అప్పటికిని బాణాసుర యుద్ధసందర్భమున శివజ్వరావిష్టుఁడై కృష్ణుఁడు మూర్ఛ పడి కళవళించెను. శివునిఁ బాఱదోలుదు ననుట యవ తారతైక్ష్ణ్యము కాని వారి భేదము కాదు. ఏ రెండు గుణములకు వారిర్వురు మూర్తికట్టిరో యా గుణముల యందలి తారతమ్యమే వీ రిరువురియందును భాసించును. అన్యోన్యాశ్రయముల కధికతా న్యూనత లాపాదించుట దృష్టిదోషము.

సోమనాథుడు తిక్కన్నగారి రాజకీయవేతృత్వపు బలుకుబడికి, పోతన్నగారి భక్తిపారవశ్యమునకు నధిక మైన సాహిత్యశక్తిచేత నుత్కర్ష తెచ్చినవాఁడు. తిక్కన్న గారి రాచకీయపుఁ బోకడలకు మెఱుఁగు లెట్లు పెట్టెనో పైని సూచింపఁబడినది. పోతన్నగారి భక్తిపారవశ్యము సాహిత్యముచేత బిగిసి యా భక్తియందు జ్ఞానపుఁబా లెక్కువపెట్టె సోమనాథుఁడు తీర్చి దిద్దుట దౌత్యము యొక్క సంవిధానమునందే కాక

"యదుకులాంబుధిచంద్రు నానందమున జొ"
"వెలిదమ్ములో లేతవెన్నెలో యమృతమో"
"ఉరము కౌస్తుభరత్న ముదయాద్రితటమున"

ఈపద్యములయందుఁగూడఁ గన్పించును.

జనార్దనుని దౌత్యముయొక్క సొగ సత్తఁడు తిరిగి పోయి హంసడిభకులతో నక్కడ తనజరిపిన వర్తమానము చెప్పుటలో నున్నది. అక్కడ జరిగినది చెప్పి జరుగనిది మఱికొంత చెప్పి హంసడిభకులను యుద్ధవ్యవసాయ విముఖులను జేయుటకు బ్రయత్నించెను. ఇది యబద్ధమో నిజమో కాకుండఁ జెప్పెను. కృష్ణుఁడు తన మాటల ననా దరించి నారదునితో మాటలాడుచుండె ననియు దుర్వా సునకును యతీశ్వరులకు బ్రహ్మతత్వ నిర్ణయ విషయమున వాదము చేయించె ననియుఁ జెప్పెను. వెనుక కథలో దుర్వాసుఁ డొక్కఁడే యున్నాఁడు. తక్కిన యతు లందఱు వారిదారిని వారు పోయిరి. యాదవు లందఱు హంసడిభకులను వెక్కిరించుచుండగా, శ్రీకృష్ణు డిట్లు చేయఁగా సోమనాథుఁ డీవిషయ మక్కడ చెప్పక యిక్కడఁ జెప్పించెనా? లేక కల్పించి చెప్పెనా? ఈ కల్పించుటవలన బ్రయోజన మున్నది. హంసడిభకులు శ్రీకృష్ణునకు గోటిమీఁది పని యన్న సంగతి కృష్ణుఁడు తనతో రహస్యముగాఁ జెప్పిన విషయము వీరితోఁ జనార్దనుఁ డిట్లు చెప్పె నేమో! కాని యట్టి పరిస్థితులు పౌర్వాపర్య విషయ వ్యత్యస్తములైనను గథాప్రయోజన పోషకములై గడుసులైన కవిరచనలయం దర్థపుష్టియు రచనాచమత్కృతియు వెలార్చును. ఇట్టి సందర్భముల సోమనాథుఁడు సాహిత్యరసపోషణ చక్రవర్తి.

ఇందుఁ జనార్దనుని దౌత్యముమాత్రమే వ్రాయఁ బడినది. ప్రథమమున నుద్ఘాటింపఁబడిన వైలక్షణ్యము విస్తరింపఁబడ లేదు.

బాణాసురకథ భాగవతమున, హరివంశమున, నుత్తర హరివంశమున మూఁడుతావుల విస్తరించి వ్రాయఁ బడెను. సోమనాథుని రచన ముందా రచనలు పనికి రావు. అతఁ డా కథకుఁ జేసిన వ్యాఖ్యాన మన్నను మేయము. దౌత్యము సూచికగా సోమనాథుని యౌత్కృష్ట్యము చెప్పుటకే యిట్లు వ్రాయుట.

# వైదికభాష - ఆంధ్రభాష

మండపాక పార్వతీశ్వరశాస్త్రి

లౌకిక ప్రాకృతభాషలకు గల పరస్పర సంబంధము ఆధారము చేసికొని, ప్రాకృతవ్యాకరణకర్తలు ప్రాకృతభాషలలోకి తిన్నగా వైదిక భాషలోనుంచివచ్చిన రూపాలను వివరించినారు. నవీనాంధ్ర వైయాకరణులు తెనుగును ద్రావిడభాషలలో చేర్చివేయడము చేతను, ప్రాచీనాంధ్ర వైయాకరణులు తెనుగుకు సంస్కృత ప్రాకృతభాషలు మాత్రమే ప్రకృతులని చెప్పడము చేతను గాబోలు, వైదిక భాషకూ ఆంధ్రభాషకూగల యత్కించిత్ సంబంధమును గూర్చిన్ని పరిశోధనలు జరగలేదు. కాబట్టి, ఈ విషయమును గురించి నేనప్పుడప్పుడు జాగ్రత్తచేసిన కొన్ని భోగట్టాలు వ్రాస్తాను.

చాలాకాలము క్రిందట అథర్వణవేదమునకు గ్రిఫిత్ పండితులు రచించిన ఆంగ్లేయానువాదము చదువుకొంటూ ఉన్నప్పుడు కొన్ని విచిత్రములైన పదాలు కనబడ్డవి. అందులో, "జంగిడ" అనేది ఒకటి. అది సంస్కృతపదమువలె వినబడక పోవడమేకాకుండా, కేవల తెనుగు పదమువలె వినబడ్డది. నాకు చాలావింత అనిపించింది.

### అథర్వణ వేదము 19.34

"Jangida, thou art Angiras, thou art a guardian, Jangida.

Let Jangida keep safely all our bipeds and our quadrupeds.

Amulet of a thousand powers, Jangida, save us all around."

దీనిక్రింద, పుట్టనోటుగా, గ్రిఫిత్ పండితులు ఇట్లు వ్రాసినారు.

"Jangida-a plant frequently mentioned in the Atharvana Veda as a charm against demons and a specific for various diseases. Jangida, a plant or tree which has not been identified"

ఈ వాక్యములతో నేను తృప్తిపొందక, మూలికలు తెచ్చే శూద్రు నొకనిని ప్రసంగవశాత్తు అడగగా, వాతనొప్పులకు పనిచేసే ఒక మూలిక పేరు "జంగిడ" అని అతడు చెప్పి ఏదో ఒకటి చూపినాడు. ఆపైని మూలి



కలతో వైద్యముచేసే ఒక స్వదేశీవైద్యునితో ప్రసంగిస్తే, ఆయనకూడా, వాతనొప్పులకు పనికివచ్చే ఒకమూలిక పేరు జంగిడ అని ఉన్నదన్నాడు. అంతేకాక, జంగిడ అనేరూపమే తెనుగుతనం చూపిస్తూ ఉన్నది.

తంగేడు, మారేడు, నేరేడు, మొదలగు శబ్దాలలో వృక్షవాచకముగా ఉన్న "ఏడు" శబ్దమే రూపాంతరముపొంది "జంగిడ"లో కూడా ఉన్నట్టు కనిపిస్తూఉంది. తెనుగు దేశంలో ప్రచారంలో ఉండడముచేతను, పాశ్చాత్యులు Not identified అని వ్రాయడంచేతను, ఆంధ్రదేశంలో వ్యాప్తిలో ఉన్న మూలికయే అథర్వణవేదంలోకి ఎక్కిందని నేను అనుకొంటూ ఉన్నాను.

### అథర్వణ వేదము X-7

"From which doth Chandra measure out his journey travelling over Skambha's mighty body"

ఈ వాక్యానికి గ్రిఫిత్ పండితులు

Skambha-the word is the same as Sthambha, a pillar or buttress. So Surya and Soma are called the pillars or supporters of Heaven అని వ్రాసినారు. కావున స్కంభమనగా స్తంభమని యర్థమైనట్లు కనిపిస్తూ ఉంది.

తెనుగులో ఉన్న "కంబము" అనేపదము లౌకిక భాషలో ఉన్న "స్తంభము" అనే పదములోనుండి పుట్టినదని చెప్పడంకన్న, వైదికభాషలో ఉన్న "స్కంభము" అనేపదములోనుండి పుట్టినదని చెప్పగూడదా ?

గ్రిఫిత్ పండితుల ఆంగ్లానువాదములో ఈలాంటి పదాలు మరికొన్ని కూడా కనబడడంచేత, మూలమే చదవవలెనని సంకల్పం కలిగింది. కాబట్టి, ఋగ్వేదము చదువుకోవడం ప్రారంభించినాను. చాలా పదాలు తెనుగువి, వైదిక భాషతో నేరుగా సంబంధము గలవి కనబడ్డవి. కొన్నిమాత్రమే ఇక్కడ వ్రాస్తాను.

### 1 వీలు

వీలు అనేపదానికి శబ్దరత్నాకరంలో,

వీలు. విధా- అనుకూలము- అని అర్థము వ్రాసి ఉన్నది.

మనము వాడుకలో "వీలుగాలేదు" అంటాము. ఇది దేశ్యపదముగానే భావించి వ్యవహరిస్తూ ఉన్నాము. ఈ క్రింది ఋగ్వేద మంత్రము చూడండి.

### ఋగ్వేదము 1-3-2

"స్థిరా వః సంత్వాయుధా పరాణుదే వీలు ఉత ప్రతిష్కభే"

వః ఆయుధాః యుష్మాకమ్ ఆయుధాని, పరాణుదే శత్రూణాం అపనోదనాయ, స్థి

రా సంతు స్థిరాణి భవంతు; ఉతఅపిచ, ప్రతి పక్షభే శత్రూణాం ప్రతిబంధాయ, వీలుః సంతు వృథానిసంతు.

ఇక్కడ వైదికమంత్రములోని "వీలుః సంతు" అనేదానికి "వీలుగా ఉన్నవి" అని అర్థం చెప్తే సరిపోతుంది. అప్పుడు వేదము లోని "వీలు"న్నూ తెలుగులోని "వీలున్నూ" సమానార్థకము లౌతవి.

కాబట్టి, తెలుగులోఉన్న "వీలు"అనేపదం వైదికభాషలో ఉన్న "వీలు" అనేపదంలో నుంచి పుట్టినదే అని ఏల చెప్పకూడదు ?

## 2. ద్రాపి

తెనుగువారితిట్లలో ద్రాపివెధవ అనేది చాలా తఱుచుగా ఉపయోగిస్తూ ఉన్నది. మనుష్యరూపము మాత్రము కనిపిస్తూ, మనుష్యునకు కావలసిన తెలివి తేటలు లేనివాణ్ణి "ద్రాపివెధవ" అంటాము.

శబ్దరత్నాకరమున,

ద్రాబ-దే.వి. అసారుడు, అసారము.

"ను", పక్కిటిలుబకుఱం బెలుంగఁబాలక ద్రాబలు నూర్చియల్లుడున్ - కవిక-1-ఆ

అనిన్నీ, అఘము-అఘుడు-

"నూబలచే నిట్లయితిమి
ద్రాబలమై"-పంచ-నా-2.ఆ.

అనిన్నీ, వ్రాసిఉన్నది.

"ద్రాబ" అనే పదము "ద్రాపి" అనే ఆధునిక పదమునకు గల అర్థమే కలదై, గ్రాంథికమైనది.

ఇక ఈ క్రింది మంత్రము చూడండి.

**ఋగ్వే-- 1-25-1.**

బిభ్రద్ద్రాపిం హిరణ్యయం
వరుణో వస్త నిర్ణిజం.

హిరణ్యయంసువర్ణమయం;ద్రాపింకవచం; బిభ్రత్ ధారయన్.

ఇందు ద్రాపియనగా, కవచ మర్థము. కవచము మనుష్యాకారము గలదేగాని, మనుష్యునకు ఉండే తెలివి తేటలు ఉండవు. కాబట్టి, మనుష్య జన్మమెత్తి, తెలివితేటలు లేనివానిని ద్రాపి.వెధవ అని తిట్టడం సహజం. ఈ ద్రాపి ద్రాబగా మారి గ్రంథాలలోకి ఎక్కింది. కాబట్టి, గ్రామ్యంలోని "ద్రాపి" న్నీ, వైదికభాషలోని "ద్రాపి" న్నీ ఒకటే అని చెప్పడానికి అభ్యంతరం ఉండ కూడదు.

## 3 అనన్

తెనుగు కావ్యాలలో "అనన్" అనే పదము ఒక చిత్రమైన అర్థంలో వాడుక చేస్తూ ఉన్నారు.

ఈక్రింది పద్యాలు చూడండి.

క|| వెను గాలిఁ దూలు మొగిళులో
యనన్,నిధనులు విఱిగి నిజబలావళిసదియం
దనమీదఁ బాఱ దుర్యో
ధనుఁడవలిచి సర్వసైన్యతతిఁబురికొల్పెన్
భార. భీష్మ - 2 ఆ.

ఇక్కడ అనన్అంటే అనేటట్టుగా అని అర్థం చెప్పతారు. మరోపద్యం చూడండి.

క. పలకయు వాలునుగొని, రె
క్కలుగల పెనుబాము పగిదిగవిసిన,గాంగే
యులునూది వెఱగుపడి రా
బలమును నీబలముఁజొగడేఁబటు శౌర్యము
నన్ భార - భీష్మ - 2 ఆ.

ఇందులో "పగిది"న్నీ పైదానిలో "అనన్" అనేదిన్నీ సమానార్థకములై, "వలె" అని అర్థం చెప్పడానికి వీలైనవై యున్నవి. మరియొకపద్యం చూడండి.

క. పతిపక్షకోటిన, నమకన
నతిశయమునఁగొంసుబలకెమ్మనఁ క్రియనయ
ద్రుతబలమునిలి పెనమ్మ్రో
రుతి సెలియలి కట్టక్రియ నిహూతక్షత్రైయై.
భార-భీష్మ-2 ఆ.

ఈ పద్యంలో ఉన్న అనన్, క్రియ, అనే రెండున్ను సమానార్థకము లన్నమాట స్పష్టమే.

కాబట్టి, పగిది, క్రియ, చందము మొదలగు పదములతో సమానార్థకముగా వాడుక చేస్తూఉన్న "అనన్" అనేదానికి "వలె" అని అర్థం చెప్పడమే ధర్మము.

ఈ క్రింది వైదికమంత్రము చూడండి.

**ఋగ్వే - 1-25-3**

విమృళీకాయ తేమనోరథీ రశ్వంనసందితం-
గీర్భిర్వరుణసీమహి-

హేవరుణ-మృళీకాయ అస్మత్సుఖాయ, తే తవ, మనో, గీర్భిః స్తుతిభిః, విసీమహి విశేషేణ బధ్నీమః - ప్రసాదాయ ఇత్యర్థః-అత్ర దృష్టాంతః-రథీః రథస్వామీ, సందితంసమ్యక్ ఖండితం, దూరగమనేన శ్రాంతం, అశ్వంన, అశ్వమివ, యథా స్వామీ శ్రాంతమశ్వంఘాసప్రదానాదినా ప్రసాదయతి, తద్వత్.

ఇక్కడ "న" అనగా "వలె" మనుచున్నది. మఱి యొకటి చూడండి.

**ఋగ్వే. 1.25 1.4**

పరాహిమే విమన్యవః పతంతి వస్యఇష్టయే, వయోన వసతీరుప.

ఇక్కడ "వయోన పక్షిణో యథా వసతీర్నివాసస్థానా న్యుపసామీప్యేన ప్రాప్నువంతి తద్వత్. అని వ్యాఖ్యాత్రము. కావున ఇక్కడకూడ "న" అనగా "వలె" అని అర్థము.

వైదికభాషలో "వలె"అని అర్థమిచ్చే "న" అనే పదము తెలుగులోనికి "నా" అని వచ్చి

చూ-శ్రీలలనానీలలనా
లీలలనా మతియుఁ గృతియు లెస్సనిలిచి"

శ్రీదేవీ, భూదేవీ అనేటట్టుగా అని అర్థమిచ్చి, అను ధాతువుతో చేరిపోయి "నా"కు రూపాంతరమగు అనన్ క్రింద మారి పోయినట్టు కనిపిస్తూ ఉంటుంది. కాకుంటే అనన్ అనేది పగిది, క్రియ, మొదలగువానితో సమానార్థకమై ఏల ఉంటుంది?

## 4 దబ్బ

దభీదభీ, దభాల్-దబ్బున

శబ్దరత్నాకరంలో,

దబ్బ-దే.వి.కొట్టు, తాడనము.

దబ్బున- దే. ప్ర. క్రి. విశే. శీఘ్రముగా.

దబ్బు-వడుచుటలోనగువానియందగుధ్వన్యనుకరణము.

గొబ్బునలేచి జలంబులు
దబ్బున జఱచుకొని నీలా 3 ఆ.

దబదబ- తలుపులోనగునవి తట్టుట, పరుగెత్తుట మొదలగు వాని యందగు ధ్వన్యనుకరణము.

దబ్బడించు- దే. స. క్రి. చేతులతో చఱచు అని ఈ విధముగా వ్రాసిఉన్నది.

ఈ పదాలన్నీ దేశ్యపదాలుగానే వారు భావించినారు. ఈక్రింది వైదిక మంత్రం చూడండి.

**ఋగ్వే. 1-108-4.**

నాహం తం వేద దభ్యందభత్స
యస్యేదం మాతిరసరం పరాకాత్

తం ఇంద్రం దభ్యంహంతవ్యమితి, నవేద నజానామి; కథం-స ఇంద్రో దభత్ [illegible] జనాన్ దభతి హినస్త్యేవ.

ఇందులో 'దభ్'ధాతువుకు కొట్టడమర్థము. కాబట్టి కొట్టడమనే అర్థంతో సంబంధించిన దెబ్బ, దబ్బున, దభీ దభీ, దభాల్, దబదబ,

దాలన్నీ దేశ్యపదాలని చెప్పడం వైదికభాషలో ఉండిన దభ్-ధాతువుతో సంబంధించినవని చెప్పడం సబబుగా ఉన్నదికదా.

### 5. అంజ

అంజ, అంగ, అజ్జ—అజ్జరే-

శ. ర.

అంజ. దే. వి. అడుగు, పాదము.

"అట రెండు మూడంజలరుగునప్పడకాళ్లం
బంకజాక్షికిం దొట్రుపాటుగదిరె;"

మను. 3 ఆ.

అంగ-దే. వి. కాలు చాచిపెట్టిన యడుగు.

అజ్జ-అడుగు, పాదము, సమయము.

"అజ్జపాటించి, మదివెఱపుజ్జగించి."

భార. శల్య. 1 ఆ.

వై. అవ్య. బళి.

"అజ్జగారం దిలకంబు హవణించి నడుట."

అజ్జగా- అజ్జయను శబ్దము పుట్టగా;

బళియనగా ననుట-

భద్రరాజపుత్ర చరిత్రము.

అజ్జరే.

"అజ్జరెయంచుం బంచుకొని రందఱు
వేల్పుచు ద్రవ్యదక్షిణన్-".

పాంచా 4 ఆ.

ఈ పదముల కన్నిటికీ, శీఘ్రగమనమనిన్నీ, తత్సంబంధమైన, వేగముగా వేసిన అడుగు అనిన్నీ అర్థము చెప్పితే బాధలేదు.

రెండుమూడంజలు అనగా, వడివడిగా వేసిన రెండు మూడడుగులు.

అజ్జగారం దిలకంబు హవణించి అనగా, వడివడిగా తిలకం దిద్ది అని అర్థము.

అజ్జరెయంచుం బంచుకొని రందఱు అనగా, వేగము వేగము అని ఒకరినే ఒకరు తొందర పెట్టుకొంటూ అనిఅర్థము. కాబట్టి, ఈ పదాలన్నీ ఒక్క మూలపదం నుంచి పుట్టినవిగానే ఉన్నవి.

ఈ క్రిందివైదికమంత్రం చూడండి.

అహన్నహిం పర్వతే శిశ్రియాణం
త్వష్టాస్మై వజ్రం స్వర్యం తతక్ష.
వాశ్రా ఇవ ధేనవః స్యందమానా
అంజః సముద్రమవజగ్మురాపః.

పర్వతేశిశ్రియాణ మాశ్రిత మహిం మేఘం అహన్ హతవాన్; అస్మై ఇంద్రాయ స్వర్యంసుష్టు ప్రేరణీయం యద్వా శబ్దనీయం సుత్యం త్వష్టా విశ్వకర్మా వజ్రంతతక్ష తనూకృతవాన్-

తేనవజ్రేణ మేఘే భిన్నే సతి స్యందమానా ప్రస్రవణయుక్తా ఆపః సముద్రమంజః సమ్యగవజగ్ముః ప్రాప్తాః-తత్రదృష్టాంతః వాశ్రావత్సాన్ ప్రతి హంభారవోపేతా ధేనవ ఇవ-యథాధేనవః సహసావత్సగృహే గచ్ఛంతి తద్వత్.

అంజః అనగా- అంజసా, సహసా అని అర్థము.

అంజసా అనగా - శీఘ్రగమనమున - అని అర్థము.

"తురగమంజసా యాతి"

కావున, అంజ, అంగ, అజ్జ అజ్జరె అనే పదాలు వైదిక భాషలోని "అంజః" అనేపదంతో సంబంధించినవని చెప్పితే దోషములేదు.

### సారాంశము

1. జంగిడఅనే పదం తెలుగుపదమై ఆంధ్రదేశములోని ఒకమూలికపేరై ఉన్నది.

2. స్కంభము అనేది తెలుగులోని "కంబము"నకు మూలపదమై ఉన్నది.

3. వీలు అనే వైదికపదంలో నుంచి తెలుగులో "వీలు"పుట్టినది.

4. ద్రాపి అనే తెలుగుపదం వైదికభాషలో "ద్రాపి"గానే ఉన్నది.

5. "న" ఇవార్థకముగా వైదికభాషలో ఉంటే, దానిలోనుంచి "నా" అనేదిన్ని, దానిలోనుంచి "అనన్" అనిన్నీ పుట్టి,"వలె" అనే అర్థంలో తెలుగులో వాడుక అవుతూ ఉన్నది.

6. వేదములోని దభ్ ధాతువునుండి తెలుగులో, దెబ్బ, దభీదభీ, దభాల్, దబ్బున, ఈ మొదలైన రూపాలన్నీ పుట్టినవి.

7. వైదికభాషలోని అంజః అనేపదం నుంచి, తెలుగులో అంజ, అంగ, అజ్జ, అజ్జరే అనే పదాలన్నీ పుట్టినవి.

ఈలాగు అనేకపదాలు తెలుగులోవి, వైదికభాషతో సంబంధము కలవిగా కనబడుతూ ఉన్నవి. నిఘంటుకర్తలున్నూ పరిశోధకులున్ను ఇదిగమనింతురుగాక. ఏదుర్మహూర్తమునవో, పాశ్చాత్యులు, వదిరీవద రని జ్ఞానంతో ఆర్యద్రావిడ భేదం భాషలకూ జాతికీ కూడా తెచ్చిపెట్టినారు. ఆవిభాగం దావాగ్నివలె వ్యాపించడం కాకుండా దేశంలో కొన్ని కలహాలకు కూడా కారణం అయినది. కాల్డువెల్ గారు ద్రావిడభాషల ప్రత్యేకత ఋజువుచేయడం కోసం యెంత తంటాలుపడ్డా, అతని సమకాలికులే అతని మాట కాదన్నారు. కాల్డువెల్ గారితో సమకాలికుడు Charles E. Gover గారు **A simple error may lead to gigantic mistakes** అన్నారు. తరువాత వారే వ్రాసిన వాక్యాలు చూదాం.

**The first principle is of vital importance in connection with a subject that has never been thoroughly examined - the race to which the Dravidian nations belong. Since the learned book by "Caldwell" comparative grammer of Dravidian languages-was issued it has been taken for granted that the Tamils etc. are a Turanian people. The progress of philological enquiry and the new means of analysis furnished by the great German writers on language have shownthe error of this classification Driven at a very early period into the extreme south, and cut off by vast oceans from intercourse with other peoples, the Dravidian nations have preserved with singular purity the vocabulary they brought with them; and it is probably not extravagant or untrue to say that there is not one true Dravidian root common to the three great branches Tamil, Telugu & Canarese, that cannot be clearly shown to be Aryan. As an interesting example both of the true character of the language and the linguistic progress made since the publication of Dr Caldwell's book, it may be noted that the learned doctor gives an appendix centaining a considerable list of Dravidian words which he asserts to be Scythian, and most efficient witnesses to prove the Turanian origin of the language. It is now known that every word in this list is distinctly Aryan, althogh some of them have**

representatives in the Finnish group of Turanian tongues – the group which has been most constantly exposed to Aryan influences. The greater portion of them are included in Fick's Indo Germanischar Grunds Prache as Aryan roots, although Fick does not appear to have seen Caldwell's work.

(Gover's "The Folk songs of Southern India".)

ఈ వాక్యములవల్ల, ఆర్యద్రావిడ విభాగము అవసరములేని పని అనిన్నీ, ఆంధ్ర భాషలోని పదాలకు సంస్కృతభాషలో గాని, వైదికభాషలోగాని మాతృకలు కన పడవచ్చుననిన్నీ స్పష్టమగుచున్నది. యూనివర్సిటీవారున్ను, ఆంధ్ర పరిశోధకులున్ను ఆంధ్రభాషలోని పదములకు వైదిక భాషలోనుంచి అవకాశ మైనంతవరకు మాతృకలను వెదకి సంపాదించి, ఆంధ్ర భాషకు గల ప్రాచీనత్వమును నిలుపవలెనని ప్రార్థిస్తూ ఉన్నాను.

---

# కాకి

## 'కుమారదేవ'

నెమిలియీఁకలు దాల్చి నిక్కి తిరిగినంత ఫణిరాజములు, భీతిఁ బాఱఁగలవె ?
మృతసర్పములఁ దెచ్చి మెడవైచుకొనినంత పులుఁగుఱేఁడని పేరు పొందఁగలవె?
ఒకకంటిచూపుతో నూరేగినంతనె అమరగురునిగుండె లదురఁగలవె ?
గొంతు బొంగురువోవఁ గూసినయంతనె కోయిలల్ నిను సడ్డసేయఁగలవె ?
తగరు కొండతో మార్కొని తాళఁగలదె?- ద్వీపముతోఁ బోరి కుక్క సాధింపఁగలదె?
అంచ ఢీకొని కొంగ జయింపఁగలదె? - వట్టియాస లవేటికే వచ్చకాకి?

ఎంగిలిమెదుకుల నేఱి తినుటె కాని పాలు నీరము వేఱుపఱుపఁగలవె ?
కర్ణకఠోరంబుగాఁ గూయుటేకాని పంచమస్వరమునఁ బాడఁగలవె ?
కాళ్లుగట్టినగాడ్దకరణి దూఁకుటెకాని నాట్యంబు లీల నొనర్పఁగలవె ?
తపతప ఱెక్కలు దట్టి లేచుటె కాని గఱులెత్తి వినువీథిఁ దిరుగఁగలవె ?
పగ్గెఁ బొగఁద్రావఁగా గుండె పట్టుకొనదె - ఎంతపొడవున్నదో తోఁక యంతవిసరు
ముడుమునకుఁ బెత్తనం బేటి కూరిలోన ? - పదర నేటికి యింత కే పలువ కాకి !

పిండంపుమెదుకు లన్వేషింపఁబోరాదె, యాగశాలలచెంతఁ దూఁగనేల ?
కుష్ఠరోగులచెంతఁ గూర్చుండఁగారాదె, రాజహంసలతోడి రాపదేల ?
పేఁడదిబ్బల నడయాడఁ బోవఁగరాదె, పదుగురలోఁ బారుపత్తె మేల ?
పుచ్చిపోయినపుండ్లఁ బొడువఁగాఁబోరాదె, గుడులలో విష్ఠింపఁ గడఁగనేల ?
మేకుఁబెఱికిన కోఁతి కేమేలు కలిగె ? - నారిగొఱికిన నక్కేమి వారుకొనియె ?
వాయిదెఱచిన కూర్మ మేఫలము నొందె ? - మఱచిపోనేటి కింతలో మాలకాకి !

నా 'సుభాషితావళి' లోనుంచి

---

# ఏకభాష - ఏకలిపి

వున్నవ లక్ష్మీనారాయణ



## ఏకభాష

మన దేశములో నిప్పుడు పలు భాషలున్నవి. అవి మనకు తల్లిభాషలు; చాల మృదువయినవి కూడాను. మంచి వాఙ్మయము కలవి. ఒకతల్లి బిడ్డల కెట్టి యన్యోన్యాభిమాన ముంటుందో ఒకభాష మాట్లాడువారికికూడ ఐకమత్యముంటుంది. ఒకటిగావుండి మంచి చెడుగులకు ఏకమవుతాము. కాని ఏకభాష ఏకత్వమునకు ఎట్లా తోడ్పడుతుందో అట్లే భిన్న భాషలు భిన్నత్వానికి తోడ్పడుతవి. ఇప్పటికి వేయి సంవత్సరములనుండి మన దేశముయొక్క చరిత్రను పరికించినయెడల మన స్వాతంత్ర్యమును గోలుపోయి పలుచిక్కుల బడుచున్నను ఈ కష్టముల విరుగడకై చేసిన ప్రయత్నములు ఏ శిక్కులలో, ఏ మహారాష్ట్రులో, ఏ ఆంధ్రులో చేశారుగాని హైందవులందరు కలిసి చేసియుండలేదు. మనమందరము ఒకటను భావముకూడ నశించినది.

మనమందరము ఏకజాతిగా నెందుకు భావించుకొనవలెను, బంగాళీలు, హిందీలు, మహారాష్ట్రులు, ఆంధ్రులు, కన్నడులు, అరవలు అని భిన్న జాతులుగా నుండగూడదా యనిన అట్టి భిన్నత్వము కూడదనిన్ని, సేతుశీతనగ పూర్వ పశ్చిమ సముద్ర మధ్యస్థమయిన దేశమంతయు ఒకటనిన్ని, ఏకనాగరకత ఏకవిజ్ఞానము ఏకమతము గల హిందూ జాతియంతయు ఒకటనిన్ని, ఏకత్వమును ఇంకను బలపరచుకొనుటయే క్షేమమనిన్ని అందరమును భారతీయులమనిన్ని, భారతమాతృ సంతానమనిన్ని కోరుచున్నాముగాని, ఆంధ్రులు అరవలు అను జాతులుగా విడిపోవలయునను భావము మనకులేదు. అందరమును కలిసి భారతజాతియనిపించుకొనవలయు ననుభావమే మన కక్కరలేకపోతే ఈచర్చలతో పనిలేదు. భారతమాత, భారత నాగరికము, భారత విజ్ఞానము, భారతజాతి యను విషయములు ప్రధానముగా నెంచుకొననివారితో మనకు చర్చ అవసరములేదు. ఈ ఆదర్శము గలిగి దీనిని బలపరచుకొన నుద్దేశము లేనివారికిని మనకును గమ్యస్థానము వేరుగనుక వారితో విమర్శ మన కవసరములేదు. ఈఆదర్శమును పొందగోరువారమే గమ్యస్థానమును చేరుటకు సాధనము లరయుచున్నాము.

దేశములో జాతీయభావము బలపడేకొద్దీ శాఖాభిమానము చచ్చిపోతుందనీ, నా నియోగితనము, నా ఆర్వేలతనము, నా కమ్మతనము, నా కాపుతనము, నా రెడ్డితనము, నా ఎరుకులతనము, నా ఏనాదితనము ప్రాముఖ్యమును గోల్పోయినకొద్ది సాంకర్యమెక్కువవుతుందనీ దుఃఖించే శాఖాభిమాను లనేకు లుండవచ్చును. ఈ అభిమానములకును అరవత్వాంధ్రత్వాది అభిమానములకును తేడాలేదు. అరవత్వాంధ్రత్వములు భారతీయతకు ప్రతిబంధకములయినట్లే, భారతీయత విశ్వమానవత్వమునకు ప్రతిబంధకము కాదాయని ప్రశ్నింపవచ్చును. సృష్టిలోని ఏకత్వమునకు బహుత్వమునకు సామరస్యము కుదిరినట్లే విశ్వమానవత్వమునకును జాతీయతకును సామరస్యము కుదుర్చుకొనవలయును. అది కుదరకనే యిప్పటి యుద్ధములు, ద్వేషములు చెలరేగుతున్నవి. విశ్వమానవత్వమునకు ప్రతిబంధక మయిన

జాతీయత కూడదనియే చెప్పవలయును. విశ్వమానవత్వమునకు ప్రతిబంధకమగు జాతీయవైలక్షణ్యములను నిర్మూలించితీరవలయును.

అటులనే జాతీయతకు ప్రతిబంధకమయిన అంతర్జాతీయత పనికిరానిమాట వాస్తవము. సాధ్యమయినయెడల భారతజాతీయతకు ప్రతిబంధకములను నిర్మూలింపవలసినదే. హిందూ మహమ్మదీయ క్రైస్తవాది విభేదములు మన జాతీయతకు వేరుపురుగులే. సాధ్యమయినయెడల నిర్మూలించవచ్చునుగాని మింగరాని కీడులు. కనుక విధిలేక ఈ భేదముల నంగీకరించుచు సాధ్యమయినంతవరకు కజ్జాకారణముల తొలగించుకొనుచుండవలయును.

మరియొక విషయముగూడ యోచించవలయును. మానవ విజ్ఞానమునకు హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ సాంప్రదాయములు మిక్కిలి సహాయకారులై యుండవచ్చును. కాని భారతదేశములో ఆంధ్ర కన్నడాది మండలముల విభాగముగాని, భాషల భిన్నత్వముగాని, కమ్మ కాపు మొదలయిన చీలికలుగాని అవసరము లేదు. కాలకర్మవశమున మన దురదృష్టముచే ఈభేదములు దాపరించినవి. ఏ కెమాల్‌పాషావంటి మహనీయుడో ఏ తిరువాన్కూరు మహారాజావంటి వీరుడో పుట్టి శాసనమువలననో, శాపమువలననో, చాపమువలననో, ఈ భేదముల నొక్కుమ్మడిన అంతరింపజేసి ఏకజాతీయత నెలకొల్పుభాగ్యము మనకు కలుగలేదు. కనుక వ్యాసములకు, చర్చలకు, ఉపన్యాసములకు కావలసినంత అవకాశము కలిగినది. అందువలన నియోగిశాఖా సంస్కారులు, కమ్మకులోద్ధారకులు, సౌరభాషావ్యాకర్తలు, కోయభాషాలిపి నిర్మాతలు, ఆంధ్రతోద్ధారకులు మన దురదృష్టము కొద్దీ ఇంకా పుట్టుతూనే వుంటారు. పరపతి సంపాదించు కొంటూనూ వుంటారు. మన దేశములో ఎవరితోనూ భుజింపక స్వయంపాకము చేసికొనువాడు మహాత్ముడు. అంటరానితనములో ఎక్కువరుచి వున్నది.

కాని భగవదనుగ్రహమువలన దేశమంతయు ఒక్క పరరాజుక్రిందికి వచ్చి అన్నిరకముల చీలికలును ఒక మూసనబడి కరిగి అంటుకొనిపోతున్నవి. రాష్ట్రములు, సంస్థానములు, మండలములు, నాడులు, శాఖలు, భాషలు కరిగి, మండి మసియై పోతున్నవి. మధ్య మధ్య విభేదవాదులు లేచి గోల పెడుతూనే వుంటారు. భగవంతుడు పెట్టినమంట ఆగుతుందా? బ్రిటిషురాష్ట్రములు, స్వదేశ సంస్థానములు కలిసి ఒక్క ఫెడరల్ ప్రభుత్వమయినట్లు జాతినంతను ఏకత్వము పొందించుటకు ప్రధానసాధనమయిన ఏకభాష వచ్చితీరవలెను. హిందీభాషయే అట్టి పనికి తగియున్నది. అది నిర్బంధముగ నందరు నేర్చుకొనితీరవలెను. ఒకటవ ఫారము నుండియో, లేక అంతకుముందుగనో ప్రారంభించ వచ్చును.

అయితే అరవము మొదలగు దేశభాషలకు ప్రాముఖ్యము తగ్గదా యని ప్రతిపక్షులు గోలబెట్టుతున్నారు. "నాకుమాత్రము అరవభాషాభిమానము లేదా? అరవమునకు ప్రాముఖ్యము తగ్గిస్తానా" అని రాజగోపాలాచార్యులుగారంటున్నారు. దేశభాషలకు ప్రాముఖ్యము తగ్గునుగాక, తగ్గకపోవునుగాక, లేక అవి అంతరించునుగాక. మనకు ఏకభాష లభించినయెడల తక్కినభాషలు పోయినను విచారము లేదు. ఏకభాష యయిన హిందీ మన దయినప్పుడు గదా మనభాషలు పోవడము? అప్పుడు హిందీ మనభాష అవుతుంది. అయ్యో మన కంబడు, మన నన్నయ్య తిక్కనలభాష పోదా? పోతుందేమో! మన మాతృభాష పోదా? పోతుందేమో! ఒకప్పుడు మన ఆంధ్రదేశములో మాతృభాషయయి, హాలుడు, గుణాఢ్యపండితుడు మున్నగు రెండువందల మహాకవులచే పెంపుగాంచిన ప్రాకృతభాష యేమయినది? కాలము చేసినది. అమ్మలు చనిపోరా? ఎల్ల కాలము బతుకుతారా? విచారపడతాము. కాలగతి ఎవరు తప్పించగలరు? కాలముయొక్క అవసరమునుబట్టి హిందీ ఏకభాష కావడము అవసరము. తక్కినభాషలు పోవలసినపనిలేదు. అనవసరముగ భయపడి దుఃఖించువారికి వేదాంతము చెప్పాను గాని జానుతెనుగు పోవలయు నని నేను కోరను. కాని అమ్మ పోతే నేనూ దుఃఖిస్తాను. హిందీమాత్ర మవసరము.

అయితే హిందీయొక్క విశేషమేమి? అది పౌరుషవంతమయిన భాష. విశేషజనమునకు మాతృభాష. ఉత్తరాదివారందరికీ తెలుసును. దాక్షిణాత్యులలో గుజరాతి, మహారాష్ట్రులు సులభముగా గ్రహిస్తారు. ద్రవిడులలోగూడ ఏ కొంచెమో హిందీభాష రాని

హాచ్చ లేదు. వాఙ్మయము తక్కువయితే అందరు గలిసి త్వరలో వృద్ధిచేస్తారు. మహమ్మదీయులకుకూడ చేరికలో వుండేది హిందీభాషయే. కనుక హిందీయే దేశ భాష కాదగినది.

**ఏకలిపి**

ఇక లిపివిషయము యోచింపవలసియున్నది. ఉత్తరదేశము లన్నియు దేవనాగర లిపి నుపయోగించు చున్నవి. మహారాష్ట్రులును, గుజరాతులును దేవ నాగరినే ఉపయోగించుచున్నారు. దక్షిణదేశములో సంస్కృతము చదివే ప్రాచీనపండితులును, సంస్కృత భాషను జదువు ఇంగ్లీషువిద్యార్థులును నాగరిని నేర్చు కొనుచునేయున్నారు. దక్షిణదేశములో హిందీని ప్రస్తు తము చదువుచున్నవా రందరును దేవనాగరి లిపినే ఉపయోగించుచున్నారు. కాని అరవ కన్నడ తెలుగు మలయాళభాషలవారు మాత్రము ప్రత్యేక లిపులలో గ్రంథముల వ్రాసికొనుచున్నారు. హిందీని అందరును దేవనాగరిలోనే చదువుకుంటారు గాని ద్రవిడలిపు లలో చదువవలయుననువారు లేరు. సామాన్యలిపి కావ లయు ననేది ఒక్క ద్రవిడభాషలవారికి సంబంధించిన సమస్య. అందరు దేవనాగరిలిపిలో ద్రవిడభాషలను వ్రాయునెడల చాలవీలుగా నుండగలదు. కాని ఇండి యాదేశములోని ఏభాషలోను టైపు, టెలిగ్రాపు మున్నగువానికి సౌకర్యములు లేవు. అవి మన కుండి తీరవలయును. ఇట్టి సౌకర్యములు సంపూర్ణముగ గలది రోమక లిపియే. దీనినే ఇంగ్లీషు, జర్మను, రషియను మొదలగు అన్ని దేశములవారును, ఉపయోగించు చున్నారు. తురుష్కదేశములోగూడ నీ నడుమ అరబ్బీ లిపిని త్రోసివేసి రోమకలిపిని ఉపయో గించుచున్నారు. ఉర్దు అరబ్బీలిపిలో వ్రాయబడు చున్నది. ఈలిపిలో టైపు టెలిగ్రాము సౌకర్యములు లేకపోగా, అచ్చుసౌకర్యములుగూడ లేవు. హిందువుల తోడి స్పర్థచేతనే మహమ్మదీయులు యీ లిపికై ప్రాకు లాడుచున్నారు. మన క్రైస్తవులు రోమకలిపికి అను కూలపడతారు. హిందూమహమ్మదీయులుకూడ కలిసి రోమకలిపి నవలంబించినయెడల సౌకర్యములు సమకూ రుటయేగాక తగాదాలుకూడ తీరిపోతవి. తెలుగుభాషకు గెలెటీగారు రోమకలిపిలో ఒక పెద్ద తెలుగు నిఘంటు వును రచించి తెనుగునకు రోమకలిపి ఎంతయు తగియు న్నదని రుజువు చేసినారు. అరవములోగూడ కొందరు మిషనరీలు రోమకలిపిలో అరవవాచక గ్రంథముల నచ్చువేయించి ఉపయోగించుచున్నారు. ఈ ఉద్యమ మును అనవసర చర్చలలోనికి దింపక అందరు యోచించ దగియున్నది. రోమకలిపి ఇంగ్లీషువారి దని మాత్రము పొరపడకుందురు గాక.



# కళలకోసరం దేవదాసీ జాతి



★ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి ★

విత్తమాత్రోపాధికమైన వేశ్యాసమాగమాన్ని కవులు పూర్తిగా యీసడించే వున్నారు కాని మృచ్ఛకటికలో మాత్రం ఆ విషయాన్ని యెత్తుకొని మిక్కిలి చక్కఁగా రసపోషణ చేసివున్నాఁడు శూద్రక మహాకవి.

అందులో వున్న నాయిక వసంతసేనసంపదను వొకమహారాణీసంపదగా వర్ణించాఁడు - అట్టి వసంతసేనను కేవల గుణానురక్తనుగా నిరూపించి ఆమెయందే పాతివ్రత్యాన్ని ఆపాదించి వున్నాఁడు. కాని అట్టిది స్వీయగానే పరిగణింపఁబడుతుంది గనక వేశ్యాకులంలో పుట్టినంతమాత్రంచేత వేశ్యనుగా ఆమెను పరిగణించకూడదని పలువుర అభిప్రాయం. అనాదిగా మనలో ఈజాతికి కొంత ప్రాధాన్యం వుంటూనే వుంది. బ్రాహ్మణకులంలో పుట్టి బ్రాహ్మణజాతికి విహితమైన స్నానసంధ్యాదినియమాలు లేకపోయినా ఆవ్యక్తిని బ్రాహ్మడుగానే పరిగణించడమున్నూ పైనియమాలు వున్ననూ అన్యుణ్ణి బ్రాహ్మడుగా పరిగణించకపోవడమున్నూ భారతాదికంవల్ల విస్పష్టమే. అలాగే సంసారిగా వుండేవేశ్యను సంసారిగా పరిగణింపక వేశ్యగానే పరిగణించడమని గమనింపవలసి వుంటుంది. వేశ్యావృత్తిని నిర్మూలించడానికి ముఖ్యమైన నిర్మూలనోద్యమం కంటే కొంత పూర్వమే సంఘసంస్కర్తలు ప్రారంభించారు. ఆ వృత్తి యెంతవఱకు నిర్మూలింపఁబడిందో కాని ముందుగా దేవాలయాల్లో జరిగే నృత్తాదులు పూర్తిగా రూపుమాశాయి. ఆనాకొదీ భూములు జిరాయతీలోకిచేర్చి పన్ను గట్టడంవల్ల గవర్నమెంటుకు దానివల్ల కొంత లాభం కలిగింది గాని, గవర్నమెంటువారు స్వతహాగా యీస్వల్పలాభానికి అపేక్షించారని అనుకోవడానికి అవకాశం లేదు. శారదాబిల్లువలెనే యీ బిల్లున్నూ మనలో ప్రముఖుల కోరికమీఁదనే గవర్నమెంటు ఆమోదించడం జరిగింది- ప్రతి రోజున్నూ భగవదారాధన చేసుకునేజపితలు తుట్టతుదను- "నృత్తం దర్శయామి, గీతం శ్రావయామి" అనడం సర్వానుభవసిద్ధం. దీన్నిబట్టే మహారాజులు ఆ కూ ఆలయా ల్లో నృత్తగీతాది వాద్యాదులకు వృత్తులేర్పఱిచి వున్నారనుట సత్యదూరం కాదు. అయితే యీ నృత్తగీతాలు మొగవాళ్లవల్లఁగాని లేదా? సంసారిస్త్రీలవల్లఁగాని యెందుకు భగవత్సన్నిధిలో జరిగించకూడదంటూ కొందఱన వచ్చును. సంగీతవిద్యలో మహావిద్వాంసులనిపించుకొనేవాళ్ళందఱున్నూ మొగవాళ్లే కాని రంజకత్వం మాత్రం స్త్రీగాత్రమంటే కాని పురుషగాత్రమందుఅంతగా వుండదు. నాట్యం విషయంలో చెప్పనే అక్కఱలేదు. మృచ్ఛకటికలో యీ విషయాన్ని శూద్రకమహాకవి బాగా వివరించి వున్నాఁడు. నాట్యాభినయాలేమి, గానమేమి? అవి స్త్రీలకు జన్మహక్కుగా వొప్పుకోవలసివుంటుంది. స్త్రీవేషధారులుగా వుండి రంజింపఁజేసిన పురుషులున్నూ కొందఱు వుంటారు, పురుషవేషాన్ని ధరించి రంజింపఁజేసే స్త్రీలున్నూ కొందఱు వుంటారుకాని, అది సార్వత్రికం గాదు కనక ఆ యీవిషయం అంతగణించతగ్గది కాదు. అందుచేత నృత్తగీతాలకు భగవత్సన్నిధిని గాని యితరత్రా జరిగే శుభకార్యాలల్లోఁగాని స్త్రీలే వుండవలసివస్తుంది. ఆ పద్ధతిని స్వతంత్రత్వంతో సంబంధించిన స్త్రీలు, అవివాహితలు తప్ప పనికిరారు— అందుకోసం యీ వేశ్యాజాతి యేర్పడ్డట్టు తోస్తుంది-"సగం చచ్చి సంగీతమూ, అంతా చచ్చి హాస్యమూ" అంటూ వక లోకోక్తి వుంది. అంటే సంగీతానికి లజ్జాత్యాగం అవసరం. అట్టి త్యాగం కులస్త్రీధర్మం కాదని వ్రాయనక్కఱలేదు. అభినయానికి పూర్తిగా సిగ్గుంటే పనికిరాదు. కాఁబట్టి యీ విద్యలో పేరుప్రతిష్ఠలు సంపాదించడం అనాదిగా కులస్త్రీలలో లేకపోవలసివచ్చింది. యెక్కడో వకరిద్దఱు స్త్రీలు యుద్ధంకూడా చేసినట్టు చరిత్రజ్ఞులు వ్రాస్తూ వున్నారు. దాన్ని కాదనవలసి వుండదు. అంతమాత్రంచేత స్త్రీలందఱూ మిల్టరీలో చేర్చుకోతగ్గవారే అవుతారా? — "కడవంత గుమ్మడికాయా కత్తిపీటకు లోఁకువ" అనే సామెత వినలేదా? యీశ్వరుఁడు బ్రహ్మదేవుణ్ణి మహిషాసురుఁడికి స్త్రీలచేతులో తప్ప యితరుల చేతులో చావు లేకుండా వరమిచ్చినందుకు యేలా మందలిస్తూవున్నాఁడో, చూడండీ!

"ఈ. తెచ్చితి వీయనర్థమును
దేవత లంకఱుఁగ, వరంబు ను
న్నిచ్చి; యిఁకేమి సేయ వసు?
నెవ్వరికేనియు వాఁడవధ్యుఁడో
నచ్చపలుకఁ వధింపఁగ
నంగన లెవ్వరు? నీతలోదరన్
బుచ్చెదొ? నాతలోదరిని
బుత్తునొ? పుత్రునొ? వాసవాంగనన్."

యీశ్వరుని వాక్య మహాకాళి యుద్ధసమర్థురాలే అయినా జనరల్‌గా వ స్త్రీ స్వభావం యుద్ధానికి అనుకూలమయినది కాదు కనక

...శ్వరుఁడు ఆలా చెప్పినట్టు విస్పష్టమే. సంసారిస్త్రీలల్లో వేశ్యలతోపాటు గాని అంత కన్నా మిన్నాగాఁ గాని గానాభినయాలు అభ్యసించతగ్గ వ్యక్తులు కొందఱు వుంటేవుందురుగాక, ఆ స్త్రీలను ఆయాసభలకు పంపి తద్ద్వారా ఆయా భూములను అనుభవించడానికి యే గృహమేధిన్నీ ఆమోదించడం సర్వథా అసంభవం గనక యీవృత్తికై మన పూర్వులు వకజాతిని యేర్పటిచినట్టు విస్పష్టమే. అవివాహితలైన కారణంచేత ఆ స్త్రీలను కొందఱు పురుషులు ప్రేమించడం వగయిరాలు కలిగినాయి ధానివల్ల కొంత అనర్థమున్నూ కలిగింది. అంతమాత్రంచేత ఆజాతి దూష్యమనిన్నీ, వ్యభిచారానికే యేర్పడ్డదనిన్నీ భావించి "యితరఖండాలలో యిట్టిజాతి లేదు; మనఖండానికే తటస్థించింది యీ లజ్జాకరమైన ప్రారబ్ధం" అంటూ మనవారు ఖేదగించుకోవడం చూస్తే కొంత ఆశ్చర్యంగా వుంటుంది. ఆ దేశంలో వున్న లజ్జాకరత్వం ఆదేశీయులు అన్యథాగా కప్పుచల చేసుకుంటూ వున్నారు- అనాథశరణాలయాలు యెందుకోసం ఆ దేశంలో పుట్టఁబడ్డాయి? వేశ్యాపుత్రులకు తండ్రి యెవఁడో తెలియకపోవచ్చునుగాని తల్లీ యెవరో తెలుస్తుందిగదా! ఆశరణాలయంలో చేర్చఁబడ్డ వాళ్ళకు తల్లినిగూర్చికూడా తెలియదుగదా! ప్రతిజాతికిన్నీ యిట్టికర్మం తటస్థింప చేయడంకంటె దీనికోసం వకజాతిని నిర్బంధం లేని పద్ధతిని యేర్పాటు చేసుకోవడమున్నూ, ఆజాతికి ప్రధానజీవనం గీతాభినయాలమీఁద జరగడానికి వృత్తులు కల్పించడమున్నూ యుక్తంగా వుందేమో చూడండీ! అయితే యీవృత్తియం దెంతో తప్పిదం కనపడుతుంది కనక దీన్ని నిర్మూలిస్తేనేకాని వల్లకాదంటారా? అనండి. కసాయివ్యాపారం అంటూ వుంది కదా? వకటి రాజులు వగయిరాలు మాంసాన్ని తింటే తిన్నారుకాక, జంతువధకంటూ శాలలు నిర్మించినట్టు గ్రంథాల్లో కనపడదు- యే అడివిలోనో వేటాడి తెచ్చిన మాంసాన్ని అమ్ముకునేవాళ్లు అమ్ముకునేవారు, కొనుక్కుతినేవాళ్లు తినేవారు. అంతే. భారతంలో ధర్మవ్యాధుఁడు చెప్పిన మాటలుకూడా యీ అర్థాన్నే బోధిస్తాయి. జంతువులవధ్యస్థానానికిన్నీ వేశ్యాగృహానికిన్నీ చాలా భేదం వుంటుంది. మాంసం తినేవాళ్లంటూ లేకపోతే ఆవృత్తికి వకజాతితో అవసరం వుండేదేకాదు. ప్రస్తుతంకూడా పురుషు. లంపటులూ నీతిపరులే అయితే వీళ్లుకూడా అవివాహితలుగా వుండికూడా బ్రహ్మచారిణులుగానే వుండేవారేమో? కొందఱి అభిప్రాయం యీజాతి కులస్త్రీలపాతివ్రత్యాన్ని కాపాడడానికి యేర్పడ్డట్టుగా కూడా కనపడుతుంది- యీ అభిప్రాయాన్ని పురస్కరించుకొనియ్యేవే పాండవప్రవాసంలో మేమీ పద్యం వ్రాసింది.-

"చ. పసులును లేరె? యెందుఁ బెఱ
 చానలె? కావలెనే? స్వకాంతలే
ల పనికిరారు? రా రనుము
 లంజలు లేరె? భవాదృశుల్ నృపా
లపశువు లంగనాజనము
 లక్ష్ గిఱరింతు రటంచుఁ గాదె? శు
ద్ధపశుసమానజాతి నొక
 దానిని ధీవరు లొప్పి రోజడా!"



యీపద్యం భీమరాజు సైంధవుణ్ణి మందలించే ఘట్టంలోది- పై పద్యంలో వేశ్యలు పశుతుల్యులుగా చేర్కొఁబడ్డారు. అందుకు ఆధారం, "పశువేశ్యాదిగమనే ప్రాయశ్చిత్తం సమాచరేత్."

ఆనే ధర్మశాస్త్రం. యిప్పుడు లోకంలో స్త్రీలు వాళ్లంతట వాళ్లు యితరదేశాలనాగరికతకు లోఁబడి తమతమశీలానికి భంగం తీరికూర్చుని తెచ్చుకుంటూ వున్నారేకాని ప్రభుత్వంగాని, అందులోవుండే ప్రముఖులు గాని దుర్నీతిపరత్వానికి లోఁబడి బలవంతంగా స్త్రీల శీలాన్ని లేశమున్నూ భగించడం లేదు- వెనకటికాలం ఆలాటిది కాదు. వకజమీందారున్నాఁ డంటే వాఁడికి వాఁడిగ్రామాల్లో వుండే స్త్రీ లంపటులున్నా. అవసరమైతే భార్యత్వానికి అంగీకరించ వలసిందే--యీ విషయం యిప్పుడు తగ్గిందేమో కాని నైజాంలో వుండే యెస్టేట్లు కొన్నిటిలో నిన్న మొన్నటివఱకూ తఱుచుగా అమల్లోనే వుండేది.

"శా. ఆ రాజేంద్రుఁడు రాత్రియుం బవలుఁగా
 మాపత్తిచే నూరిలో
 నీరజేక్షణలన్ బలాత్కృతిగ నెం
 తే బాధ పెట్టెంగ నా,
 యూరన్ గాఁపుర ముండువార లొకరో
 జొక్కొక్కఁ డాత్మీయ యా,
 దారం బంపెద నన్న నొప్పెనఁట! యా
 తం డెంత ధర్మాత్ముఁడో?"

రాజులూ, రాజపురుషులూ పూర్వం బకాసురుఁడులాగ నిన్నమొన్నటిదాఁకా సంసారిస్త్రీలను బాధించడం వుండేది. ఆగర్భశ్రీమంతులుగా పుట్టి దుర్నీతులైన నాకర్ల చేత పెంచఁబడి దుర్నీతులై యెందఱో జమీందార్లు లోకబాధకులుగా వుండడం చూచే అనుకుంటాను ఆనాఁటి విద్వాంసులు రాజులకు ప్రతివుపచారానికిన్నీ స్త్రీలనే యేర్పటిచినట్టు కనపడుతుంది. కాదంబరివగైరా గ్రంథాలిందుకు వుదాహరణంగా ఉంటాయి. మహానీతిధురంధరుఁడైన బుద్ధభగవానులుకూడా యీస్త్రీమయమైన భోనులో కొంతకాలం యితరరాజులవలెనే ఆయావుపచారాలు అనుభవించి వున్నాఁడు. యెక్కడో తప్ప రాజులకు తఱుచు దాసీసంపర్కంతప్పదన్నమాటే! యెందుచేత? ప్రతిక్షణమందున్నూ వాళ్ల సాన్నిధ్యం కలిగి వుంటుందిగదా?—"కలుగనే కలుగదు కలిగెనేనియును రాజునకు దాసస్త్రీగమనము గల్గు" అని మేము వ్రాసిందికూడా పైసందర్భాన్ని మనస్సులో పెట్టుకొనియ్యేవే. మొత్తం చామరగ్రాహిత్వంమొదలు పాదసంవాహనకృత్యందాఁకా పూర్వపు రాజులకు స్త్రీలవల్లనే జరగడాని క్కారణం చూస్తే వీరిబాధ పతివ్రతాలోకానికి తప్పించడానికేమో అనుకుంటాను. వాళ్లనే రాజదాసీలంటారు. అగ్నిమిత్రుఁడు పెండ్లాడిన మాళవిక యీ తెగలోదే కనక నావూహను కొంత బలపఱుస్తుంది. కాని ఆమెను రాజకుమారికగా కాళిదాసు సమర్థించివున్నాఁడు. అది నాటకసంప్రదాయపుమార్పనుకోవాలి. వీళ్లలో యెక్కడో తప్ప విద్యావతు లుండరు. విద్యతో సంబంధించినజాతి దేవదాసీజాతి. ఆజాతికే వేశ్యాదిశబ్దాలు వర్తిస్తాయి. దక్షిణాదిని యీ కుటుంబాలలో యెక్కడో తప్ప దేవాలయపునౌకరీ వుండ



"రికెటిజబ్బువలనను పండ్లజబ్బు వలనను బాధపడుచున్న నాస్వంతబిడ్డకు కల్జానా యొసంగితిని. కల్జానా యిచ్చినతరువాత బిడ్డకు మంచి ఆరోగ్యము కలుగుటయే కాక, పండ్లజబ్బు గూడ అంతరించినదని తెలుపుటకు సంతోషముగా నున్నది."

అని డాక్టర్ జే. సి. యస్., సౌత్ యిండియానుండి వ్రాసెను.

## కల్జానా
## తల్లిని, బిడ్డను

## ఆరోగ్యముగాను బలముగాను నుంచును

ఆరోగ్యముగాను బలిష్ఠముగాను నున్న బిడ్డలు తండ్రికి ఆనందము కలిగింతురు. మీ భార్య గర్భిణిగా నున్నపుడును బాలెంతదనములోను కల్జానా పుచ్చుకొన్నయెడల మీ బిడ్డలుగూడ అదే విధముగా నుందురు. కల్జానా బిడ్డకు, తల్లికిగూడ ఆహారమే. బిడ్డ తల్లులకు గల బలహీనతను. పోగొట్టును. వెక్రుకలూడుట. పండ్లు కదలుట మొదలగు జబ్బులను గూడ మాన్పి మంచి పుష్టి నొసంగును.

బిడ్డలకుగూడ కల్జానా మంచిపనిచేయును. నరములకు బలము గూర్చును. పండ్లు ముత్యములవలె తెల్లగా మొలచును. వ్యాధులు రాకుండునట్లు శరీరమునకు బలముకలుగజేయును.

**రికెట్ అను వ్యాధులు రాకుండుటకు కల్జానాకంటె ఉత్తమమైనది మరియొకటిలేదు. ఆలసింపవద్దు. మీ సమీపమున గల మందులదుకాణములో ఒకసీసా కల్జానా తెచ్చి వాడుము. మీ బిడ్డలు ఆరోగ్యముగాను బలముగాను నుందురు. మీ భార్య అందము చెడక, యౌవనము కలిగియుండును.**

# Kalzana

కల్జానా ఆరోగ్యాభివృద్ధికి ఖనిజాహారము

చేతితో తాకబడనిది

# YOUR TIME is the RIGHT TIME

When your watch is a 'DAWSON' Lever wrist watch GUARANTEED FOR 5 YEARS. Remember 'DAWSON, is sold on our 7, DAYS' TRIAL and MONEY BACK GUARANTEE SYSTEM,

TRIAL alone will convince you of its WONDERFUL merits. OBTAIN ONE & BANISH YOUR WATCH WORRIES FOR YEARS.



'DAWSON' the high class Lever wrist watch is the CHAMPION watch which keeps a true and faithful record of the passing minutes every day. It is beautiful in design and attractive in appearance. Indeed an IDEAL wrist watch at a distinctly LOW Price.

**Bright Nickel Silver Case Rs. 6-4-0**
**Highly Gold Plated Case Rs. 6-12-0**
Packing & Postage As. 8/- extra.

*Sole Agents:—*

THE UNION TRADING Co.,

2, Doyehatta St., (D), CALCUTTA.



1 గంట యౌవనములో ఉత్కృష్టమైన సౌఖ్యమును పొందు భాగ్యము మా సుప్రసిద్ధ "రమణ విలాసిని" వలన కలుగును.

ఒకగంట ముందుగ పాలతో ఒక మాత్రను సేవించినంతట వృద్ధుడుసయితము నవయౌవనుడగును. ఒక డబ్బి వెల రూ. 1-0-0.

రాజవైద్య నారాయణజీ కేశవ,
(A)/ 194, చీనాభజారురోడ్డు, మదరాసు.

## LEPROSY & LEUCODERMA

Whatever extensive and however long standing cured absolutely in four weeks. Success guaranteed.

***Particulars on request.***

**KAMALA WORKS,**

**( A. P. ) Panchpota, Bengal, INDIA.**




## ప్రతివారికి ఈ అద్భుతనివారిణి అవసరమైనది.

———:———

చర్మవ్యాధులకు, గాయములకు జాంబక్ వాడుడు.

మీకు గాయము తగిలిగాని, కోసికొనిగాని యున్నయెడల గజ్జి, కురుపులు, మచ్చలు వగైరాలు యేర్పడినచో, జాంబక్ తైలము వెంటనే మాన్పును.

జాంబక్‌లో నన్న అమూల్యమగు వనమూలికల నూనెలు చర్మములో గుంట లోనికి ప్రవేశించును. బాధ తగ్గును. వాపు మటుమాయమగును. అచట మచ్చగూడ యుండదు. ఇంకను యెగ్జిమా, వ్రణములు, పుండ్లు మొదలైనవాటికి జాంబక్ శ్రేష్ఠమైనది. మందుల దుకాణములన్నిటిలోను బుడ్డి 1 కి ఒకరూపాయకుగాని రు 2-4-0 లకుగాని 2 సైజులలో అమ్మబడును.

ఏజంట్లు:— దాదా అండ్ కో, పి. టి. మదరాసు.

జంతువుల క్రొవ్వు లేదు.

# జాంబక్ Zam-Buk

## బి. రెడ్డి అండ్ కో వారి

### అతివిచిత్ర కుష్టునివారిణి

సేవించిన అష్టాదశకుష్టు, బొల్లి సర్వవిధచర్మవ్యాధులనుండి రక్షించి పునర్జీవితులుగ చేయుచున్నది. సర్వసుఖరోగములు ఎంతకాలమునుంచి జీర్ణించి ఎట్టి కఠినస్థితిలో నున్నను మా సర్వసుఖరోగనివారిణి 3 బుడ్లలో గుణమిచ్చును. అన్ని వ్యాధులమీదను అమోఘముగా పనిచేయు సిద్ధమకరధ్వజము తులం రూ 20-0-0 లకు దొరకును. కొలయువారికి ఠ్యాబలాను ఉచితము. జి. వి. రెడ్డి ప్రొప్రయిటర్. బి. రెడ్డి & కో, గోపాలపురం. (వయా) కొత్తపేట, (తూ॥ గో॥)

## రు. 2-15-0 లకు లీవరు రిస్టువాచి



సాటిలేని మెకానిజం. మిక్కిలి నాణ్యమైనది. సరియైన టైము జూపును. అందమైనది. బాగా పనిచేయుటయే దాని ప్రత్యేక గుణములు. 5 సం॥ గ్యారంటీ సయివబడును. రిస్టువాచి పట్టాతో సహా వెల రు. 2-15-0. నాణ్యమైనది రు. 4-4-0 రేడియం డయల్ రు 5/- రోల్డుగోల్డు రు. 4-8-0 ప్రశస్తమైనది. రు. 5 8-0. రెక్టాంగులర్ రు. 7-8-0. జేబువాచి రు. 1-15-0 టైంపీస్ రు 1-11-0. తపాలఖర్చులు ప్యాకింగు ప్రత్యేకముగా 9 అణాలు. ఒకేసారి 3 వాచీలు కొను వారికి తపాలఖర్చులు ఉచితము.

NATIONAL TRADING Co. (A. P.)
P. O. Beadon Street., Calcutta.

ఘాటు, సువాసన, రుచి ఆరోగ్యము కలిగించు

# టిటి లేక దశావతారము

## మిస్కి యింగువనే ఉపయోగింపుడు

అన్నిచోట్లను దొరకును.

డైరెక్టు యింపోర్టర్సు:—

రాషీడ్ జామ్‌షెడ్ సన్సు అండ్ కంపెనీ,

222 గోవిందప్పనాయకర్ వీధి, జి. టి. మద్రాసు.

## వసంతకుసుమాకరము

అతిమూత్రము, మధుమేహము, రాచకుఱుపులకు దివ్యౌషధము. తు. రు. 20-0-0

వెంకటేశ్వర ఆయుర్వేదనిలయము
చింతలూరు, ఆలమూరు పోష్టు

కుండా వుండదని విన్నాను. స్త్రీలల్లో అనాదిగా నాట్యాభినయాలేమి గానమేమి యీ జాతివల్లనే కాపాడఁబడుతూ వుంది. మేము రంభవంశంవాళ్లమనిన్నీ, ఊర్వశివంశంవాళ్ళమనిన్నీ మేనకవంశంవాళ్లమనిన్నీ చెప్పుకొనేవాళ్లు పలువురు యీజాతిలో వున్నారు— "రహి పుట్ట జంత్రగాత్రముల తాల్గరఁగించు విమలగాంధర్వంబు విద్య మాకు" అని పెద్దన్నగారు అప్సరస్త్రీ అయిన వరూధినిచేత చెప్పించివున్నారు. కాదంబరిలో వీళ్లవంశాలనిగూర్చి చాలా విస్తరించి వుంది. ఆవంశవృక్షాలు ఆకవి స్వకపోలకల్పితమో పూర్వాధారం యేమేనా వుందో ఆలోచించాలి- ఆవంశవృక్షాలు అప్సరసలకు సంబంధించినవి. ప్రస్తుతం మనదేశంలో వేశ్యాజాతి ఆజాతికి సంబంధించిందో కాదో చెప్పలేను. బ్రాహ్మణాదులు ఋషివంశజుల మని చెప్పినట్టే వాళ్లున్నూ చెపుతారు. అందఱూ సానులుగానే వుండాలనే నియమంగాని నిర్బంధంగాని లేదు- సంఘసంస్కర్తలు ఆ యీ జాతిస్త్రీలను పెండ్లిచేసుకొనే అధికారాన్ని కొత్తగా కల్పించలేదు. ఆ అధికారం అనాదిగానే ఆ యీ జాతికి వుంది- యిప్పుడల్లా దేవాలయాల నౌకరీమాత్రం తప్పించినట్టయింది- పయిఁగా సంగీతకళనున్నూ, దానిలోనే అంతర్భూతమైన నాట్యకళనున్నూ నిర్మూలించడానికి సంకల్పించినట్టు పరిణమిస్తూవుంది- యే కొంచెమో యీ కళలు సంసారులవల్ల అభ్యసింపఁబడినా ప్రత్యేకించి యిందుకోసం వకజాతి అంటూ వుంటేనే తప్ప యీ కళలు నశించిపోక తప్పదు. వ్యభిచారం నశింపచేయడానికి బ్రహ్మకూడా తరంగాదు. వేశ్యాజాతి దాన్నిన్నీ దేవాలయాల్లో నాట్యాలున్నూ మానేసినంతలో లోకంలో వ్యభిచారం నశిస్తుం దన్నమాట సర్వకల్ల- కాఁబట్టి సంగీతంకోసమున్నూ అభినయంకోసమున్నూ యీజాతి వకటి వుండడానికి అంగీకరించడం యుక్తమే అని నేననుకుంటాను- దుర్నీతి విషయంలో యితర దేశాలలో కంటే మనదేశంలో సదుపాయాలు తక్కువగానే వున్నాయని ఋజువు చేయడంమిక్కిలీ సులువు. గానాభినయాలకోసమంటూ వకజాతి రిజర్వు చేయఁబడ్డదై ఉన్నంతమాత్రంచేత దుర్నీతి హెచ్చడానికి అది ఉపోద్బలకంకాదు. జారత్వచోరత్వాలు రెండున్నూ వకటే తరగతిలోనివికదా! చోరత్వానికి మనదేశంలో వకజాతి యేర్పడివుంటే అనుకుందాం, చోరత్వానికి పెద్దలచేత ఆలా యేర్పాటుచేఁబడి లేదుకదా? లేనప్పుడు అది యెందుకు వృద్ధి పొందాలి? యీరెండున్నూ నశించవలసివస్తే జ్ఞానంవల్లనే తప్ప "అన్యథా శరణంనాస్తి"

సంగీతమున్నూ అభినయమున్నూ అవసరమైన కళలే అని అంగీకరించేయెడల యిదివఱకు వున్న వేశ్యాజాతి కాకపోతే మానెఁగాని యింకోజాతినేనా స్త్రీ జాతిని స్వతంత్రమైనదానిని దానికోసం రిజర్వు చేసిపెట్టడం అవసరమనియ్యేవే. సంసారిణులవల్లమాత్రం ఆకళలు యే కొంచెమో నామమాత్రావశిష్టంగా నిలిచి కొనవూపిరితో నిల్వఁగల్గినా పూర్ణవికాసాన్ని పొందడంమాత్రం పుస్తకాపేక్షే అని నాతలఁపు. "యీకళలే అక్కఱలేదు, వీట్లవల్ల కలిగే ప్రయోజనం లేనేలే"దంటారా? అట్టివారికి చెప్పవలసిన జవాబే లేదు- వకవేళ— "శ్లో. సంగీతసాహిత్య రసాఽనభిజ్ఞ స్సాక్షాత్పశుః పుచ్ఛవిషాణశూన్యః" అంటూ అభియుక్తులు పూర్వం చెప్పివున్నారని నేను ఉదాహరించినా అట్టివారు అక్షణంలో దాన్ని ఖండిస్తారనియెఱుఁగుదును. వొకమంచికోసం యింకో చెడ్డని అంగీకరించవలసివస్తూ వుంటుం దని వేఱే వ్రాయ నక్కఱ లేదు.



# కవిః క్రాంతదర్శీ'

ఉభయభాషాప్రవీణ విశ్వనాథ వేంకటేశ్వర్లు

వాత్స్యాయనకామ సూత్రముల యందుఁజతుష్షష్టికళలనుబఠించుటలో 'నాటకాఖ్యాయికా దర్శనమ్, కావ్య సమస్యాపూరణమ్, అభిధానకోశః, మానసీకావ్యక్రియా, ఛందోజ్ఞానమ్, దేశభాషా విజ్ఞానమ్' అనియివి వేఱు వేఱు కళలుగాఁ బరిగణింపఁబడినవి.

కాని తరువాత రానురాను వీని నన్నిటినిఁ గలిపి సాహిత్యమని పేరుపెట్టి పిలువ సాగిరి. ఇది యెట్లున్నను నీకావ్యక్రియను గామపురుషార్థము లోనిదిగాఁ బరిగణించినట్లూహింపనగుచున్నది. అందువలననే 'కావ్యాలాపాంశ్చ వర్జయే' త్తను నిషేధ శాస్త్రము పుట్టుటకు హేతువై యుండును. కవినిగూడ నపాంక్తేయులలోఁ జేర్చినట్లు భారతమునందొకచో నుండినట్లు జ్ఞాపకము దీని కొక్కటియే యుపపత్తి కలదు. ప్రపంచమునందలి కార్యపరంపర కెల్లఁ ద్రికరణములే సాధనము. అందుఁ బ్రధానకరణమైన మనస్సు తక్కఁగల రెండు కరణములకును బ్రేరకమై యుండుట యనుభవైకవేద్యము. మనసాసంకల్పింపఁబడని కాయికవాచికములైన కర్మము లకృతములే యగును. పైఁగానట్లు మనస్సంబంధములేక యీరెంటిని నిర్వర్తించుట యోగులకు సాధ్యమేమోకాని, సామాన్యులకు సాధ్యముకాని పని. అదియునుగాక కాయిక వాచిక రూపమును బొందకపోయినను మనస్సుచేత జరుగు వ్యాపారము కృతమైనట్లే మనపూర్వు లెంచుచు వచ్చిరి. కావ్యకర్మ యనునది వాగ్రూపమైనదైనను నెక్కువభాగము మనోవ్యాపారము. కవి భావనాబలముచేత వివిధములైన మనోఽవస్థలను జిత్రించుకొని, వాని ననుభవములోనికిఁ దెచ్చుకొని యితరులచే ననుభవింపఁ జేయుటకుఁ బ్రయత్నించుచుండును. ఈ యనుభూతి చెడ్డది. ఇంద్రియ లోలత్వమున కిది పుట్టినిల్లు. ఇంద్రియములకెల్ల రాజై, యేకాదశేంద్రియమనియు, నంతరింద్రియమనియుఁ బేర్కొనఁబడుచున్న యీమనస్సునకు స్వాధీనుఁడగుట, తక్కిన కర్మజ్ఞానేంద్రియములన్నింటికిని స్వాధీనుఁడగుట యనియే పరిగణింపవలయును. ఇంద్రియములకుఁ జిక్కియుండుట బంధహేతువు. మోక్షధర్మము నాశ్రయించువారి కిది తీరని యంతరాయము. కావుననే కవి యపాంక్తేయుఁడనియుఁ, గావ్యాలాపములను వర్జింపవలయుననియు నిషేధశాస్త్రములు జనించియుండును.

అయితే యిది లోకానుభవమునకు విరుద్ధముగా నున్నది. సంస్కృత భాషయందు వేదమంత్రద్రష్టలైన మహర్షులను వదలివేసినను వాల్మీకివ్యాసులు, కాళిదాస భవభూతులు మున్నగు మహానుభావులు ఋషులుగను, దత్తుల్యులుగను బరిగణింపఁ బడుచున్నారు. "ఋషీణాంపున రాద్యానాం వాచమర్థోఽనుధావతి" యని భవభూతిమహాకవి యాదేశించెను. తెనుఁగున నన్నయతిక్కనలు మున్నగు మహాకవులుగూడ ఋషికల్పులుగానే యెంచఁబడుచున్నారు. తిక్కనగారు కావ్యక్రియ నొక యారాధనావిశేష మనెను. మహాకవి పోతనామాత్యుఁడు "శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెద"నని భాగవతరచనను బ్రారంభించెను. మురారి మున్నగు సంస్కృత కవులు రచించిన నాటకములనుఁ దురీయాశ్రమమునందున్న యతులు వ్యాఖ్యానములు వ్రాయుచువచ్చిరి. ఇట్లు మొదటఁ గామపురుషార్థములోనిదిగా నెన్నఁబడి, హేయముగాఁ బరిత్యజింపఁబడిన కావ్యకర్మ మోక్షపురుషార్థమున కొక సాధన విశేషముగాఁ బరిగణింపఁబడుచువచ్చినది. ఇట్టి పరివర్తనమునకుఁ గల హేతువు లెయ్యవియో, విచారింతము.

భారతీయ విజ్ఞానమునకు వేదములు మూలకందము. అవి ప్రాఁజదువులు. ఈదృశ్యజగత్తునందంతటఁ జైతన్యరూపమున వెలసియున్న బ్రహ్మపదార్థము మొట్టమొదట వాగ్రూపమైన వివర్తమును బొంది వేదరూపమున వెలసినది. సృష్టికర్తయైన చతుర్ముఖుఁడు సర్గప్రారంభమునందెల్ల వేదోపదిష్టమైన రీతిని సర్గము నొనరించుచుండును. 'ధాతా యథా పూర్వ మకల్పయ' త్తను శ్రుతియే యిందులకుఁ బ్రమాణము. కావుననే వేదములు నిత్యములు. 'అతఏవచ నిత్యత్వమ్' అను బ్రహ్మసూత్రముగూడ నీ విషయమును నిర్ధారణ చేయుచున్నది. పరమేశ్వరునిచేఁ బ్రపంచింపఁబడిన యీవేదరాశి పరమేశ్వరతత్త్వవినిర్ణాయకములైన యుపనిషత్తులయందు ఫలించుచున్నది. ప్రపంచమునకుఁ దొలిమాటలైన యీవేదములు దానికిఁ దుదిమాటలైన యుపనిషత్తులనుగూడఁ బ్రపంచించినవి. వేదములు త్రైగుణ్యవిషయములు; ఉపనిషత్తులు నిస్త్రైగుణ్య విషయములు. ఒకటి [illegible]త్తి; మఱియొకటి నివృత్తి. ఉపనిషద్రూపమగు పరమేశ్వర వాక్కునకు మోక్షధర్మము లక్ష్యము. మోక్షమనఁగాఁ బరమేశ్వరాంశమైన జీవుఁడు పొందు స్వస్వరూపానుభూతి. ఇది యిదమిత్థమని నిరూపింప నలవి కానిది. "యతో వాచో నివర్తంతే, అప్రాప్య మనసాసహ" ఇది జీవన్ముక్తులు, పరమైకాంతులునగు మహాపురుషు లంతరంగములయందు సదా యనుభూతికిఁ దెచ్చుకొనుచుండు చిదానందరసము. "రసో వై సః", "రసగ్ హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి"

ఇట్టి పరమానందము ననుభవించుటయే పరమప్రాప్యముగాఁ బరమకారుణికులైన మహర్షులు నిర్దేశించిరి; నిర్వికార, నిర్వికల్ప సమాధి రూపమైన యీమోక్షమును బొందుటకే భారతీయజాతిని సన్నద్ధపఱుపఁజూచిరి. జననాది మరణాంతమువఱకును, ప్రాతరాది సాయంకాలమువఱకును భారతీయుల కర్మప్రపంచ మంతయు నీమోక్షధర్మమునకు సాధనముగా దిద్దఁబడినది. మనుష్యుని జీవితము

వాని యింద్రియశక్తి వైభవము, వాని మనోబుద్ధి చిత్తముల వికాసము, సర్వమును మోక్షసాధనములుగా సమర్థింపఁబడినవి. లోకమునందలి జడపదార్థములే ముక్తికొఱకు యత్నించుచున్నవన, సమస్త చైతన్యమును సంపూర్ణవికాసము నొందియున్న మనుజుఁడు మోక్షోపాయముల సర్వథా యన్వేషింపవలదా? కావుననే పరమవిజ్ఞానులైన భారతీయ ఋషులు భారతీయుల ధర్మార్థకామములను త్రివర్గమును మోక్షసాధనముగా దిద్ది తీర్చిరి. తుదకుఁ గామమును కూడ మోక్షమునకుఁ బరంపరాహేతువని మహర్షుల యాశయముగాఁ గన్పట్టుచున్నది.

కావుననే మొదటఁ గామపురుషార్థము లోనిదిగా నెన్నఁబడిన కావ్యకళ మోక్షధర్మమునకు సాధనముగా నిర్వహింపఁబడినదైనది.

ప్రభుసమ్మితమైన వేదములు, సుహృత్సమ్మితములైన పురాణములు, కాంతాసమ్మితములైన కావ్యనాటకములు ధర్మోపదేశమునఁడే ఫలించుచున్నవి. విశ్వజనీనమై వెలయు భారతపురాణము కావ్యముగానే కావ్యజ్ఞులచేఁ బరిగణింపఁబడుచున్నది. ఈ మహాకావ్యము "యోగస్థః కురు కర్మాణి" యను భగవద్గీతల పిండీకృతార్థమును గావ్యరూపమున వెలయించుటకే భగవంతుఁడైన వ్యాసమహర్షిచే రచియింపఁబడినది. ఈ విషయము భారతసంహిత కాయువుపట్టనఁదగు శాంతిపర్వములోని చరమాశ్వాసములయందు వివరించి ప్రపంచింపఁబడియున్నది. ధర్మజుఁడు పరమధర్మ మెయ్యది యని భీష్ములవారిని బ్రశ్నింపఁగా నిష్కామకర్మయే పరమధర్మమగునని యాయన యనేకగాథలను జెప్పెను. ఈమహావాక్యమును బ్రపంచజనులు చక్కఁగా జీర్ణము చేసికొనుటకే భారతకథ యంతయు సృష్టింపఁబడినది. అట్లే యాదికావ్యమైన శ్రీమద్రామాయణముగూడ ప్రపంచమునం దెల్లఁ జైతన్యరూపమున వెలసియున్న బ్రహ్మపదార్థము స్వయంప్రకాశసాక్షిభూతమయ్యును 'లోకవత్తు లీలాకైవల్యమ్' అను బ్రహ్మసూత్రమునకు లక్ష్యముగాఁ బ్రపంచమునం దధ్యారోపితమై కర్మప్రపంచమునం దెట్లు ప్రవర్తించుచున్నదియుఁ బ్రపంచితమైనది. ఇఁక శ్రీమద్భాగవతమును గూర్చి నుడువనే యక్కఱలేదు. పరమేశ్వరుని లీలానుభవము గావించుకొనఁగోరు భక్తుల పాలిటికది పెన్నిధానము. తరువాత నీకావ్యకళను బోషించి జగజ్జేగీయమానముగ వెలుంగఁ జేసిన సంస్కృత నాటకకర్తలు గూడ విశేషముగ సమస్త కల్యాణగుణాభిరాముఁడైన శ్రీ రామచంద్రుని యశోవైభవములనే గానముచేసిరి.

అయినచో భక్తిజ్ఞాన వైరాగ్యములను బ్రపంచించుచుఁ బరమేశ్వర స్వరూప సాక్షాత్కారము గలుగఁజేయునవియే యుత్తమ కావ్యములై, తత్త్వనిర్ణాయక మగునదియే యుత్తమ సాహిత్యము కావలసియున్నది. కాని లోకానుభవ మట్లులేదు. అద్వైతమతస్థాపనాచార్యుఁడై, ప్రస్థానత్రయమునకు భాష్యములు రచించి, లోకసంగ్రహార్థ మవతరించిన శ్రీ శంకరభగవత్పాదులవారు "కవిః క్రాంతదర్శీ" యను నభియుక్తోక్తికి లక్ష్యభూతులయ్యును గవిజనపరిగణనములోఁ గాళిదాసాదులతో సమానుఁడుగాఁ బరిగణింపఁబడుటలేదు. కవిజన పరిగణనమునందుఁ గాళిదాసును జెప్పి రెండవ వారిని జెప్పుటలోఁ జతుర్థాంగుళి కనామికయను పేరు వచ్చినదను నాభాణకము విన్పించుచున్నది గదా! మఱి యీకావ్యకర్మ మెట్టిదో వేఱుగా మనము తర్కించి నిర్ణయించుకొనవలసియున్నది. వాల్మీకి వ్యాసులు, తిక్కన పోతనలు పరమేశ్వర లీలానుభూతిని గానము చేసినందువలనఁ గవులు కాలేదు. ఈశ్వర లీలానుభూతిని గానముచేయుటకు వారు కావ్యకళనుపాసించి దానినందులకు సాధనముగాఁ జేసిరి. ఆసాధనాక్రమ మెట్లో నిర్ణయించిన యెడల వారి కావ్యకళారహస్యము మనకు బోధపడఁగలదు. అప్పు డుత్తమ కావ్యకళా లక్షణములను మనము నిర్ణయించుకొనవచ్చును.

మనుజుని నటు దేవతలనుండియు, నిటు జడప్రపంచమునుండియుఁ బ్రత్యేకస్థితి నొందించి, కర్మపురుషునిగా సమర్థించుచున్నది మనస్సు. మనోవిశిష్టుఁడైన చైతన్యస్వరూపియే జీవుఁడని వ్యవహరింపఁబడుచున్నాఁడు. ఈమనస్సు మాయాపిహితమై జడత్వము నొందుచున్నదనియు, నిదియే పరమేశ్వర తాదాత్మ్యభావనాబలమున స్వరూపావస్థానమునొంది కైవల్యసాధకమగుచున్నదనియుఁ జెప్పువారు కొందఱు గలరు. ఈ వాద మెట్లున్నను మనోనాశనమే మోక్షమని వేదాంత సంప్రదాయమనుట నిర్వివాదము. సమస్త దర్శనములును నీ మనోనిగ్రహమునకే ప్రవర్తించుచున్నవనుట యతిశయోక్తి కాదు. నిరంజనమై, నిర్వికల్పమైన పరబ్రహ్మమునందు జగదధ్యాస యీ మనస్సుచేతనే కావింపఁబడుచున్నది. కావున మనస్సే సృష్టికి హేతువు. ఇట్లు సృష్టి స్థితిలయములకు హేతువైన యీ మనస్సుచేతఁ గావింపఁబడు నధ్యాస నశించినప్పుడే, జీవుఁడు మోక్షము నొందుచున్నాఁడు. ఈ మనోరూపసృష్టిని సర్వాత్మనా త్యజించినప్పుడే స్వరూపానుసంధాన మేర్పడును. "తేన త్యక్తేన భుంజీథాః", "...త్యాగేనైకేన అమృతత్వ మానశుః" ఇత్యాదిశ్రుతు లీ విషయమునే బోధించుచున్నవి.

అయితే, యీ త్యాగము స్వరూపజ్ఞానము కలిగినతరువాతఁ జేయఁదగినది. ఆత్మజ్ఞానము కలుగఁజేయుటకై ప్రవర్తించిన తర్కశాస్త్ర మాత్మస్వరూప నిర్వచనము చేయుటకు బదులుగా "ఆత్మా ఇతరభిన్నః" అని నిర్వచించి, యితరజ్ఞానమును ముందు గల్పించి, యన్వయవ్యతిరేకములచేత నాత్మస్వరూపమును దెలియనగునని నిర్దేశించుచున్నది. బ్రహ్మచైతన్యము పదార్థము కాకపోవుటయు, నిదమిత్థమని నిర్ణయించుటకు వలనుపడని దగుటయుఁ, దదితరమైన పదార్థ వివేచనము జరిగినచో తత్త్యాగరూపమైన, లేదా తత్త్యాగఫలరూపమైన యమృతత్వము నొందవచ్చును. కాని యందులకై పదార్థజ్ఞానము సుష్ఠుగాఁ బొందవలయును. ప్రపంచమంతయు మనోమయమై తదతీతుఁడు పరమేశ్వరుఁ డగుటవలన, మనస్స్వరూపమును జక్కఁగా నిర్ణయించి, దానియందలి గూఢాతిగూఢములైన ప్రవృత్తు లన్నిటిని సర్వంకషముగ ననుభవములోనికిఁ దెచ్చుకొని, తద్రసానుభవమునం దోలాడి యాపై దానిని బరిత్యాగముగావించినంతఁ బరమేశ్వర స్వరూప సాక్షాత్కారము కలుగవచ్చునని దీనివలనఁ దెలుచున్నది.

ఈ మనస్సు ప్రపంచమునందుఁ ద్రివిధరూపము లెత్తి రాజ్యము చేయుచున్నది. ఇది జ్ఞానేంద్రియ పంచకముతోఁగూడి మనస్సనియు, నింద్రియ పంచకమునకు విషయములైన శబ్దాదు లైదింటితోఁగూడి బుద్ధి యనియు, జీవసృష్టికి హేతువైన మూలజ్ఞానముతోఁగూడి యానందమనియు వ్యవహృతమగుచున్నది. ఈ మూటిని మూఁడుకోశములుగా వేదాంతశాస్త్రము వ్యవహరించుచున్నది. జ్ఞానేంద్రియములతోఁగూడినది మనోమయకోశము. వానివిషయములతోఁ గూడి

నది విజ్ఞానమయకోశము. మూలాజ్ఞానముతోఁ గూడినది యానందమయకోశము. ఇచట నజ్ఞానమనఁగా నేను నేను(బ్రహ్మమును)గానని తలంచుటయే. ఇదియే యవ్యక్తమని, మాయ యని వ్యవహరింపఁబడుచున్నది. ఈ యానందమయ కోశమునకుఁ బ్రియమోద ప్రమోదాదులు వృత్తులుగా నున్నవి. ఇదియే యింద్రియ విషయములతోడను, నింద్రియములతోడనుగూడి బుద్ధి మనస్సులని వ్యవహృత మగుచున్నది.

జీవనిష్ఠితమై యున్నది వ్యష్టిమనస్సు. ఇది జగత్సమష్టియందు సర్వ వ్యాపృతమై యున్న సమష్టిమనస్సాగరమునం దొక చిన్ని తరంగము. సామాన్యుఁడైన జీవుఁడు తన మనస్సుయొక్క సంపూర్ణ స్వరూపమునే యెఱుంగఁజాలఁడు. ఆవ్యష్టి మనస్సునందైనను గొంతభాగమే పగుష వ్యవహారములయందు గోచరించుచున్నది. "పాదోఽస్య విశ్వా భూతాని." పరబ్రహ్మ పదార్థమునందలి యేకదేశము మాత్రమే విశ్వరూపముగా నేర్పడుచున్నది. అట్లే బ్రహ్మపదార్థము యొక్క స్వప్నావస్థా రూపమైన జీవనిష్ఠిత మనస్సునందుఁగూడ నేకదేశము మాత్రమే పురుష వ్యవహారములయందుఁ బ్రవర్తించుచున్నదని యూహింపనగును. మనస్సుయొక్క సంపూర్ణ స్వరూపము నవగతము చేసికొని, దానియందలి సూక్ష్మాతిసూక్ష్మములైన గతివిశేషము లన్నిటిని నంతర్దృష్టితోఁ బ్రత్యక్షీకరించుకొనఁ గల్గినవాఁడే యోగి. ఏక విజ్ఞానమున సర్వ విజ్ఞానమును సమకూడునని పరబ్రహ్మ విషయకముగఁ జెప్పిన యుక్తి మనోవిషయమునఁగూడ యథార్థమే యగును. తరంగ స్వభావమును సంపూర్ణముగ నెఱుంగఁ గల్గినవానికి, నందున్న యణ్వణుసంఘటనము నాంతరదృష్టితోఁ బరిశీలించుకొనఁ జాలిన వానికి సముద్రస్వభావముగూడ యథాతథముగ గోచరము గాకతప్పదు. ఇట్లు ప్రపంచమన స్స్వరూపమును సంపూర్ణముగఁ బ్రత్యక్షీకరించుకొనఁ గలిగినవాఁడే కవి. ఇట్టివాని యందే 'కవిః క్రాంతదర్శీ' యను నర్థము సమ్యక్ఫలము నొందఁగలుగును.

మహాకావ్యమునందును, నాటక మను రూపక భేదమునందును ధీరోదాత్త నాయకుడును, నుత్తమజాతి నాయికయును నాలంబన విభావములుగా నిర్దేశింపవలయునను నాలంకారిక మతమున కిచ్చట సమన్వయ మగుచున్నది.

సామాన్య స్త్రీపురుషులకుఁ దమ మనోవృత్తులు సంపూర్ణముగ సాక్షాత్కృతి నొందియుండవు. జడ సంసర్గాధిక్యముచేత వారి మనస్సులుగూడ స్వయముగ జడములయ్యెను, వారి జడత్వస్వభావము సుకుంత సూక్ష్మగమై యుండుటచే దాని నెఱుఁగకయుందురు. అట్టివాని స్వరూపము సత్యమైనది కానేరదు. వాని యనుభవము సత్యమైనదె గాదు. అది జగత్ప్రతిబింబము కానేరదు. ఉత్తమజాతి నాయకుఁడు తన మనస్సును దాను సంపూర్ణముగ నెఱింగియుండును. రసశబ్దముచే వ్యవహృత మగుచున్న జగన్మనోధర్మమునకు వాని మనస్సు నిష్కళంకమైన యాదర్శప్రాయమై యుండును. కావుననే దుష్యంతుఁడు "అసంశయం క్షత్రపరిగ్రహక్షమా యదార్య మస్యా మభిలాషి మే మనః, సతాం హి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః" అనఁజాలెను. జగన్మనస్స్వరూపమును సంపూర్ణముగఁ బ్రత్యక్షీకరించుకొనఁజాలిన కవికిని, సరిగా నట్టివాఁడేయగు మహానాయకునకును నీ విషయములో భేదము లేదు. నాయకునిద్వారా కవి తన యాత్మప్రతిబింబమునే కావ్యమునఁ బ్రతిష్ఠించుననుటయు నీదృష్టితో సమన్వయ మగుచున్నది.

మనస్సు త్రివిధరూపమునఁ బ్రవర్తించుచున్నదని చెప్పియుంటిమి. కాని వాస్తవముగ నది పంచకోశములయందును నవిరోధముగఁ బ్రవర్తించుచున్నదనుట నిక్కువము. ప్రాణమనోమయకోశములు మనస్సునకు మాతృములన్నట్లుండి జగత్తునందుఁ బ్రకటములైన రూపములతో విరాజిల్లుచున్నవి. బుద్ధ్యానందమయకోశము లట్లుగాక మనస్సునకు సమీపస్థములై యున్నట్లు గోచరించుచున్నవి. అందుచేత మనస్సు త్రివిధరూపమని మొదటఁ జెప్పఁబడినది. కాని యది వాస్తవమునకుఁ బంచకోశములయందును బ్రవర్తించుచున్న దనుటయే శాస్త్రీయమైన విషయము.

ఇంతకును నీమనస్స్వరూప మేది? బుద్ధి యనఁగా నెట్టిది? ఆనందమన నేమి? ఈ విషయములను దర్కించి తెలిసికొనవలసి యున్నది.

"సంకల్ప వికల్పాత్మకం మనః" "నిశ్చయాత్మికా బుద్ధిః" అను నిర్వచనములు కానంబడుచున్నవి. ఇంక నానందమున కట్టి నిర్వచనము చేయఁబడలేదు. అది మూలాజ్ఞానమని మున్నే చెప్పికొంటిమి. జీవుని యాంతర బాహ్య జగత్తంతయును సంకల్ప వికల్పాత్మకము. అనేక సంకల్పముల సమష్టిరూపము జీవుని కర్మప్రపంచముగాఁ బరిణమించుచున్నది. వేయేల? ఇతని సంకల్ప పరంపరయే జీవుని జన్మానేకములకు హేతువగుచున్నదని చెప్పవలసి యున్నది.

అయితే యీ సంకల్పము బలమైనది కావలయును. అనఁగా మనస్సు తీవ్రమైన దశనొంది బుద్ధిరూపమున మాఱి, యది యానందమయకోశము నంటవలయును. అట్టి సంకల్పము జీవునికిఁ బునర్జన్మము గలుగఁ జేయుశక్తి గలిగినదై యున్నది. జడభరతుఁడు హరిణమును బెంచెను. హరిణ శాబక విషయకమైన యతని సంకల్పము తీవ్ర స్వరూపము నొంది, యతని మూలాజ్ఞానమయమైన యానందకోశమును దాదాత్మ్యసంపన్నము చేయఁగలిగి యుండుటచేత నాతనికి మఱుజన్మము హరిణజన్మము కలిగెను. జీవలోకమునందలి యానందమయ సమష్టికోశమునం దట్టి తీవ్రతరరూపము లొందియున్న సంకల్ప పరంపర సంఖ్యాతీతమైయున్నదని యూహింపనగుచున్నది.

ఈ సంకల్పమే భావమని చెప్పఁబడుచున్నది. ఇదితీవ్రమైనదశ నొందియున్నప్పుడు స్థాయి యని పిలువఁబడుచున్నది. జగత్పరిపూర్ణమై యున్న యీ సమష్ట్యానందమయ కోశమున నట్టి స్థాయులు తొమ్మిది యున్నవని మహాకవులైన యాలంకారిక శిఖామణులు దర్శించిరి.

భావాపరపర్యాయ నిగదితమైన యీ సంకల్పరూపమైన స్థాయి, తీవ్రదశ నొందునప్పుడు విచిత్రమైన పరిణామముల నొందుచుండును. అట్టి సమయములో దీనికి జన్మహేతువైన మనస్సుగాని, సహకారిహేతువైన బుద్ధి,లేక విజ్ఞానముగాని ప్రత్యేకావస్థారూపముల నొందియుండక దీనియందే లీనమై యుండును. అప్పుడిది తరంగముల నన్నిటిని దనయందు లీనము గావించుకొని యఖండమైన యేకాకృతిని వెలుంగు మహాసాగరమువలె నద్వితీయమై భాసించుచుండును. అట్టి యఖండాద్వితీయస్థితియందు సమస్త సాక్షిచిన్మాత్రస్వరూపుఁడైన పరమేశ్వరుఁ డొక్కఁడుదక్కఁ దక్కిన జగత్తంతయుఁ దత్కాలమునకు లేనిదై, యీ స్థాయి యొక్కటి మాత్రమే వెలుంగుచుండును. కావుననే దీని నాలంకారికులు బ్రహ్మానందసహోదర మన్నారు. ఆస్థితి

ప్రథమ ద్వితీయ సంపుటములు, అమ్మకమునకు సిద్ధముగా నున్నవి.

# ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము

ప్రథమసంపుటమునందు డిమ్మీ ౪-వ ఆకృతియందు ౬౦౦ పుటలు గలవు. ఇందు 'అ' నుండి "అధ్వర్యు" వరకును గల విషయము గలదు. త్రివర్ణ పటములు ౮, ఇతర పటములు ౧౨౫, వివిధ విషయములు ౪౦౦ కలవు.

రెండవ సంపుటమునందు డిమ్మీ ౪-వ ఆకృతియందు ౬౦౦లకు మించిన పుటలు కలవు. "అన్" మొదలుకొని "అశ్వని" వరకు గల విషయము గలదు. త్రివర్ణపటములు ౧౦. వానిలో ౨ అమరావతీస్తూపమునకును ౨ అనాహతమునకును చెందినవియు ౬ దేశచిత్ర పటములును గలవు. ఇవిగాక మరి ౫ సాదా దేశపటములు కలవు. ప్రాచీనాంధ్రుల కళాసంపదను వ్యక్తముచేయు అమరావతీ స్తూపమునుగురించినగొప్ప వ్యాసమునందు అమరావతీశిల్పమునకు సంబంధించిన హాఫ్‌టోన్ బొమ్మలు రమారమి ౧౦౦ ను, వేషభూషాదుల వెల్లడించు బొమ్మలు ౫౦ వఱకును గలవు. మరియు అభినయమను వ్యాసమున భరత శాస్త్రమునందలి వేఱువేఱుహస్తములను సూచించు బొమ్మలు ౫౭ ను, 'అనాహతము'నందు షట్చక్రాదులచిత్రములును గలవు. ఇట్లు ఆయావ్యాసములకు చెందిన చిత్రములు మొత్తముమీద ౨౫౦ కి పైగా నున్నవి. వివిధవిషయముల సంఖ్య ౪౦౦ వరకు నుండును.

సంపుటము చక్కని స్వదేశీచర్మముతోడను బంగారు రేఖలతోడను సంపుటీకృతము. ప్రతిసంపుటమున ౬౦౦ పుటలుండును. ప్రతి సంపుటము వెల రూ. ౧౦-౦-౦. ప్రవేశరుసుము రూ. ౧-౦-౦. మొత్తము రూ. ౧౧-౦-౦. పోస్టుద్వారా: రూ. ౧-౮-౦ రైలుద్వారా: దగ్గరచోట్లకు ఖర్చులు అ. ౧౨. ☞ పోస్టు-రైలుఖర్చులుప్రత్యేకము. చందాదారులు అడ్వాన్సు రూ.౫ లు పంప ప్రార్థితులు.

మూడవ సంపుటము ముద్రణమున నున్నది. అందు ఆంధ్రదేశ చరిత్రము, వాఙ్మయము, భాష మొదలయిన విషయములకు సంబంధించిన యనేకవ్యాసములు కలవు.

పండితసాహాయ్యమునను, అపార సాధనసంపదల మూలమునను, సాధ్యము గాదగిన ఈ కార్యమును తలపెట్టుట సాహసమును, అనాలోచితమును అయినను ఆంధ్రమహాజనులసాహాయ్యమువ ఈప్రయత్నము సఫలముగాగల దని నమ్ముచు యథాశక్తిని సహాయము చేయుటకు వేడుచున్నాము.

ఆంధ్రవిజ్ఞానసర్వస్వ కార్యాలయము,
నెం. ౭, తంబుచెట్టివీధి, మదరాసు.

---



## అదెంత బలమో!

"నువ్వులు పిడికెటబట్టి నూనె పిండుకొని అన్నంలో వేసుకొనేవాడుట మాతాతగారు" అంటూ పాతకాలపు వాళ్లు చెపుతూవుండేవారు. అది సత్యమో అసత్యమో మనం చూడలేదు కాని కాయకష్టంచేసే పూర్వులు మాత్రం గట్టిగావుండేవా రన్నదిమాత్రం ఒప్పుకుంటాము.

కాని మనలో చాల మందికి ఆ శక్తి, ఆబలము, ఆ పటుత్వమూ లేదు. మనము కాయకష్టం చేయడానికి అవకాశం లేదని ఈ నీరసజీవనము గడుపకూడదు. మనము మంచి ఆరోగ్యముతో, తేజస్సుతో, కళకాంతులతో వుండలి. అందుకు అమృత వాడడము అవసరం. అమృత సేవిస్తే మీకుజీవితసౌఖ్యములనుఅనుభవింప దగిన ఉష్ణశక్తము బలము చేకూరుతుంది.

అమృత అన్ని మందుషాపులలోనను దొరుకుతుంది.

కేసరికుటీరం - రాయపేట - మదరాసు

---

## దంతచూర్ణము

డబ్బి 1-కి వెల రు 0-2-0; 12-కి రు 1-4-0.

పంటిపోటునుబాపి, నోటి దుర్గంధమును బోగొట్టి పండ్లుతోముటకు బాగుండును. చిగుళ్లనుండి రక్తము కారకుండును

మదరాసు — అమృతాంజనం లిమిటెడ్ — బొంబాయి

---



## కొక్కోకము

64 చిత్రపటములతో 280 పేజీలు గల పెద్ద పుస్తకము ధర 1-0-0. పోస్టు ఖర్చులు అ. 5. ఇందులో స్త్రీపురుష శృంగార రహస్యములు గలవు. మహారాజ బుక్ డిపో, 18 వీటు, జి. టి. మదరాసు.



# సౌఖ్యమైన సంసారజీవనము

మంచి ఆరోగ్యముమీద

## ఆధారపడియున్నది

స్త్రీపురుషులిరువును హాయిగానున్నచో వారికెట్టి బాధయు నుండదు, వారి సంతానముగూడ ఆరోగ్యులై యుందురు.

కాని భర్త బలహీనుడైనచో భార్య కెంతమాత్రము సౌఖ్యముండదు, అప్పుడు సంసార జీవనమునకు ఆటంకమే.

కావున, బలహీనత జెందినను, అలసిపోయినను క్రమముగా సెనటోజన్ సేవింపుము. క్రొత్తరక్తము నొసగి శరీర మంతటికి బలమొసగునట్లు జేయు పదార్థము లిందుగలవు భార్యాభర్తలు పూర్తిగా సుఖపడునట్లు సెనటోజన్ తిరిగి యౌవ్వనులజేయును, మీ భార్య సౌందర్యవతిగాను, సంతసురాలుగాను, బలవంతురాలగునట్లు శ్రద్ధ తీసికొనుడు.

సెనటోజన్ వాడినవారేమి వ్రాసిరో చదువుడు:

"నాకుటుంబమునకు సెనటోజన్ దిగ్విజయాధారము. నాభార్యకు యౌవ్వనము చేకూరెను, బిడ్డలారోగ్యులై ఆడుకొనుచున్నారు. రోజంతయు




పనిజేసినను దానివలన నేనుగూడ బలవంతుడుగానున్నాను."

మీ కుటుంబమును గూడ సమానారోగ్యులుగా జేయుడు.

**SANATOGEN**

## నిజమగు బలవర్ధకాహారము

మందులమ్మువారి యొద్దను బజారులలోను దొరకును.

తయారగునప్పుడు సెనటోజన్ చేతితో తాకబడుటలేదు.

మతమునకు హానికర పదార్థములు లేవు. నెం. 3

---

# మానసోల్లాసినీ మాత్రలు

**30 మాత్రలు 0-10-0**

తపాలా ఖర్చులు రు. 0-9-0.

వెలసులభము! గుణ మధికము.

శరీరములో ఉష్ణాధిక్యముచే కలిగెడి పైత్యకాకలకు ఈమాత్రలు దివ్యామృతము. అజీర్ణము, అరుచి, అవులింతలు, అగ్నిమాంద్యము, అతిదాహము) చెక్కిళ్లు, సర్వాంగములయందు జలక్షయము, పిక్కలు, పార్శ్వములు, శిరస్సు, వ్రేళ్లు, అస్థులు మొదలగు వానియందు గలిగెడి నొప్పులను బోగొట్టి దేహమును మంచి ఆరోగ్యమునకు దెచ్చును.

ఈ మాత్రలు మేహవాత నొప్పులను వెంటనే మాన్పును. ఇందు అనేక ఓషధులు చేరినవి. అనుభవ ఔషధ మగుటచేత పరమహంసక్రియ యని చెప్పవచ్చును. ఒకసారి వాడిచూచిన నిజము తెలియగలదు.

చిరునామా:—

**ఆయుర్వేద వైద్యనిలయం,**

ఎలకుర్రు, నిడుమోలుపోస్టు, (కృష్ణాజిల్లా)

---

# తెల్లకుష్ఠు

# బొల్లివ్యాధి

కొద్దిరోజులే ఔషధమును రుద్దినచో తెల్లకుష్ఠుబొల్లి ఘోరవ్యాధులు మొదల్లంట నాశనమగును. హకీములు, వైద్యులు, కుదుర్చలేని వాటిని యీ ఔషధము తప్పక కుదుర్చును. గుణము లేదని ఋజువుచేయువారికి రూ 500/- బహుమాన మివ్వబడును. వెల రు. 2/-

## సంతాన నిరోధము

సంతాన నిరోధమున కిది అమోఘమైనది దీనిని వాడుట మానివేసినతోడనే సంతానము గల్గును, నెలకు 2 లేక 3 రోజులు మందును వాడుచుండవలెను. సంచినకు వెల రు. 2/- గుణము లేదని ఋజువు జేయువారికి రు. 100/- బహుమానము. ఆరోగ్యమున కెట్టి హానిగలుగదు.

జాబులు యింగ్లీషులో వ్రాయుడు.

**Vaidyaraj Akhil Khishore Ram.**

No. 47, P. O. Katri Sarai, (Gaya.)

# అమృతాంజనము

"నా
మార్గదర్శి!
నా
వైద్యుడు!!
నా
స్నేహితుడు!!!"



బూటకమైనవి,
కృత్రిమమైనవి,
అంజనములు,
అమృతములు,
మందులు,
బాములు,
తదితరములు.

"ఇత్తడి పుత్తడి యగునా, తొత్తది నగ లెన్ని యిడిన దొరసా నగునా?
యుత్తములుఁ కానా, దా లత్తునఁ దాఁ దిరిగినను గులాము గులామే!"

"పసముత్య మొకటిచాలును, గసవ్రాఁడ్చిన చింపిరాలు గంపెండేలా
రసికుం డొక్కఁడె చాలును, రసహీనులు పదువు రేల రాయనిబాచా!"

"కోతి దాఁ జెట్టెక్కి కూసినంతనె క్రింది కొదమసింగము వాసి కొఱంతవడునె?
పుల్లేరు దానెంత పొరలివచ్చినఁ బెద్దకొల్లేటికడుపు దాఁ గొదవయగునె?
ప్రాచితీఁగెలు చాల పయిఁబాఱి పెరిఁగిన మంచిమ్రానికి లావు కొంచెమగునె?
క్రించుమానిసి తానెంత గింజుకొన్న మంచివాని పొగడ్తలు మాన్పలేఁడు."

"కొంకనక్కకు శౌర్యగుణ మెంతగల్గినఁ, గంఠీరవముమీఁదఁ గవయఁగలదె?
బలుగూడకొంగకుఁ దెలుపెంత గల్గిన, నవమరాళమురీతి నడువఁగలదె?
బొంతకాకికిని గొండంత నోరున్నను, గోకిలతో సరి గూయఁగలదె?
యెంతబలమున్న వైరిభూకాంతుఁ డధిప, నీ నిరాఘాటధాటికి నిలువఁగలఁడె?"

యందు వేదాంతర విగళితమయిన యేకత్వావస్థాపన్నత్వము కలుగును.

ఇట్టి యత్యంతగాఢ (లీన) తరములగు వృత్తులు తొమ్మిదిజాతులుగా నేర్పడి జగత్తునందలి యానందమయకోశ సమష్టి విభక్తము సేయఁబడియున్నది. వీనికి రతి, హాస, ఉత్సాహ, విస్మయ, జుగుప్సా, భయ, క్రోధ, శోక, శమములని నామకరణము సేయఁబడినది. ఈ స్థాయిసమూహము తొమ్మిదిగా విభాగము నొందియున్నను నిందు రత్యుత్సాహ, జుగుప్సా, క్రోధములుమాత్రమే ప్రధానములు. తక్కిన నాలుగును (శమమువినా) వీనినుండి జన్యములు. రతినుండి హాసమును, ఉత్సాహమువలన విస్మయమును, జుగుప్సవలన భయమును, క్రోధమువలన శోకమును జనించినవి.

ఇందు రతి యనుస్థాయి సృష్ట్యాత్మకమైనది; ఉత్సాహమను స్థాయి స్థిత్యాత్మకమైనది; జుగుప్సాక్రోధములు రెండును లయాత్మకమైనవి. జీవునియొక్క కర్మపరంపరయందు సృష్టిస్థితిలయములను మించిన కర్మములేదు. ఈ మూఁడును సత్త్వరజస్తమో గుణముల నాశ్రయించియున్నవి. రజోగుణము నాశ్రయించి సృష్టియును, సత్త్వగుణము నాశ్రయించి స్థితియును, తమోగుణము నాశ్రయించి లయమును నిత్యముగాఁ బ్రవర్తించుచున్నవి. ఇట్లు త్రిగుణాత్మకములైన యీ స్థాయిచతుష్కమునుండి జనకస్థాయి గుణముల నాశ్రయించియే హాసవిస్మయ భయశోకములు గూడఁ గ్రమముగా వానికి జన్యములై ప్రవర్తించుచున్నవి. ఇవిగాక శమమను స్థాయి యొకటి యున్నది గాని యది యీ త్రిగుణముల కతీతమై వీని యభావాత్మకమైన దగుటవలన వీనితోడి మిత్రత్వముగాని, వైరముగాని లేక ప్రత్యేకముగ నలరారుచున్నది.

ఇట్లు సంకల్పము, భావము, ఆనందము నను పర్యాయవాచకములతో వ్యవహృతమగుచున్న మనస్సను మహాసాగర మొక్కటియే తొమ్మిది సముద్రములుగా విభాగించి పేర్కొనఁబడుచున్నది. జగత్తుయొక్క సృష్టిస్థితిలయహేతువై, తదాత్మకమై యొప్పుచున్న యీయానందమని పిలువఁబడుచున్న తీవ్రమనోఽవస్థారూపమగునజ్ఞానాభాస యిది. ఇది నది యనుకొన్నచో నీ తొమ్మిదియుఁ దలతూములు (Head Sluices). ఈ తలతూములు తొమ్మిదింటినుండియు జగన్మనోవ్యాపార ప్రవర్తకములగుచున్న యసంఖ్యాక సూక్ష్మాతి సూక్ష్మ భావప్రపంచ మంతయుఁ బోషిమి, చిన్నిచిన్ని కాలువ లనఁదగి, జగత్తునంతయు రసమయము గావించి ప్రపంచ మహాజనపరంపరలచేతఁ జర్వ్యమాణము లగుచుఁ దనరారి, జాతివిభేదములచేత నింద్రియగోచరము లగుచుఁ దొమ్మిదిరసములుగా విభక్తములై తుదకుఁ దమ మాతృకలైన స్థాయులయందే మరల విలీనము లగుచున్నవి.

కాని "భావస్య స్థాయిత్వంనామ సజాతీయ విజాతీయానభిభూతతయా యావదనుభవమవస్థానం" అని యాలంకారికులు నిర్వచించి యుండిరి. ఈ వాక్యము "విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః, ఆనీయమానస్స్వాదుత్వం స్థాయీ భావో రసస్స్మృతః" అను వాక్యమున కుపస్కారకమైనది. రసముయొక్క స్వరూపవివేచనము గావించు సందర్భములో నాలంకారికు లీదృశ్య జగత్తునందలి ప్రాణిజాతము, మనసుద్వారా విషయములను బొందు నింద్రియానుభూతిలేశము నేకదేశమయినదానిని బ్రాతిపదికగాఁ దీసికొనిరి. మనస్సు ఇంద్రియములద్వారా విషయములందుఁ బ్రవర్తించుచున్నప్పుడే సంవిద్రూపము నొందునో యట్టి రూపము నొందిన పదార్థ మనుభూతిలోనికి వచ్చుచున్నదని తత్త్వజ్ఞుల మతము. ఈ సంవిత్తు నుపసంహరించుకొన్నచో నా పదార్థము లేనివగునని జ్ఞానవాసిష్ఠము మున్నగు గ్రంథములు చెప్పుచున్నవి. ఇట్టి సంవిత్తు నప్రధానముగాఁ గలిగిన మనోవృత్తి విజ్ఞానమనియు, భావమనియు నాలంకారికులు పేర్కొనినారు. ఇట్టి భావపరంపర క్రమముగా కారణ సహకారిభావవర్గముతో నేకీభూతమయి సామాజికుల, లేక శ్రోతల యనుభూతికి వచ్చునప్పటికి స్థాయిత్వమును బొందుచున్నదని వారి మతము. ఇది యారోహణ క్రమము. ఈ వ్యాసమునందుఁ బూర్వోక్తమైనది యవరోహణ క్రమము. ఫలితార్థములో రెండును నొక్కటియే. అదియునుగాక రస మారోప్యమగునది. అది యారోపింపఁబడునదియేగాని స్వయముగ నాట్యమునందుఁగాని, కావ్యమునందుఁగాని తత్త్వతః యుండునదికాదు. జీవునియందు స్వభావసిద్ధముగా నున్న స్థాయియే శబ్దాదులచేతను, నాట్యాదులచేతను జ్ఞాపితము చేయఁబడి రసత్వము నొందుచున్నది. ఈ విషయమింకను ముందు వివరింపఁబడును.

ఈ స్థాయిచక్రము సూక్ష్మమైనది. 'అణోరణీయాన్ మహతోమహీయాన్' అని పరమేశ్వరునిగూర్చి చెప్పిన శ్రుతి దీనికే చెల్లును. ఇది యనుభవదశయందు రసత్వమును బొందుచున్నది. అనుభవము లేనంతవఱకు నణురూపమును బొంది జీవు నావరించియున్న యవ్యక్తావరణమునందు లీనమయియుండును. జీవుఁడు జగత్సంసర్గముఁ దనయం దారోపించుకొనిన కాలఁదియు, నందలి తమకము విశేషమయిన కాలఁదియు నిది కరఁగిపోయి చంద్రకాంత స్రోతస్సు విరియబారి జగము నావరించి హిమరూపము నొందిన మాడ్కి విభావాదులతోఁగూడి రసత్వమును బొందుచున్నది. స్థాయి బీజావస్థ. రసము విజృంభితమయిన విశ్వరూపము.

"ప్రకాశానంద చిద్రూపాం రసతాం ప్రతిపద్యతే, ప్రకృష్యమాణో యో భావస్స స్థాయీతి నిగద్యతే." రసము ప్రకాశానంద చిద్రూపమని చెప్పఁబడుచున్నది. అనుభవరూపమైన రసము ప్రకాశానంద చిద్రూపమైనయెడల దానిబీజరూపమయిన స్థాయిభావము గూడఁ బ్రకాశానందచిద్రూపమే కావలయును. కారణ కార్యములకు ధర్మభేద ముండదుగదా! ఆనందమనునది పరమ సుఖ స్వరూపము. అయినచో దాని నజ్ఞానావరణముగాఁ జెప్పుటకుఁ గారణమేమి యని ప్రశ్నింపవచ్చును.

సర్వ పరిపూర్ణమైయున్న జ్ఞానమెట్లేకమో యానందముగూడ నట్లే యేకమనుటకు సందియములేదు. కాని యందుపాధివశములైన యంతరములు గలవు. ఈ విషయము స్పష్టముగాఁ దెలియుటకై యానందవల్లిలోని యష్టమానువాకమున కొక యధునాతన వ్యాఖ్యాతలు చేసిన వ్యాఖ్యలోని పంక్తి నిట నుదాహరించుచున్నాను. "అత్ర యథా గాఢాంధకార స్థితానాం దీప నక్షత్ర విద్యుచ్చంద్రాది ప్రకాశై స్తారతమ్యేన వస్తు ప్రాకట్యం, తథా అవిద్యావృత స్వరూపానందానాం సంసారిణాం పుణ్య విశేషలబ్ధ తత్తదుపాధి శుద్ధ్యశుద్ధి స్థౌల్య సౌక్ష్మ్యతారతమ్యేన, జ్ఞానైశ్వర్య భోగ్యవిషయ తారతమ్యేనచ అంతఃకరణ వృత్త్యంతర్ముఖతా దశాయా మనుభూయమానా ఆనందా స్తారతమ్యవిశిష్టా భవంతి." ఇచ్చటి సందర్భ మిది. పరమేశ్వర లక్షణమయిన యానందస్వరూపము నిదమిత్థమని చెప్పుట కశక్యమగుటచే హితకారిణియైన శ్రుతి మనుష్యానందము మొదలు హిరణ్యగర్భానందము వఱకును గల తారతమ్యముల నుపన్యసించి చిల్లక్షణ

56-వ పేజి చూడుడు

# రైతు: వ్యవసాయము

నరసింహదేవర సత్యనారాయణ

భారతదేశము దాదాపు 18 లక్షలచదరపుమైళ్ల విస్తీర్ణ మున్నది. ఇందులో 11 లక్షల చదరపుమైళ్ల విస్తీర్ణము బ్రిటిష్ పరిపాలన క్రింద 11 రాష్ట్రములుగా విభజింపబడినది. ఇందు 4 లక్షల చదరపుమైళ్ల విస్తీర్ణము మాత్రమే వ్యవసాయం చేయబడుచున్నది. అనగా 100-కి $37\frac{1}{2}$ వంతు భూమిమాత్రం సాగు చేయబడుచున్నది.

గవర్నమెంటువారి లెక్కల ప్రకారం ఇంకను వ్యవసాయం చేయుటకు అర్హమైన ప్రదేశము 100 కి 22 వంతులు మిగిలియున్నది. అనగా 15 కోట్ల 40 లక్షల ఎకరముల భూమి. 100 కి దాదాపు 40 వంతులు భూమి వ్యవసాయమునకు అనర్హమైనది. అనగా నదులు కొండలు అరణ్యములు మొదలైనవానిచే ఆక్రమింపబడినది. 100 కి 22 వంతులు ఇంకను సాగుచేయుటకు అర్హమైన ప్రదేశమును వ్యవసాయం క్రింద తీసుకవచ్చుట ప్రభుత్వంవారి అవశ్యకర్తవ్యమై యున్నది.

దేశములో ఏటేటను జనాభా పెరిగిపోవుచున్నది. బ్రిటిష్ యిండియాలో 1931 వ సంll రం లెక్కల ప్రకారం 27 కోట్ల 15 లక్షల జనాభా నివసించుచున్నారు. ఇప్పుడు దేశమొత్తముమీద 35 కోట్ల జనాభా యున్నది. 1940 సం! నాటికి 40 కోట్ల జనాభా యుండునని అంచనా వేయబడినది. బ్రిటిషు ఇండియాలో వ్యవసాయమే జీవనాధారముగాగల ప్రజలు 19 కోట్ల 2 లక్షలు గలరు. అనగా 100 కి 70 మందికి వ్యవసాయమే జీవనాధారము. బ్రిటిషు ఇండియాలో నివసించెడి జనాభాకు వ్యవసాయం చేయు భూమి పంచియిచ్చిన ఎడల తల ఒకటింటికి యా 1-40 సెంట్లు వచ్చినది. ప్రభుత్వంవారి లెక్కల ప్రకారం మొత్తం వ్యవసాయం చేయబడు భూమి 26 కోట్ల 19 లక్షల ఎకరములున్నను యిందులో 5 కోట్ల ఎకరములు మాత్రము వర్షాధారముపై ఆధారపడ నక్కరలేక నీటివనరులు కల్గియున్నది. కొదువ 21 కోటి 19 లక్షల ఎకరములు దైవాధీనముపై వర్షాధారముమీద సాగుబడి కావలసియున్నది. ఏ సాలు వర్షములు ఎగబెట్టినను ఆసాలు ఆప్రాంతములలోని ప్రజలు క్షామమును అనుభవించవలసినదేను. అయితే రైళ్లు రోడ్లు మొదలగు సౌకర్యములు దేశములో విరివిగ వ్యాప్తి అగుటచే వర్షాధారముపై ఆధారపడ నక్కరలేని ప్రదేశములలోనుంచి పంటలు యథేచ్ఛగా రవానా అగుచుండుటచే 20 వ శతాబ్దమున కాటకము మూలమున చనిపోవు జనుల సంఖ్య అంతగ కనుబడుటలేదు.

## వ్యవసాయ వనరులఖర్చు

ప్రభుత్వమువారి లెక్కల ప్రకారము దేశములో వివిధప్రాంతములలో వ్యవసాయమునకు నీటివనరులు కలుగజేయుటకు అనగా ఆనకట్టలు కాలువలు వివిధములగు ప్రాజక్టులు నిర్మాణము చేసినందుకుగాను బ్రిటిష్ పరిపాలనా ప్రారంభమునుండి నేటివరకు 150 కోట్ల రూపాయలు మాత్రమే పెట్టుబడిపెట్టినట్లు కనబడుచున్నది. ఈ పెట్టుబడిపై ప్రభుత్వము వారికి 100 కి రు 5 లు [illegible] కిట్టుచున్నవి. నీటి వనరులు యింకేకొంచె అభివృద్ధి చేసినచో ప్రభుత్వంవారికి ఆదాయాభివృద్ధి అగుటయేగాక దేశములోని ప్రజలు పంటలు యెక్కువగ పండించి తినుటకుతిండి కట్టుటకు బట్ట నివసించుటకు యిల్లు కల్గియుండుటయేగాక దేశసంపత్తి వృద్ధిపరచుటకు అవకాశము కల్గియుండెడిది. ప్రభుత్వంవారు 800 కోట్ల రూపాయలు హిందూదేశములో రైల్వేల నిర్మాణమునకు ఖర్చుపెట్టిరి. ఈ పెట్టుబడిపై ప్రభుత్వమువారికి ఆదాయము శూన్యము. వ్యవసాయ వనరులకు పెట్టుబడి పెట్టిన 150 కోట్లపై నూటికి రు 5 కిట్టుచుండ రైల్వేలకు పెట్టిన 800 కోట్లకు ప్రతిఫలమంతగ లేకుండుటకు కారణములు విశదముగ చెప్ప నక్కరలేదు. రైల్వేలు ప్రభుత్వంవారి సంరక్షణ కొరకు నిర్మాణము చేయబడినవి. ప్రభుత్వంవారు రైల్వేలకు వుపయోగించినంత మొత్తము వ్యవసాయాభివృద్ధికై ఖర్చుపరచి యుండినచో దేశము సుభిక్షముగ ఫలించి వర్షాధారముపై ఆధారపడియుండ నక్కరలేక, కోట్లకొలది ఎకరములు సాగు అయి యుండెడివి. నేడు భారతావనియందు నివసించు దాదాపు 40 కోట్లమంది ప్రజలు జీవనాధారము లేకుండ అల్లాడుచున్నారు. రైల్వేలకు ఖర్చుపరచినట్లు 800 కోట్లరూపాయలు వ్యవసాయ వనరులకు ప్రభుత్వంవారు ఖర్చుపరచిన 40 కోట్లమంది ప్రజలకేగాక 80 కోట్లమంది ప్రజలు సుఖముగ జీవించుటకు భారతభూమి పాడి పంటల నొసగగలదు.

## నీటి ఆధారములు

ప్రస్తుతం ఏటేటను సాగుబడిచేయు 26 కోట్ల 19 లక్షల ఎకరముల భూమిలో 5 కోట్ల ఎకరములభూమి నీటివనరుకలిగి యున్నదని వివరించియున్నాను. ఇందులో 2 కోట్ల 60 లక్షల ఎకరములభూమి కాలువాధారము కల్గియున్నది. 68 లక్షలు చెరువులవల్ల సాగు అగుచున్నది. 1 కోటి 17 లక్షల ఎకరములు భూమి నూతుల ఆధారం మీద వ్యవసాయం చేయబడుచున్నది. 53 లక్షల ఎకరముల భూమి ఇతర నీటి వనరులు కలిగియున్నది. ఇంకను ఎట్టి నీటివనరులు లేక వ్యవసాయం చేయబడుచున్న భూమి 21 కోటి 19 లక్షలు గలదు. దీనికి నీటి ఆధారము కలుగజేయు ఆవశ్యకత ప్రభుత్వంవారి సత్వర బాధ్యత అయివున్నది.

## వ్యవసాయాభివృద్ధి

ఇది ఇట్లుండ ఇంకను 15 కోట్ల 40 లక్షల ఎకరములభూమి వ్యవసాయార్హమైనది దేశములో మిగిలియున్నది. దీనిని వ్యవసాయంక్రిందకు తేవలయును. ఇంత భూప్రదేశము నాగటిచాలు క్రిందకు తేబడుటకు దేశములో అవకాశముండ వృత్తిలేక నిరాధారముగ అల్లాడు ప్రజలకు ఎటువంటివృత్తులు కలుగజేయుటకు అవకాశమున్నదో పరిశీలింపుడు. ఇదివరలో ప్రభుత్వంవారికి దేశముపైవచ్చెడి ద్రవ్యమంతయు తమ సిబ్బంది వ్యయమునకు, ప్రభుత్వోద్యోగుల జీతములకు సెలవగుచున్నదే కాని దేశక్షేమమునకై కృప

పోషణమునకు అవకాశము లేకుండెడిది. విదేశప్రభుత్వమగుటచే తాము సంపాదించిన సామ్రాజ్యముయొక్క సంరక్షణకే ప్రభుత్వం వారు ధనమెక్కువ వినియోగించెడి వారుగాని ప్రజల ఐశ్వర్యాభివృద్ధికి తోడ్పడునట్టి వ్యవసాయపు పురోభివృద్ధికి అంతగ ధనము వెచ్చించుటకు అవకాశము కలుగలేదు. ప్రభుత్వ విధానము మారినది. రాష్ట్రములలో రాజ్యాంగ విధానమునందు మార్పు ఏర్పడినది. రాష్ట్ర స్వాతంత్ర్యము నూతన సంస్కరణములద్వారా ఒసగబడినది. మంత్రులు ప్రజల ఐశ్వర్యాభివృద్ధికి తోడ్పడుటకు నేడు అవకాశములు చిక్కినవి. ఈ తరుణములో వ్యవసాయమే జీవనాధారముగాగల మనదేశములో రైతాంగమునకు నీటివసరులు యెక్కువ కలిగించి వ్యవసాయాభివృద్ధికి తోడ్పడవలసియున్నది. కాంగ్రెసు ప్రణాళిక ప్రకారము శాసనసభలద్వారా రైతాంగమునకు యెక్కువ వసరులు చేకూర్చుటకు వుద్దేశ్యములు ప్రకటింపబడినవి. 11 రాష్ట్రములలో 7 రాష్ట్రములందు కాంగ్రెసుపార్టీవారు మంత్రివర్గము నేర్పాటుచేసి రాష్ట్రములయందు పరిపాలనాధికారమును చేపట్టిరి. ఈ తరుణములో నిర్వ్యాపారులకు వ్యాపారము కలుగజేయుటకును వ్యవసాయము ఫలప్రదముగ వృద్ధిపొందించుటకును నీటివసరులులేని భూములకు నీటివసరులు నూతన ప్రాజక్టులద్వారా కలుగజేసి వ్యవసాయముక్రిందకు తేబడని బంజరు భూములను వ్యవసాయమునకు అనువగునటుల తగిన అవకాశములు ఏర్పరచి దేశాభ్యుదయమునకు కాంగ్రెసు మంత్రివర్గమువారు తోడ్పడవలసియున్నది.

రైతుస్థితి నేడు చాలదీనముగనున్నది. ఒకమూల అప్పు పిశాచము వేరొకవంక అజ్ఞానపిశాచము మరియొకవైపు అనారోగ్యపిశాచమువారినావహించిపీల్చిపిప్పిచేయుచున్నవి. హిందూదేశములో నేడు రైతులు 12 వందల కోట్ల రూపాయలు ఋణభారముతో క్రుంగిపోవుచున్నారు. 100 కి 10 మంది కంటె దేశములో చదువువచ్చినవారుగలేరు. 100 కి 90 మంది నిరక్షరాస్యులు. ఇక ఆరోగ్యము విషయమై చూచిన హిందూదేశములో సగటున ఆయుష్కాలము 23 సంవత్సరములకంటె మించి లేదని లెక్క చెప్పబడుచున్నది. ఇట్టి దైన్యపరిస్థితులయందు ప్రజాసామాన్యమున్నారు.

మహాత్మాగాంధి సైగాన్ పల్లెటూరియందు నివసించుచు ప్రజల అజ్ఞానమును అప్పును అనారోగ్యమును పారద్రోలుటకు అహర్నిశలు మంత్రపునశ్చరణ సల్పుచున్నాడు. దీక్షానిమగ్నుడై లోకమునకు ఆదర్శప్రాయముగ కార్యవిధానము ఏర్పాటుచేసి నడుపుచున్నాడు. ప్రభుత్వమునకు ప్రజలకు ఆయనకంటె మార్గదర్శకులులేరు. కాంగ్రెసు మంత్రివర్గము వారు కార్యదీక్షాపరులై సైగాన్ యోగిమార్గమువలంబించినచో పిశాచములను మారణహోమము చేయవచ్చును. ఈ యజ్ఞదీక్ష ప్రజలు, కాంగ్రెసు ప్రభుత్వము ఏకమనస్సుతో పూనిన తిరిగి దేశము నవసస్యభరితమై సుభిక్షముగ వెలయగలదు.



# ఆంధ్రసాహిత్య క్షేత్రమున శిష్టకరణ కవుల స్థానము

పండిత డి. ఎస్. శర్మ.

"కలదు కళింగదేశమునఁ గా
లము వేయికిఁ దొంటినుండిని,
శ్చలధనులుఁ యశస్కులు ప్రబ
శాంతమనస్కులు రాజనీతివే,
త్తలు జనువెల్లజాతులకు దా
నముచేయుచు నున్న యొజ్జలా,
ర్యులనుతిఁగొన్న శిష్టకర
ణోన్నతవంశ్యులు దేశభక్తులై."

రక్షోత్సవసంచిక.

## తెనుఁగువారి యున్నతి

ప్రపంచ చరిత్రయందు భారతేతిహాసము విడువరాని ప్రకరణమైయున్నది. ఋగ్వేదీయ కాలమునుండి పలుకబడుచున్న ఆంధ్రుల ప్రశస్తిసూక్తములు ఆ ప్రకరణమునకు పోటికి పోని పుటలై నిలిచియున్నవి. సుమత్ర, బోర్నియో లోనగు దీవులందలి పరిపాలకవంశములు ఏర్పడినయాంధ్రుల, నల విశ్వామిత్ర కౌసల్యా ప్రభృతి సంస్మరణీయ మానవయశోధనులను గనిన యాంధ్రుల, సింహళంబును నాక్రమించిన కళింగాధీశుఁడు విజయవర్మ ప్రముఖాంధ్రుల, 'ఎల్లకైతలందుఁ దెలుఁగుగైత కడిఁది' అదినివాసి పిసాళించిన కవిపటీరులుగల యాంధ్రులయొక్క పెద్దమునగడలు కాలంపు వఱదలలో గొట్టుకొని పోయినను, చెక్కుచెదరక నిలిచియున్న యీ యాంధ్రవిశాల వసుంధర చరిత్రకారుల నిరాఘాటలేఖినికి గావలసినంత రచనాసౌకర్యములను సమకూర్చునదై యున్నది.

## కళింగాంధ్ర ప్రస్తావము

కళింగరాష్ట్ర వృత్తాంతము ఆంధ్రుల యితిహాససంపుటముల ముఖపత్రమై యున్నది.

ప్రచలిత కళింగాంధ్రభాష 1075 దీర్ఘాసి శాసనమునాటికే స్థిరపడి యున్నది. అంతకు బూర్వము నుండియె తెనుఁగు కాళింగభాషగ నేర్పడియుండినట్లు ఆశాసనపు సీసపద్యరచనము ప్రబలసాక్ష్య మిచ్చుచున్నది. మఱియు వేంగిప్రభువులయిన పూర్వచాళుక్యులతోడి కళింగ గంగులచుట్టఱికము అనంతవర్మచోడుని యభ్యుదయమును జెప్పక చెప్పుచున్నది. అతిప్రాచీనమైన యుద్ధమల్లుని శాసనమునకు సమీపకాలమున బయల్వడిన కొన్ని కళింగదేశశాసనములలోని తెలుఁగు వ్రాలనుబట్టి కళింగావనియందు ఆంధ్రవాణి యానాటి వేంగి తెలుఁగు పొంకములకు దీసిపోదను శ్రీ సీతాపతిగారి విమర్శనము కళింగప్రజల తెలుఁగు వ్రాఁతయొక్క తొలుతటి వాసిని ఋజువు చేయుచున్నది. అనఁగా: బోధాయనునిచే వ్రాత్యులు అని చెప్పబడ్డ ఆదిమకళింగులు బౌద్ధయుగమున పాలీభాష మాట్లాడుచుండిరనియు, తెలుఁగుబిడ్డఁడు మహాపద్మనందుఁ



డీప్రదేశము నేలిన దీర్ఘకాలమునకు ఉత్కళ సామ్రాజ్యమున విలీనమయ్యెననియు, దర్వాతను గాంగులు పాలించినప్పటినుండి తెలుఁగు ప్రజాభాషగ నిలిచెనన్నియు గ్రాహ్యము. కళింగము, ఉత్తరమధ్యమ దక్షిణ విభాగములలో దక్షిణమున పిష్ఠపురము (పిఠాపురము) ముఖ్యధామమై యుండుట, ప్రాచీనకళింగ సామ్రాజ్యబహుళ విస్తీర్ణతను వ్యక్తపఱచుచున్నది. ఉత్తరకళింగమునకు కాలపు మార్పుల చొప్పున విజయ కళింగనగరము నగరికటకము, కొత్తూరు, దంతాపురము, అద్దాదను ముఖ్య నగరములగుట పరిశోధన ములు తెలుపుచున్నవి. ఖేడీ, శైలోద్భవ, మత్స్య, నళ, గంగ, గాంగవంశ్యులు కళింగమును ఏలినట్లు, పల్లవులు కదంబులు చాళుక్యులు సామంతులైనట్లు, ఇప్పటికి లభించిన శాసనములు వెల్లడిచేయు చున్నవి.

## శిష్టకరణ నిర్వచనము :

### శాసనాధారములు

కళింగ రాజకీయవ్యవస్థ ప్రధాని, పాత్ర, మహాపాత్ర, నాయక, పటానాయక, శ్రీకరణ, పురపతి, సంధివిగ్రహి, లోనగు ఉద్యోగ పదవులతో సక్రమముగ నడపబడు చుండెను. పురపతి కార్యమున పఱతలగాము (ఇప్పుడు పాలతలగాము) మావిండి నాయకుడును, ప్రధాని పదవియందు ఆత్రేయగోత్రి బుడుమూరి దామి నాయకుడును, కళింగాధీశుడైన రాజరాజునకు ప్రధాని బణపతి (వనపతి), శ్రీ మదనంగ భీమదేవుని దక్షిణ దండనాధికారులయిన 1 శ్రీకరణ 2 మహానాయకుడును, ఇప్పిలి సంగమ నాయకుడును, కళింగ పట్టనపు నాయకుడుగ పొట్నూరి పద్మ మహా సేనాపతి, కళింగబెహర జోగీశ్వర జియ్యును, కళింగ పరీక్షకులు హేమకర పాత్రుడు రవిదాస పటానాయకు, పురోహాధ్యాయ పదవిలో సాంబనాయకుడు, మహాసేనాపతి పదవిలో పోలునాయకుడును, దండనాధికారిగ ఉద్దండరామనాయకుఁడు విరాజిల్లిన విషయము ముఖలింగ శ్రీ కూర్మ సింహాచలాది శాసనములవలన దెలియవచ్చుచున్నది. అప్పటి శ్రీకరణ బిరుదాంకితులయిన ఇప్పటి శిష్టకరణ మహాసంఘము పై శాసనములలో పేర్కొనబడిన బెహర, ఉద్దండ్రావు, పోలుమహంతి, పొట్నూరు, బుడుమూరు, ఇప్పిలి, పటానాయక, పాత్ర, మహాపాత్రలోనగు పేరులు గృహనామములుగను పౌరుషనామములుగను నిరంకుశముగ గనబడుచున్నది. ఇంకను, విద్యాధర, విద్యాశేఖర, బ్రహ్మశ్రీ ప్రముఖవైదిక బిరుదములను, సూర్యసోమోపరాగ సమయములలో వజ్రహస్తాది భూధవు

లచే ఆగవతవాదము కొందరు బలి యని ద్వనము లై యున్నవి.

## ప్రగుణకవంశక్రమము

ఆంధ్రవాఙ్మయ కళింగవిషయమున విజయ విలాసము ప్రాపించిన సువర్ణదినములు ఉండే. మట సుప్రకరణము. శిష్టకరణములు, [illegible]లు, కాళింగులు కళింగ వైశ్యులు, కళింగదేశ నాగరకతకు దలకట్టులై యుండిరి. వారిలో పుస్తకరూపిణి తెన్గు బోటికి కొచ్చము లేక సత్కరించి తల్లి వలెనే దీర్చుకొనియుండిరి. శిష్టపాఠకుల యింటింటను సరస్వతీనిలయము లేర్పడి యుండెను. పురాణ కావ్య నాటక శతకా దులు కరణలేఖినులచే వ్రాయబడుచుండెను. దిమిలె, గండ్రేడు, కుప్పిలి, పాలకొండ, కళింగనగరము, కల్లేపల్లి, మొదలగు కరణముల కుటుంబములు లోటులేని గ్రంథవిక్రయ శాలయ్యెను. కుప్పిలి, బలివాడ, బెహరా వారలు షట్కాండరామాయణమును ఆఱు తాటియాకు పూసలలోను, భగవద్గీత కంఠమా లికగను వ్రాసి ఆంధ్రవైదుష్యలోకమును ఆశ్చర్యచకితము చేయుట విజ్ఞులెరింగిన విష యమైయున్నది. చూడుడు! చాటువు.

*కం. ముత్తెపుసరుల విధంబున
సుత్తముగానుడి సజీవ కోమలికముతో
జొత్తములను వ్రాయుదురహా!
చిత్తంబులు పల్లవింప శిష్టకరణముల్."

## కవిత్వోపాసనము

ప్రతిశిష్టవ్యక్తి గ్రామకరణముగను గ్రామో పాధ్యాయుడుగను ఉండుట వారి సర్వసాధా రణవృత్తియై యున్నది. రావుసాహెబు జి. వి. రామమూర్తి పంతులుగారు "నేను సంపాదించిన విద్యకు మూలద్రవ్యమనదగిన భాషాజ్ఞానము భాషాభిమానము నాకు గలుగ జేసినవారు బొంతలకోడూరు శిష్టికరణాలు బెహరా బైరాగిపట్నాయకుగారు......... డబీరువారని పక్కివారని బెహరావారని బిరుదు పేళ్లు కొన్ని ఇంటిపేళ్లు అయినవి. డబీర్ అనగా పార్సీభాషలో చక్కగా వ్రాసే వారని అర్థమట" అని బంధుప్రశంస వ్యాస మున బలికియుండుట గౌరవాపాదకమై యున్నది. అనకాపల్లికరణాల దాయభాగపు తీర్పు 1870 లో జరిగినపుడు వారి విద్యా కౌశలముగూర్చి అడిదము బాలభాస్కరకవి గారి ప్రశస్తవాక్యములు నిష్పక్షపాత ద్యోతకములై యున్నవి. ఒకప్పుడు సూర కవి గండ్రేడు విచ్చేసి 'గండ్రేడంతా కవులే' యని శ్లేషించి పలుక 'ఉండ్రాదా శారదా మహోన్నతపదవిన్' అని యచటి కరణకవి గ్రామణులు పూరించుట. యతిశయోక్తి యయ్యు వారి కవితోపాసననిష్ఠను ఇదమిత్థ మని చాటుచు నున్నది.

## కవికుమార పరంపరలు

ఆంధ్రకవితాకళను శిష్టకరణకవులు నూటికి తొమ్మండ్రు అఱచేత నిడుకొని కవితాప్రవ ర్తనములు జరుపుచుండిరి. డొంకాడ గోపీ నాథుడు విశ్వదాభవాసు. రచించిన పవిత్ర రామాయణమును మనోహరగద్యముగ రచిం చెను. అది ఆంధ్రమున ప్రాచీనగద్యము అనబడు సుముఖము వేంకటకృష్ణప్పనాయ కుని జైమినిభారతము తరువాతి గద్యములలో దలమానికమని పెక్కండ్ర యభిప్రాయమై యున్నది. ఈ మహాసంఘములో, డబీర్, కుప్పిలి, పక్కి, యెల్లమహంతి, బెహరా, బలివాడ కుటుంబకవులు శతాధికులు పొడగట్టుచున్నారు. వీరేశలింగ ముగారు కవులచరిత్రములను సమకూర్చినపుడు పల్లెలయందలి యీ కవులకు ఆవార్త తెలియ కున్నందున సాధారణముగ విశాఖపురి నివాసి యైన పక్కి వేంకటనరసయ్య కవియొక్కడే కవులలో జేర్పబడుట సంభవించెను. వేంకట నరసయ్యగారి కుమారీసూక్తులు ఆంధ్రభూమి లో ఆడుబిడ్డలకు మేలుకొలిపి శతకవాఙ్మ యమున శోభింపజేసినది. డబీర్ నరసకవి కృతి కలువాయిశతకము ముద్రింపబడి శతక సారస్వతమును పొదలించుచున్నది. వంగూరి సుబ్బారావుగారి వాఙ్మయచరిత్రములో శిష్ట కరణకవులు భాషావిశారదులని పేర్కొనబడి యున్నారు.

## అచ్చుపడక బయలుపడని కవులు

కుప్పిలి గోపాలకృష్ణకవి (కుప్పిలి) పిల్ల వసుచరిత్ర మనదగు మిత్రవిందాపరిణయ మును, సీతారామకవి లక్షణాపరిణయాదు లను, డబీర్ వెంకటరాయడు (బూరిజ) సంస్కృతమున శారీరమును, డా॥ రాధాకృష్ణ కవి (కలువలపల్లి) విష్ణువర్ధనీయమును, శేఖర మంత్రి నరసింహము (దిమిలె) దశావతార తత్త్వమును, పక్కి అప్పలనరసయ్య (అల్లి పురము) ముకుందమాలాదులను, బెహర లక్ష్మీ నరసయ్యశర్మ మిషను హైస్కూలుపండి తులు (అల్లిపురము) కుమారవిజయాదుల, (ఈ కవిపుంగవుని ఆంధ్రవాల్మీకి గొనియాడి యున్నాడు) మహామహోపాధ్యాయ పరవస్తు వేంకట రంగాచార్యులయొద్ద యోగ్యతా పత్రమునొంది కుప్పిలి కుప్పయ్యపండితులు శ్రీ గోడేవారు ముద్రించిన సర్వశబ్దసంబోధిని సంస్కృతనిఘంటు పరిష్కర్తగను, ఆతని కుమారసింహము వెంకన్నపాత్రులు విశాఖ పురి బాలికోన్నత పాఠశాలయందు సంగీత విద్వాంసులుగనుండి గోదావరీపర్యంతమున్న వాద్యగాంధర్వ కాచార్యుడుగ సుప్రసిద్ధిగాంచు టయు, రొంపల్లికరణాలు లీలావతిగణితము తోమూడు రొంపల్లిగణితమును, తట్టికోట బల రామయ్య (తట్టికోట) గరుడాచల విలాస బంధప్రబంధమును, యెల్లమహంతి సూర్యనారాయణ పాత్రులు అష్టావధాని (పాలకొండ) గోపాలవిలాసమును, డబీర్ కృష్ణమూర్తిసూరి (జలుమూరు) శ్రీకాకుళ మున గాయత్రీముద్రణాలయము నెలకొలిపి, కళింగయను మాసపత్రికను ప్రకటించి హనుమ ద్విలాసాది సంస్కృతాంధ్రశతాధికకావ్యనా టక ప్రహసనాదులను కల్లేపల్లి వరాహ నరసింహ వైయాకరణులు శ్రీ కాకుళమున గవర్నమెంటువారి ఆంగ్లోవర్నాక్యులరు పాఠ శాలలో పండితులుగ నుండి నరసింహవ్యాకర ణమును (అదిమెట్రిక్యులేషనునకు పాఠ్యమ య్యెను. బాలవ్యాకరణమునకు సమకాలికము) అతని కుమారుడు వేంకటనృసింహమూర్తి వీరే శలింగము పంతులవారి మన్ననలందిన విచిత్ర రామాయణమును (ఈ సత్కవిజీవితమును పం డిత అడిదము రామారావుగారు సంగ్రహించి వ్రాసియున్నారు. అందలి బుద్ధ్యజచరిత్ర ము ఎఫ్. ఏ. కు పాఠ్యమయ్యెను.) ప్రౌఢభా రతి బిరుదాంకితులు బెహర రామకృష్ణయ్య (బొంతలకోడూరు) నలచరిత్రాద్యుత్తమప్రబం ధములను, (ఈ భారతిగూర్చి శేషాద్రిరమణ కవులు ఆంధ్రసారస్వతానుబంధమున ప్రక టించి యున్నారు.) మణిపాత్ర భాస్కరకవి (లొద్దభద్ర) జగన్నాథవిలాసమును, విరచిం చుట కవితాదేవికి అభిగుచుల చొప్పన యమూల్యాలంకారములు కైసేసియుండుట యెన్నదగినదై యున్నవి.

జమీపడ్ ఖడ్గపురములనుండి బెజవాడ వఱకు వ్యాపించియున్న యిప్పటి శిష్టసము ద్రములో కవికోకిల దుగ్గుమహంతి సీతారామ శర్మ (సోంపేట) గర్భాపు అప్పారావు, బి. ఎ, (విజయనగరము) పట్నాయక రామ మూర్తి(కోటగండ్రేడు) ఉలిటిలక్ష్మణమూర్తి

(భు జి డి,) నుల్లుకలపల్లి సాక్షి గోపాలస్వామి (వీరఘట్టము,) పసీగు నగర కోటేశ్వరకవి మొదలగు. కవాకుశలులు కవితాగుణముల గ్రహించుచున్న వారు. ఉదిలకవులకు ఉత్సాహము గలిగించు పొంటె ఆయుర్వేదాచార్య జెహార శ్యామ సుందరరావుగారు బాలభారతి పత్రికను, సంచికను ప్రకటించి యీవల సారస్వతసేవయు ఆవల సంఘసేవయు గావించి ఆదర్శప్రాయులై యున్నారు. ఈ సంఘమునకు జెందిన ఉపన్యాస కేసరి బాలదాసి వీరనారాయణదేవు (రాజమహేంద్రము) ఆంధ్రావనిని జేరుమోసిన ఎక్కటీడు, వేగేశ్వర పుర నివాసి నందివాడ వేంకటరత్నకవి జగద్విఖ్యాత శతావధానులవారి అంతేవాసియై వాసిగాంచుచున్న సద్వ్యక్తి.

### స్వస్తి

ఖండాంతర విఖ్యాతియగు ఆంధ్ర జననికిని ఆంధ్రవాఙ్మయానికిని ఈకవులవ్యక్తులు ప్రాచీన యుగముల నుండియు నొనరించుచున్న సేవలను ఐతిహాసికులు అన్వేషకులు గుర్తించి సారస్వత సంస్థలలో సమీచీన స్థానమును బహూకరింతురుగాక!

# జననీ!

## బాలకవి, పన్యాల వేంకటరంగనాథరావు

కనకపతాకంబు, వీరత్వకాంతిగూడి
ఎగిరి చెందియు గైలాసవీధిగప్ప
కేశరాజాలు, కంఠాన కీర్తిరాజ
రతనపతకంబు, పాదహారాణిబూని,
అగ్రకణాబులరాల్చి రమంతమైన
పలుకజాలక ఛీతిలు పదతి యెవరో!
[illegible] నాతోడ నించుకసేపు జననీ!...
[illegible] గ్జ్ఞానలో వెలయుచుండు

* * *

కృష్ణ[illegible]సామ్రాజ్యాల కీర్తి[illegible]
నిర[illegible]ంతతో గూడి పాడలు[illegible]టు,
'[illegible]'! [illegible] నలుపులేక
మను[illegible] నీ[illegible] మనుభవించి
[illegible]యు [illegible],
[illegible]నేల!... [illegible] మొలుక
నో[illegible] [illegible] పాటలూరు
వా[illegible] [illegible] పలుక[illegible],

సంతసోద్రేకభాష మానింతు లరయ
కంకణంబులతాకుడు గలుగుచుంట,
నవ్వుచుండిన రతనాలపువ్వులొలయు
నపుడు నినుకన్న స్ఫురణాలు నిపుడుకలిగె
పలుకవమ్మరోనించుక తెలుసుకొందు!

* * *

ధీరగంభీర మారావ తేజములతో
నవ్వుచుండిన భీకంబు నరసివచ్చు
పలుకు పలికిన ఝుంకార మొలుకుచుండు
వీరశృంగారములతోడ వెలయునట్టి
కాళిదాసుండు, శ్రీనాథకవుల కలిత
మందు, తేనెలు సోనలు మధురములుచు
పారలు పోతన, తిక్కన, పెద్దన, తిమ్మ
నార్యకలితాలధాటిలో నరసినటుల
నీదురూపంబు, తేజంబు, నీవిలాస
భాసమానాస్పదా ప్రేలమాల చాల
వాలకాలాదమేలంపు బోలుపలుకు
లించుకున్నట్టి జ్ఞానాన ముంచుకొంచు
జ్ఞప్తిరానున్నదమ్మ... సంతృప్తిలేక
ఏల విలపించుటలు నీకదేమొ తెలుప
వమ్మ!... నేకోరుచుంటిగదమ్మ రమ్మ...

* * *

తనదు దేశంబు స్వాతంత్ర్య మొనరకుంట
నరసి గంటంబు పట్టు మహాత్ముడుండ,
ప్రజల సౌఖ్యంబు గూర్పంగ ప్రతినబట్టి,
కొలుకపసిన జవ్వరిలాలునుండ,
తెనుగుబాసామతల్లికి తెలుపు నిడిన
యగ్రగణ్యుండు నాగేశ్వరాఖ్యుడుండ,
నైతుమార్గంబు జూపంగ జేతుమంచు
పలికి ఛేస్త్రించువారలో! పదులు, వేలు
నేడు నీకైరి పుత్రులు, నీదుభాగ్య
మెవరితరమమ్మ వర్ణింప నెవరిపశము!
చేతనింకుండ దుఃఖాన జేరకమ్మ
తెలుపు నాకించు కిపుడు నీకలుకదేల?...



# ఉత్తారణము

నాయని సుబ్బారావు

ఈ విడిపోని శృంఖలల కెవ్వడు కర్త జగత్ప్రభుత్వ దీ
క్షావిధిలోన దోచిన వికల్పము మారణ హోమకుండమై
మానవుల్ దహించుకొనిమండెడు నార్పఁగరాక నేటికిన్
లేవవు కన్నువిప్పవు చలింపవు వివేక[illegible] ఈశ్వరా!
ఇవి సంకెలలుగావు దివిజాధిపతిచేత
        పవివాడి మొనల రూపములు గాని
ఎముకలలోని సారముపీల్చి హృదయకో
        శములోని జీవరక్తములు పిండు
కాలుసేతులు నేడు కట్టివేసినవా వి
        శాల భారతమెల్ల చచ్చువడియె
నే నాడు మాత్సర్య మేచి మాలోమేము
        గిరులు గీచుక నిన్ను మరచినామొ
మాయవజ్ఞతా పాప సంభరితమైన
ఇచట నీచిద్విలాసమ్ము లింపుగొలుప
రాక భావ్యవతార క్రియాకలాప
ముజ్జగించి నిద్రా తన్మయుండవైతె!
నీకల్క్యవతార శుభ
    స్వీకృతిలేదను యుగాంతవేళా ప్రభవ
ల్లోక భయంకర ఘన రా
    ప్రాకారమ్మైన మాకు నగపడునె శివా!

# తెలుగు ఫిలిములు - సాంఘిక చిత్రములు

**(కళావినోది)**

క్రమ క్రమముగా క్రొత్త మొగ్గలు తొడుగుచున్న ఆంధ్ర ఫిలిం పరిశ్రమకు 1937 వ సంవత్సరమున నూతన యుగోదయ సూచనలు కన్పించుచున్నవి. వానిని పర్యాలోచించి చూచినచో రానున్న తెలుగు ఫిల్ములు (ప్రాంతీయరాష్ట్రి) చిత్రముల కనతికాలములోనే సరితూగగలవని చెప్పవచ్చును.

ఆంధ్రదేశమున - ముఖ్యముగా మద్రాసురాజధానిలో - క్రొత్త క్రొత్త స్టూడియోలు బయలుదేరి మద్రాసీయులు అన్యరాష్ట్రముల స్టూడియోలలో తమ చిత్రములను తయారు చేసికొనవలసిన దురవస్థను తప్పించినవి. విశాఖపట్టణములోని ఆంధ్ర సినేటోను, మద్రాసునందలి మోహను పిక్చరు ప్రొడ్యూసరు కంపెన్సు, కార్తికేయ ఫిలిమ్సు, జయ ఫిలిమ్సువారి స్టూడియోలు, రాజమండ్రిలోని దుర్గా సినేటోను సర్వోపస్కార సంయుతములై సమర్థులైన సాంకేతికశాస్త్ర ప్రవీణులతో నలరారుచు నూతనాశలు కలిగించుచున్నవి.

ఇంతవరకు పెట్టుబడిదారుల లాభము కొరకు మాత్రమే డైరెక్టరులు, నటులు తెలుగు ఫిలిములలో పనిచేయుచుండుట మనము చూచుచున్నాము. డైరెక్టరులు, నటకులు ప్రొడ్యూసరులుగా మారినచో ఆ నిర్మాణమున మరికొంత శ్రద్ధాభక్తులు కన్పించక తప్పదు. హెచ్. యం. రెడ్డి, సి. పుల్లయ్య, కన్నాంబ, యస్. వి. యస్. రామారావు గార్లు ఫిలిం కంపెనీలలో వాటాదార్లుగా చేరియూ కొరతను దీర్చినారు. ఈ క్రొత్తమార్పువల్ల ప్రభాత్ కంపెనీవంటి వర్కర్సు కంపెనీలు తెలుగుదేశములో తయారయి కళాభివృద్ధికి దారితీయుచున్నవి.

## సాంఘిక చిత్రములు

ఇప్పటివరకు తెలుగుభాషలో నలువదింటికి పైగా చిత్రములు తయారయినవి. వానిలో ఏ ఒకటి రెండో తప్ప అన్నియు పౌరాణిక చిత్రములే. ఇటీవల తయారయిన పౌరాణిక తెలుగు చిత్రములు కొన్ని విపరీత ప్రఖ్యాతిగల నటీనటులతో తయారు చేయబడినను ప్రజాదరము పొందకపోవుటయు, పౌరాణికేతర వాసనగల చిత్రములు ప్రజాదరము పొందుటయు చూచినచో పౌరాణిక చిత్రములపై ప్రజలకు మొగము మొత్తినదని



ఊహింపవచ్చును. ఈ అభిప్రాయము ప్రొడ్యూసర్లకుకూడ కలిగినందువల్లనే నేడు తయారగుచున్న చిత్రములలో సాంఘికచిత్రములే యెక్కువ కన్పించుచున్నవి. దీనికి నిదర్శనముగా గృహలక్ష్మి, బాలయోగిని, తుకారాం, మొదలైన చిత్రములను పేర్కొనవచ్చును. ఇంతేగాక మరికొందరు ప్రొడ్యూసర్లు చారిత్రకచిత్రములను తయారుచేయుటకు ప్రయత్నించుచున్నట్లు వార్తలవలన తెలియుచున్నది.

ప్రాంతీయ భాషలలో తయారయిన చిత్రములను చూచినవారికి మన చిత్రములు రుచింపకపోవుటలో వింత లేదు. కళాదృష్టిలోనేగాక, వ్యాపారదృష్టిలోగూడ మనకథావస్తువులను మార్పవలసిన అవసర మెంతయోగలదు. ఈ పరివర్తన సమయమున తెలుగువారు సాంఘికచిత్ర నిర్మాణమునకు గడంగుట ప్రశంసనీయము.

పౌరాణిక కథాపాత్రల స్వరూపస్వభావములిట్టివని స్పష్టముగా నిర్ణయింప వీలులేనందువల్లను, ఆరోజులలో ఫిలిములు తెలుగువారికి క్రొత్తవైనందువల్లను పౌరాణికచిత్రములలో ఎవరెట్టి కుప్పిగంతులు వైచినను కొంతకాలము ప్రజలుమెచ్చి మేకతోళ్లు గప్పినారు. క్రమముగా ప్రేక్షకులలో విజ్ఞానము ప్రబలినది. పాత్రధారుల నటనా ప్రాగల్భ్యము నెత్తితలలు వైచి క్రొత్తరుచులు చూపలేకపోయినది. అందువల్లనే పౌరాణికచిత్రములు వ్యాపారరీత్యా జయప్రదములు కాలేకపోయినవి. ఏ ఒకరిద్దరో కొంత నైపుణిని ప్రదర్శించినను రాటికి రాలేకపోవుచున్నారు.

## నూతన నటులు

తారల పేరులమీద వ్యాపారము సాగింపదలచిన ప్రొడ్యూసర్లు, డైరెక్టర్లు ఈ సంవత్సర మీసత్యమును గ్రహించిరని చెప్పవచ్చును. ఆవివేకోదయము వల్లనే నేడు తయారగుచున్న చిత్రములలో పెక్కురు నూతననటులు కన్పించుచున్నారు. కథలస్వభావము మారినప్పుడు దానితోబాటు క్రొత్త నటులకు ప్రవేశము గలుగుటగూడ సహజమే. ఈ సంస్కారమువల్ల చిత్రములు ఆర్థికముగా జయప్రదములు కాగలవని పూర్వానుభవమును బట్టి విశ్వసింపదగి యున్నది. డైరెక్టరులు తమ ప్రతిభాసంపద నుపయోగించి యేరుకొనవలెనేగాని తెలుగు దేశమున నటులు గొడ్డుపోలేదు.

ఈ సంవత్సరము తయారగుచున్న ప్రతి చిత్రములోను డైరెక్టరులు క్రొత్తనటులను ప్రవేశపెట్టినారు. సెంట్రల్ స్టూడియోస్ వారి తుకారాం చిత్రములో పాల్గొనుచున్న ముదిగొండ లింగమూర్తిగారు తమ పాత్రమును చక్కగా అభినయించుచున్నట్లు వార్తల

వలన తెలియుచున్నది. వారితో పరిచయము గలవారికీ వార్త అతిశయోక్తి కాదు. కనకతారలో తారపాత్ర నభినయించిన కమలకుమారి ఒక్క గెంతులో బాలయోగినిలో ప్రధాన భూమికను నిర్వహించుచున్నది. ఆమె ఏమాత్రము కూడ రంగానుభవము లేని సరిక్రొత్త పిల్ల. అదేచిత్రములో వి. వి. రావుగారను న్యాయవాది యొకరు నిరుద్యోగియగు విద్యావంతుని పాత్రమును అభినయించుచున్నారు.

రోహిణీ పిక్చర్సువారి "గృహలక్ష్మి"లో హెచ్. యం. రెడ్డిగారు మూడు ప్రధాన వేషములకు ముగ్గురు క్రొత్తవారిని ప్రవేశపెట్టి డైరెక్టు చేయుచున్నారు. గృహలక్ష్మిలో నాయక పాత్రమును ముక్తేవి రామానుజాచార్యులుగారు నిర్వహించుచున్నారు. గిరీశ పాత్రాభినయనములో ఆంధ్రదేశ ఖ్యాతిగడించిన వారి అభినయము ఈచిత్రములో క్రొత్త వన్నెలతో కొమరొందుచున్నది.

శాస్త్రి పాత్రధారియగు కాశీభట్ల గౌరీపతి శాస్త్రిగారు తమపాత్ర నిర్వహణమున అద్వితీయకౌశలము చూపుచున్నారు. పరవంచనమున స్వార్థపూరణమున వారి అభినయము అసాధారణము.

మూడవవారు చిత్తూరు నాగయ్యగారు. వారు హరిజన సేవాపరాయణుడగు కాంగ్రెస్ నాయకుని పాత్రమును ధరించుచున్నాడు. వారి వేషము, నడికారము సాత్త్విక గానసాధకునికి తగినట్లున్నది. కలకంఠముతో వారు పాడు సంస్కారగీతములు రాతినైన కరగింప జాలియున్నవి. క్రొత్తగా ఫిలిం ప్రపంచమున కాలువెట్టిన యీ మువ్వురును మునుముందు మరింత భాసించగలరని తలపబడుచున్నది. ఈ సంస్కృతివలన ఇంకెంతమందో అజ్ఞాతమూర్తులు సహజ కళా సంపన్నులు ముందుకు రావచ్చును.

ప్రస్తుతము తయారవుచున్న చిత్రములలోని అభినయమునుబట్టి క్రొత్తవారు ప్రాతవారి కందును తీసిపోరని వ్యక్తపడుచున్నందున ఇకముందు ప్రొడ్యూసర్లు వీలైనంతవరకు తమ చిత్రములలో క్రొత్తవారికి ప్రవేశ మొసగవలెనని కోరుచున్నాను.



# మన ప్రధానామాత్యులు శ్రీ గంటసైనా

**రాజాజీకి**



ప్రస్తుతం దేశంలో వుండే నాటక ప్రదర్శనాలు, సినిమాచిత్రాలవల్ల ప్రజల **మనోబుద్ధులు వికసించటానికి** బదులు, మొద్దు బాజిపోతున్నవి. ఇంగితజ్ఞానం గల ప్రతి వ్యక్తిన్నీ, ఈ విషయం తెలుసుకుంటూనే వున్నాడు; తెలుసుకొని ఏమీ చేయలేక నిస్సహాయుడౌతున్నాడు.

హిందువులకు భారత, భాగవతాది పురాణ గాథలమీద ప్రేమ అనన్య**సామాన్యము**. ఈ పౌరాణిక భక్తి స్రవంతి ప్రతి **హిందువుయొక్క** రక్తంతో కలిసి ప్రవహిస్తుంది. అందుచేత, ఏనాటకంలో గాని, ఏసినిమాలోగాని పురాణపురుషులైన రామకృష్ణాద్యవతారమూర్తులు కన్పిస్తారని తెలిస్తే. పావమీపాటకజనం పదిమైళ్లు నడిచైనాసరే నాటక, సినిమాప్రదర్శనాలకు వస్తారు. ఇంతటి వ్యయ, ప్రయాసలకు తుదకు వారికికలిగే ప్రతిఫల మేమాత్రం? వికారమైన, కృత్రిమమైన, పరిహాసభాజనమైన ఆకృతులే **వారికండ్లకు గోచరించేవి.** త్రిమూర్తులుగాని, రామకృష్ణులుగాని, **నారద, ఆంజనే**యాది భక్తాగ్రేసరులుగాని పరమ నికృష్ట మానవమాత్రులుగ నాటకరంగంమీదనో, సినిమా తెరమీదనో ప్రత్యక్షమౌతారు. ఆ మూర్తులు ఎలా వున్నప్పటికీ, అవతారమూర్తులను దర్శించామనే ఉత్కర్షతో ప్రేక్షకులు "కరయుగములు చరణంబులు ఉరము లలాటస్థలంబు సున్నత భుజముల్...." అంటూ సాష్టాంగ దండప్రణామానికి సంసిద్ధులౌతారు. కరతాళధ్వనుతో భూనభోంతరాళాలు ప్రతిధ్వనిస్తవి. పౌరాణిక నాయక లేక నాయికాపాత్రధారణం చేసే పురుషుడు గాని, స్త్రీగాని దిష్టిబొమ్మలాగు వుండొచ్చు; గాడిదలాగ అరవవొచ్చు; పిల్లికూసినట్టు పాడవచ్చు—కాని ప్రేక్షక మహాశయులకి లోపాలేవీ చెవికెక్కవు; కంటికి పొడగట్టవు; మనసుకు తట్టవు. నాటకం చూడవచ్చిన పాటకజనానికి కావలసింది రాముడూ, కృష్ణుడూను. వారెలా కన్పించిందీ, ఎలా నటించిందీ, ఎలా పాడిందీ, ఎలా మాటాడిందీ ఆ గొడవతో వారి కేంపని? అందుచేత అతనివాంఛ సఫలమైనట్టే ఎంచుతాడు. వెనకటికి నామిత్రులొకరన్నారు లెండి! ఎంతటి రుచిలేని కాఫీ ఐనాసరే, తానంతకు పూర్వం తాగిన మంచి కాఫీని తలుచుకుంటూ తాగితే, రుచిలేందికూడా రుచివున్నట్టే తోస్తుంది అని. అలా వుంది ఈ అమాయకులైనపల్లెటూరి ప్రజలవిషయం. ఈ ప్రజల మూఢభక్తిని అవకాశంగా చేసుకొని నాటకాల కంట్రాక్టరులు, సినిమా వ్యాపారస్థులు డబ్బుదోచేస్తున్నారు. వ్యాపారస్థుడు ఈ దోపిడిడబ్బుతో రోజురోజుకూ పూరిపోతుంటాడు. ఈ పల్లెటూరి పెద్దన్నమాత్రం ఈ మూఢవిశ్వాసంలో మునిగితేలుతూనే వుంటాడు. విద్యాధికులనబడే మన పెద్దలనేకులీ పద్దులో చేరేవారేనని నా అనుమానం. అర్థయుక్తమైన, హేతుభూతమైన, జ్ఞానవంతమైన ఒక కొత్త దృక్పథాన్ని,

# కళలను గమనిస్తారా?

రాఘవుని విజ్ఞప్తి



ఒక నూతన సందేశాన్ని సృష్టించి మౌఢ్యమూ, అజ్ఞానమూ వీటిని రెంటినీ తొలగించి, ఉత్తమమైన, ఉన్నతమైన, విశాలమైన, విశిష్టమైన, స్వతంత్రమైన జీవితాన్ని ప్రదర్శించటం అవసరంకాదా? ఇది సంభవము, సాధ్యము, సుకరమూ అనే నా విశ్వాసం; అంతేకాదు, మన ప్రజల్లో గాఢంగా నెలకొని వుండే ఈ పౌరాణికగాథానురాగాన్ని విజ్ఞానాభివృద్ధికి సైతం ప్రబల సాధనంగా వినియోగించవచ్చు.

  

పాతధోరణి వెరటితోవ పట్టిందంటున్నారు. కొంత సత్యం లేకపోలేదామాటలో. కొత్తపద్ధతిలో వాస్తవికదృష్టి ప్రబలంగా వుంది. జీర్ణాంబరధారులై, నిరాహారులై, మౌనమే భూషణంగాదాల్చి పరితపిస్తూన్న పతితమానవకోటివైపే ఈ నూతనమతం తనదృష్టిని కేంద్రీకరింపజేస్తున్నది. వీరందరకు కూడు, గుడ్డలను కల్పించటం మొదటిపని. వీరిని ఋణపిశాచంయొక్క విషపు కోరలనుంచి తప్పించటం విధాయక కృత్యమే. కాని, దీనితోబాటు, వారి మనోబుద్ధులను కూడా పల్లవింపచేయాలి. జీవితపరమానందాన్ని అనుభవించకలిగేట్టు, భావసంపన్నమైన జీవితం గడపగలిగేట్టు వారిని ప్రబోధించాలి. కేవలం పరీక్షల్లో వుత్తీర్ణులై, పట్టాలు చేతపట్టే పనికిమాలిన చదువులు మాన్పించాలి. ఈ చదువులైనా సులభసాధ్యమా అంటే, నూటికి 95 మంది తల్లిదండ్రులు, తమబిడ్డల చదువులకని వున్నభూమి బుట్రయావత్తూ తెగనమ్ముకోక తప్పటంలేదు. కాలేజీలల్లో విద్య పరిసమాప్తం కావటమే తడవు, వుద్యోగాల వేట ఆరంభమవుతుంది. ఇందులో నెగ్గుతామనుకొన్నా, సాంఘిక విచక్షణొకటి అడ్డుతగులుతుంది. ఎలాగో చచ్చిచెడి, ఒక వుద్యోగం లంకించుకున్నాక, ఈ విద్యాధికుడైన పెద్దన్నకు శల్యావశిష్టమైన గంపెడు సంతానం; పాపంలాగా పెరిగుతూంటే పుట్టెడు అప్పు. వీటితో అతని జీవితంలో ఆనందం అంతరించిపోతుంది. అతడు హతాశుడౌతాడు. అతను బడసిన విద్య 'రసం, సాదం' విద్య కాబట్టి, ఆశాజనకమైన పరిస్థితులను సృష్టించుకోటానికి సమర్థమైన మానసిక సామగ్రి ఎక్కడనుండి లభిస్తుంది? అప్పు పెరుగుతుంది: సంసారం, వృద్ధి అవుతుంది. ఈ రెంటిలో దేన్నిగాని ఆపడానికి అతడు అశక్తుడౌతాడు. చివరకు, దిక్కు తోచక

ముప్పయి మూడుకోట్ల దేవతలకు మొక్కుతాడు. కాని, ముక్తిని కనలేడు. మనవారిలో విద్యాధికులమని చెప్పకుండే యువకుల్లో నూటికి తొంభైమంది జీవితం ఈ విధంగానె గడుస్తుంది. ఈ పరిస్థితులు పూర్తిగా మారటం చాలా అవసరం.



కళకు, నిరాడంబరతకు బాంధవ్యం. ఈ రెంటికీ అవినాభావ సంబంధం. శ్రావ్యమైన సంగీతము, దర్శనీయమైన చిత్రకళ రెండూ అకృత్రిమజీవితానికీ, అనల్పమైన జ్ఞానసముపార్జనకు మిక్కుటంగా తోడ్పడతవి. 'వాగ్నరు' లాంటి మహామహుడెవడో ఒక్కడు ఈ సూత్రానికి భిన్నంగా వుండవచ్చు. అలాంటివారి విషయం మనం వదలివేస్తాం. ఆత్మనిగ్రహానికి తోడ్పడేది నాటకకళ. పుస్తకాలు, పాఠశాలలు విద్యార్థికి రమణీయమైన జీవితాన్ని సూచనగా చూపించవచ్చు; కాని, ఆ జీవితాన్ని అనుభవించటానికి, తద్వారా ఆధ్యాత్మిక జీవిత మాధుర్యాన్ని గ్రోలటానికి శిక్షణను ప్రసాదించేవి లలితకళలే. సందేహంలేదు. అక్షరజ్ఞానం కలగచేయటానికి పాఠశాల లెంత అవసరమో, ఉత్తమకళను ఆనందించటానికి తగిన అభిరుచిని కలగజేసే కళాశాలలు కూడా అంత అవసరమే. ప్రస్తుతం మన నాటకశాలలు, సినిమా థియేటర్లు కళాప్రపంచంలో ప్రధానస్థానం ఆక్రమించుకొన్నవి అన్నమాట యథార్థం. వీటిపైన ఏటేట ప్రజ లెంతెంతడబ్బు వెచ్చిస్తున్నారనే విషయం ప్రభుత్వంవారు సులభంగా తెలుసుకోవచ్చు. లెక్కలుకట్టితే—త్రాగుడుపైన వెచ్చింపబడేంత కాకపోవచ్చుగాని—ఇదేమంత తక్కువ మొత్తం కాదు. ఈ నాటకశాలలు, ఈ సినిమాథియేటరులు ప్రజాసామాన్యంయొక్క మనస్సులను వికసింపచేశేవా లేక కల్లంగళ్లలాగానే వారిబుద్ధులను బుగ్గిలో కలిపేవా అనే విషయం పరిశీలించటం ప్రభుత్వంవారి విధ్యుక్తంకాదా? మానవుడి నీచప్రకృతిని రెచ్చగొట్టడంలో ఈ రెంటికీ ఒకేవిధమైనశక్తి వుండటంచేత కల్లంగడులన్ను నిషేధించటం ఎంత అవసరమో, కళకు కలంకం ఆపాదించే ఈ సంస్థలను అరికట్టటం కూడా అంత అవసరమే.



ప్రజాసామాన్యానికి నీతిని ప్రబోధించటము, వారి భావనాశక్తికి పదును పెట్టటము, అద్దంలోవలె సంఘము తన ప్రతిబింబాన్ని చూచుకొని గుణ, దోషములను తెలుసుకోగలగటము, నటుల్లోను ప్రేక్షకుల్లోను వైరాగ్యభావాన్ని పెంపొందించటము, ఇవి నాటకంయొక్క ప్రధానోద్దేశాలని సర్వజన విదితమే. మానవుని కళా, విజ్ఞానసంపత్తిని పదిల పరచి, పోషించే ఉత్తమ సంస్థలు పురాతన కాలంలో మనదేశమంతటా వెలసివుండేవి. వర్తమానస్థితి శోచనీయంగా వుంది. నేటి నాటకశాలలు, సినిమాభవనాలు వ్యాపారస్థుని ధనాభిలాషను తృప్తిపరిచేందుకే నిర్వహింపబడుతున్నవి. ఈనాటి నాటకాలను, సినిమాలను తయారుచేసే ప్రొడ్యూసరు మహాశయులతో పోల్చిచూస్తే, కల్లుసారాయిజారా పాటగాళ్లు మహర్షిసత్తము లని చెప్పవచ్చు.



కాబట్టి మన ప్రభుత్వంవారు ఈనాటక, సినిమా సంసలను సంస్కరించి, వాటిని నిజమైన కళానిలయాలు గాను, విద్యాప్రతిష్ఠాపనలుగాను ఎంత త్వరగా మార్చితే సామాన్యజనాభ్యుదయానికి అంత మంచిదని చెప్పవచ్చు.

పాఠశాలలు, కళాశాలలవల్ల కలిగే ప్రయోజనాలు సామాన్య జనానికి అందుబాటులో వుండేవి కావు. నాటక, సినిమా సంస్థలు విద్యాసంస్థలకు తోడు నీడై, అవి చేయలేని పనినీ ఇవి నిర్వహింపవచ్చును. గ్రామసీమల్లో ప్రబలివుండే వయోజన విద్యాసమస్య అపుడంత క్లిష్టంగాను, దుస్సాధ్యంగాను తోచదు. ఇందువల్ల ప్రభుత్వానికయ్యే ఖర్చుకూడ అట్టే విశేషంగా వుండదు.

ఎప్పుడైతేజనసామాన్యంయొక్క మానసక్షేత్రంలోఉత్తమకళా సందేశాలకి నెల వేర్పడుతుందో, అప్పుడే లక్షలకొలది, కోట్లకొలది ప్రజలు మహోదారమైన, పరమపవిత్రమైన చిత్తశుద్ధితో సువర్ణయుగోదయానికి జోహారు లిచ్చేందుకు సంసిద్ధులౌతారు. వారి నిదివరకు ప్రమత్తులుగను, అప్రబుద్ధులుగను చేసిన అనుదాత్తమైన కృత్రిమకళాసంప్రదాయ బంధాలను తృటిలో తెంచుకోకలుగుతారు. త్రాగుడు దానితోబాటు, కళావిహీన జీవనము ఈ రెండూ, దేశంలోనుంచి మాయమౌతవి. అభ్యుదయ మార్గంలో నడిచే సైని

కులు తమ జీవితాలను నిరాడంబరంగాను, కళాశోభితంగాను మార్చుకొని, అక్కరలకంబలిగాకుండావుండేందుకు కళామాత తనదివ్యాశీస్సులను వారిపై వర్షిస్తుంది. బహు శతాబ్దులుగ దుస్సహదారిద్ర్యంలోను, దుర్భరరుణగ్రస్తతలోను దాగివుండే ధైర్యసాహసాలు, వెలికివచ్చి ప్రజల మానసక్షేత్రంలో స్థిరంగా నెలకొంటవి. అపుడు భారతజాతి ఏకముఖంగా దివ్యకళలతో దేదీప్యమానంగా ముందుకు నడుస్తుంది.

మనదేశంలోవుండే ప్రతిగ్రామసంఘము యూనియన్, మునిసిపాలిటీ, జిల్లాబోర్డు మొదలైన ప్రతిసంస్థకూడా, జానపదులకు విశిష్టకళా, విజ్ఞానాలను బోధింపజాలిన నాటక, సినిమా ప్రతిష్ఠాపనలను ప్రోత్సహించాలని నామనవి. ఒక్కమాటలో చెప్పవలసివస్తే, నాటక, సినిమాసంస్థలు విజ్ఞానదాయకములును, ప్రబోధాత్మకములు అనేవిషయం ప్రభుత్వంవారు గ్రహించి, ప్రస్తుతంవుండే ఈ "కళామందిరా''లను సంస్కరించటానికి దృఢసంకల్పంతో పూనుకోవాలి.



నామమాత్రమైన కళకు మనదేశంలో తావులేకుండా పోవాలి. ప్రజలఅజ్ఞానాన్ని, అసత్ప్రవృత్తిని రెచ్చగొట్టి ధనార్జనచేయటానికి కళానిర్వాహకులకు కొంత అవకాశం లేకుండా చేయాలి. భూమి సూర్యుడిచుట్టూ తిరుగుతూందని పంతుళ్లు బళ్లల్లో పిల్లకాయలకు బోధిస్తారు. భూమి వలయంగాలేదనీ సూర్యుడే భూమిని చుట్టివస్తాడనీ, సహస్రశీర్షుడైన ఆదిశేషుడు భూమిని మోస్తున్నాడని నాటకంలో కవి వర్ణిస్తాడు. ''సత్యంవద, ధర్మం చర'' లాంటి ఉత్తమ నీతిబోధను విద్యార్థులకు ఉపాధ్యాయులు గఱపుతారు. ఆ విద్యార్థులే నాటకాలకు, సినిమాలకు వెళ్లి మనదేవుళ్లు, మన త్రిమూర్తులు, మన అవతారమూర్తులే వ్యభిచారము, పరదారాగమనము, ఇంకా ఇలాంటి అత్యాచారా లెన్నో తమ కండ్లయెదటనే చేయటం చూస్తారు. కాబట్టి, ప్రస్తుతం మన నాటకాలు, సినిమాలు ప్రజల విజ్ఞానాభివృద్ధికి అడ్డుకట్టలని చెప్పటానికి నేను సంశయించను. కళ వినోదంకొరకేననే మతం కలవారు కొందరున్నారని నే నెరగక పోలేదు. మానవుడికి వినోదం కావలసిందే, కాదనను. వినోదం వేరు, ఆనందం వేరు. ఆనందం ఉదాత్తమైనది; మహోత్కృష్టమైనది, నీచప్రవృత్తిని పురికొల్పేది ఆనందమనిపించుకోదు. అసహజమూ, కృత్రిమమైన సౌందర్యం మనోల్లాసాన్ని కలగజేయటానికి సమర్థమా? అట్టిది తాత్కాలిక చిత్తవిభ్రమానికి తోడ్పడవచ్చు. గర్భదారిద్ర్యంతో తాండవించే మనదేశం, పొట్టకూడు ఆశ్తతో తలమున్కలవున్న మన గ్రామవాసులు ఇలాంటి విలాసాలమీద ధనం వెచ్చించగలరా? జూదము, మద్యపానము గాంధిమహాత్ముడి దృష్టి నాకర్షించినవి. మన ప్రధానామాత్యులదృష్టి ఈ కళాప్రదర్శనాల నాకర్షించదా?



# అక్కమ్మ అక్కసు

పూడిపెద్ది
వెంకటరమణయ్య

సీమవెండి కడియాలూ అందెలూ ఆచిన్నపాదాలమీద. ముల్లత్రిప్పిన గోచికట్టు. చేతికి రెండేగాజులు. మెడలో మాయపూసా గాజుపూసా, మట్టిపగడాలూ ఎగుడు దిగుడుగా ఏదో సూత్రాన పన్నిన దండ ఆ యెండు లేతబోరమీద ఎటు ఒదిగితే అటు దొరలిపోతూ. ముక్కు మూడు కుట్లకూ మూడు ఒత్తడి కాడలు మాయ ముత్తెపు కమ్మితో. చెవుల కిత్తడివే మద్దికాయలు. ఇదికాంత ముస్తాబు. కాంతఅనగానే ఏ వయస్సులోనో ఎదిగిన కాంతగాఅనుకోకూడదు.

ఆమె పేరు కాంత. తొమ్మిది పదేండ్ల క్రింది వయస్సు. అయితే ఏపుతక్కువౌను. ఆరేళ్ల పిల్లలాగు కనబడేది. రాజభవనాలగోపుర కుంభాలమీద తళతళలాడే ఆ ఉదయరాగమే చుట్టుగుడిసెల నడుగొప్ప మట్టిమీదా ప్రసరిస్తుంది. ఆజగచ్చక్షువు రెంటినీ సమానంగా ఆదరిస్తాడు. వెచ్చవెచ్చని, తన అరుణారుణ అంశుశ్రోత్రాల నిమురుతాడు. కడిగిన ముత్తెము లాటి కౌగిటిలో ఆదరిస్తాడు. తడవులాడుకో నక్కరలేదు. వారి వెతగికో నక్కరలేదు. తెల్లవారినదని ఎల్ల జీవులూ, ఉల్లాసంగా మేల్కొని ప్రాపంచిక చైతన్యంలో ప్రకాశించే సమయ మది.

ఏదరికాని కన్నీ కొరతపడినప్పుడు నిద్రమాత్ర మేలుకొరవడదు ? కోడికూతతోసంగీతంగా, ఉదయంకోసం ఎదురుచూస్తుంది పేదహృదయం. ఉషిక్కంచిన ఆ శరీరంలో ఇమిడి, శూన్యమయిన ఆ గుడిసె పొట్టల్లో నొదిగి, కంపంగా కొంతసేపూ కన్నీరుగా కొంతసేపూ, గద్గదికగా కొంతసేపూ గాఢదుఃఖంగా కొంతసేపూ తడవాట్లు పడుతూ తడవులాడుతూ, తహతహలాడే ఆ పేదరాలి హృదయాన్ని నిశా ప్రశాంతి మరింత మరింత వేధించుకొని తింటుంది. ఫలవంతములయినా కాకపోయినా, పనిపాటుల నెపంలో విస్మరించాలి తాత్కాలికంగా నయినా ఆ లేమిబాధ. విశ్రాంత సమయదర్శనము వారి హృదయాలను నొక్కుతుంది. అందుకని పెకువనే లేచింది. నిద్రమేల్కొనుటకాదు. కంటికి కూర్కు తెలీదు కనకానికి తాను తన ఒడ్డకాంతతో కూడ లోకంలోకి దూకిన దగ్గరనుండీ. భర్త కామయ్య ఎలా సంరక్షించేవాడో అతని జీవితకాలంలో తప్ప. అతడు కనుమూత పెట్టగనే ఆమె కూతురుతో కూడ ఆచుట్టుగుడిసె చీకటిపొట్టలో మిగిలింది. కూలినాలిచేసి యెరుగదు. బాహాటంగా బయటకువచ్చి యెరుగదు. ఏదో ఉపాయానపొట్టబోసికో వలెననే ఊహ ఆమెను నిలువునా కదలిస్తున్న దినాలవి.



"నిద్రలేవవే ? కాంతా ! చూడూ! ఎంతప్రొద్దయిందో! నీతోడి పిల్లలప్పుడే చూడూ ఎన్ని పనులు చేస్తున్నారో-లే! అదిగో-పొరుగువాళ్ల పోలి బుట్ట చేతపట్టుకొని వెళుతూంది. నిను పిలువవచ్చింది. జట్టుగా దానితో వెళ్లి బుట్టెడు గింజలైనా ఏరుకొనిరా- లే!" అని దగ్గదంగా ఆమెనెన్నువతట్టి తల్లి నిద్ర మేల్కొలిపింది కాంతను.

ఆ చురుకుదనం, ఆ ఆటపేరూ, ఆపాటకూర్పూ- ఆ కదలికా, ఆ ఉత్సాహం, ఆ సంతుష్టి, ఆ మురుపూ, ఆ మురిపింతా, అవన్నీ ఆరోగ్యంగల బాల్యానివి. కాంతకాస్త ఎరుదుగా ఉన్నా ఆరోగ్యానికేమీ లోపం లేదు- ఆ పేపకట్టుక్రింద పోలీ తానూ నడుమడు గుండుగా నవ్వులు పంచుకొని వేపగింజలేరుతున్నారు. పట్టుతప్పి నేలరాలిన పచ్చని పళ్లు ముచ్చవేళ్ల తో ఏరి ఏరి చెమ్మచెమ్మ గింజలను బుట్టలో పడవేసుకుంటున్నారు. చిన్నరాళ్లురువ్వి, కడ



చెట్లుగల పండ్లను రాలుస్తున్నారు. నేనెక్కువ ఏరేనంటే, నేనెక్కువ ఏరేనని పందెములొడ్డుతున్నారు- పంతాలాడుతున్నారు. ఊరింతగా ఒండొరుల చూచుకుంటున్నారు. ఇద్దరు ఒకేసారి స్పృశించినందున ఈ గింజ నాదీ అంటే నాదీ అని పెనగులాడుతున్నారు. నేను ముందు చూచేనంటే నేను ముందు చూచే నాగింజనని హక్కునకు కారణమంత చక్కగా చెప్పికొంటున్నారు- "మానీ నాదీ" అని కాంత ఆ గింజను తన బుట్టలో వేసికొని తగవు పరిష్కరించేసింది. తన పక్షాన్నే ఒకటి రెండు ఓట్లతో పోలి అపీలు చేసిందిగాని దెసువతీర్పే ఖాయమయిపోయింది. కాంత చురుకూ, గడుసుదనం పోలి కెలా వస్తాయి. పోలి మెత్తపడినట్టు ఊరుకుంది.

ఆలాగు చెట్టుక్రిందనుండి చెట్టుక్రిందకు వారు నాల్గుకన్నులూ వేపగింజలై తిరిగేరు జట్టుగా. కొంతసేపూ సవతుతో కొంతసేపూను. బాగా ప్రొద్దెక్కింది. చల్లందుల వేళ అయింది. ఆచిన్నిపొట్టలు ఆకలిబావుటా ఊచి ఆగమన్నాయి వాళ్లను. నేనింటికిపోతానంది కాంత. నేనూ వెళిపోతానంది పోలి. ఇరువురూ ఆతోట అంచున నిలబడి ఒకరి బుట్ట ఒకరు పరీక్షించేరు. కాంత బుట్ట నిండింది. పోలిబుట్ట సగం వెలితి.

"గింజలన్నీ కుప్పగా పోసి చెరిసగమూ పంచుకుందాం" మంది పోలి రాజీనామాగా. నేనందు కొప్పుకోనంది కాంత. పోలి బూరటించిన బుగ్గలు రెండుపిడికెళ్లతో గ్రుద్దుకొని. కాంత జుట్టువిప్పేసింది కను రెప్పలూపేడ్యుట నటించి.

కాంత 'పోపొమ్మ'ంది-పోలిని. తాను కష్టపడి యేరుకొన్నగింజ లామెతో ఎందుకు పంచుకుంటుంది!



పంచుకోకపోతేపోనీ! చిన్నగింజే చేదు చెట్టయి మొలచి వ్యాపిస్తుంది. బీజం నాటేక మొక్కరాదూ? అందులోకీ పోలి తల్లి "అక్కా" అక్క అని పిలుస్తే ఆమెకుకోపం- "ఏం నీసొమ్ము నాకుపెట్టేవా? లేక నన్ను కొన్నావా? అక్కమ్మా అని పిలువలేవూ" అంటుంది. అక్కమ్మ - కనకమ్మలాటిదే - తానూ పోలీ తనకుటుంబం- పేదసంసారమేను- అయితేనేం చేదుమ్రింగినట్టు లేమిని మ్రింగుతూ పైకి మాధుర్యాన్ని ప్రకటిస్తారు కొందరు. ఎంతో నిండుగా కనబడతారు. లోలోపల కుందుతారు. వాళ్లకుమాత్రం హృదయాలు లేవా? కోర్కెల పీకులేదా? అయితే వారి బాధలు ముసుగులో గ్రుద్దులాడుతాయి. వారు ప్రకటించేది, కృత్రిమసౌఖ్యం-

అల్లంతదూరాన పోలినిచూచింది. అక్క- అక్క అనే పిలుద్దాం కోప్పడితే కోప్పడనీ. "అయ్యో తల్లీ! మొగం కందిపోయిందే! చెమట కారుతూంది చెక్కులంట! నాయమ్మ అలసిపోయేవే! నా ముద్దుకూచి! అలసిపోయేవే! నాగారాలపట్టి! అలసిపోయేవే? అయ్యో నావజ్రతల్లీ అని పైటచెరగుతో పోలి మొగము (వీధిగుమ్మములోనే పోలిని నిలబెట్టి) ఒత్తుతూ వగచింది అక్క. పోలికి అకారణదుఃఖం పొరలివచ్చింది. కుడిచేత గింజలబుట్ట వడకిస్తూ ఎడమచేతి మండతో కన్నులు నులుముకుంటూ వెక్కివెక్కి ఏడ్వడం మొదలు పెట్టింది.

"ఏమమ్మా! ఏమి! ఎందుకలా ఏడుస్తున్నావూ? ఎవరేమన్నారు నిన్ను?"

పోలి: వాళ్ళకాంత వేపగింజలన్నీ తానే ఏరుకొని పోయింది. నాకు కొంచెమేను. అది బుట్టెడుగింజ లెత్తుకుపోయింది. అడిగితే తిట్టింది. ఊఁ! "ఊఁ!" అని యేడ్చింది.

అక్క: ఏడవకమ్మా! మొగం కళ్యా నాలిపోయినాయి. కన్నులో తీసుకొనిపద! [illegible] చల్లంది పెడతాను. వాళ్ళకాంతను వాళ్ళమ్మతో చెప్పి కొట్టించేస్తాను.

[illegible]ంపజుట్టు చెవులవెనక్కుదువ్వుతూ ఆలోచనగా బయలుచూస్తూ అందిమాటలు అక్క పోలి తెచ్చిన వేపగింజలబుట్ట పరీక్షించింది. "ఎప్పుడూ ఇంతే ఎంతెంతా దీనిపాలు! ఆగయ్యాళి ముండే గింజలన్నీ ఎత్తుకుపోతుంది. ఏంవస్తుం దీగింజలకి? షాహుకారు చేర దుప్పగల్లయినా ఇవ్వడు. బుట్టెడు గింజలెత్తుకుపోయింది. అవీయివీ కలిపితే అణాడబ్బులకేనా వచ్చునా? అదివట్టి దుడుకుముండ; రోజూ ఇలాగే చేస్తూంది. వాళ్ళతల్లి దానినేమీ అనదు. ఇదివరకు రెండుసార్లు చెప్పేను ఆమెతో. అన్నిగింజలూ అదే నొల్లుకొని పోతే యెలాగు?" నిట్టూర్చింది. ఆలోచించింది. తల పంకించింది.

చలిదితింటూ, పోలి, జాలిగా "అమ్మా! కాంతని కొట్టిస్తావా?" అని అడిగింది.

"ఊఁ!" అంది అక్క. ఆలోచనలో మునిగి అదేపనిగా కడవిరావకడే పోలినోటు క్రుక్కుతూంది.

***

"కనకమ్మదినా! ఇరుగూ పొరుగూ ఉన్నామన్న మాటేగాని మనం ఏవూళ్ళల్లోనో ఎడయెడంగానే ఉన్నట్టుంది. నీవు వెలుగుచూడవూ! నాకింటి పనితోనే పొద్దు చాలదూ."

కన: అక్కమ్మా ఏం పని? దేనికి చెయ్యాడందే ఏంచెయ్యడం? ఎలాగో నూకలు దుకబెట్టుకుందికే ఆధారంలేకుండా ఉంది. అదిగో రెండు జాములదాకా ఎండబడి ఏరుకొచ్చిన వేపగింజ అమ్మితే అర్థశేరు నూకలు వచ్చేయి. నాకూ బిడ్డకూ గంజితో కూడా కడుపులు నిండవు వాటితో ఏంచేయను-కూలి చేయలేను!"

కంటనీరు రాల్చింది.

అక్క:—నీకేంవదినా? కంచమంత కూతురుంటే మంచంమీదనే కూడంటారు. పది పన్నెండేళ్ళ పిల్ల ఉంది. బ్రతగటాని కుపాయాలే లేవా? పేడకూడ వేయించి పిడుకలుపెట్టి అమ్మించు-పుల్లలేరించి ముట్టెలుకట్టి అమ్మించు.

కన:—అలాగూ చేస్తున్నాను. కాని అక్కమ్మా, అవిమాత్ర మెప్పుడూ దొరుకుతాయా? ప్రయాసానికి తగిన ప్రతిఫలం ఉండదు.

అక్క:—అయితే వదినా? ఇప్పుడు పట్నాలనుండి వర్తకులు ఈప్రాంతాలకు వచ్చి ఇప్పపూవు గరిసెలకొలదీ కొంటున్నారట. ఈ చుట్టుప్రక్కల అన్నీ ఇప్పచెట్లేను. అయితే ఈ పని నీకూతురొక్కరితవల్లా కాదు. నీ, నాలాటి పెద్దవాళ్లు పూనుకోవాలి. నీవు వచ్చేమాట ఉంటే నేనుకూడా వస్తాను. దినకు నాలుగుతట్టల పువ్వు తెచ్చేమంటే నాలుగు బేడలు ఎనిమిదణాలతో ఎంతో సౌఖ్యంగా జీవిస్తాం. కావనకు, కనకమ్మ వదినా చచ్చినవాళ్లతో చస్తామా ఏమిటి? నీలాగే నేనూ ఉన్నాను. ధైర్యం తెచ్చుకొని జీవయాత్ర సాగించుకుంటున్నాను కాదూ. నీ ఇబ్బంది చూచి నేనూరుకోలేక నీకు సలహా చెప్పేను నామాటవిను. [illegible] బ్రతికింది పోరూనా. [illegible] జాము ప్రొద్దుకు [illegible] ఏరుకొని రాగలం. ఏ ఆటంకం ఉండదు. [illegible] కష్టమేమిటి?

కనకమ్మ [illegible]. [illegible] పోవమ్మా. [illegible]

మెంత కాలం?" అమకోని. సరే అక్కమ్మా! రేపటినుండీ అలాగే చేదాం అంది.

అక్క:-ఇందుకే వచ్చేను. నేనొక్కర్తెనూ పోలేను. ఆలాటి ఇలాటివాళ్లతోడున వెళ్లను నీకు తెలుసును గదా! వదినా నీతోడున వెళ్లడమే వాక్యం. వెళ్తాను మరి. వేకువనే పిలుస్తాను. నివ్వు లేవాలి సుమా!

కన:-నిద్రన్నది పడితేనా? ఎప్పుడూ తెలివే ఉంటాను. ఈ ఏడాదాయను, కంటికి కునుకొకటి ఉంటేనా? (కన్నుల నీరు నించింది)

అక్కమ్మ:-(పెదవులు తడుపుకుంటూ) కంట తడిపెట్టకు వదినా? దైవంచేసిన దానికి మనమేం చేస్తాం మరి నేను వెళ్లి వస్తునా?

కనక:-(కన్నులొత్తుకుంటూ) 'వెళ్లు మరి' వీధిగుమ్మందాకా అక్కమ్మ నంపకం పెట్టింది. పశ్చిమారుణకాంతి పాకుతూందప్పుడేనున్నగా తుడిచిన మునివాకిట్లో. కాంత ఒత్తుగా నీళ్లు చల్లి చిరుముగ్గులు పెడుతూంది. మునువ్రేళ్లతో ముగ్గుటేనెలు వేస్తూంది, తుడుస్తూంది చిన్నకల్లబొల్లి పాటపాడుతూ. అక్కమ్మ ఆమె నెఱ్ఱగా చూచి తల పంకించింది. ఆమె కన్నులగ్నికణాల్లాగు మెరిసేయి ఆ అరుణకాంతిలో. వంగి ముగ్గుపెడుతూన్న కాంతగాని తలయెత్తి అక్కముఖంచూచినా, భయపడి పరుగెత్తి తల్లి వెనుక దాగియుండును. కాని ఆమె ఎంతో ఆనందంగా కళారచనలో లీనమయిపోయింది. తనచేరువనుండే వెడలిన అక్కపోక గుర్తించనేలేదు. అమాయిక హృదయంలో అన్నిటికి చోటుంటుందా?

***

మరునాడే - ఇంటిలోపలిగడపలోకి తలుపోరచేసుకొని, సందునుండి వీథిలోకి చూస్తూ కాస్త ధైర్యంగా కూర్చుంది కనకమ్మ- ఆరోజు తాను జీవయాత్రకు తగినపని చేసింది. నాలుగుతట్టల ఇప్పపువ్వు తెచ్చింది. ఎండబోసింది ఊరు బయలబండ రాతిమీద. కాంతను కాపుంచింది.

మునుమాపు, ముంజూరులో నీలిబావుటా ఊస్తూంది. పిట్టలు దినానికి స్వస్తివాక్యాలు చెబుతున్నాయి. అంత దినకాంతీ ఆవల పారబోసికొని దీపకళికలమీద ఆధారపడుతున్నారు ఊసు పోవని కార్మికులు. 'పగలల్లా బారెడు నేసేను దివ్వ తేరా దిగనేద్దామన్న స్వభావంగలవాళ్లు. కాంత రాలేదు. నాలుగు తట్టలు ఒక్కరితా తేగలదా? తెస్తానంది రెండొకసారి రెండొకసారని. ఇప్పపువ్వు తేలిక గదా! ప్రొద్దున్న ఇంటినుండి బండరాతికడకు సులభంగానే మోసింది. వర్తకులు రేపువస్తారంది అక్కమ్మ. ఇగిరినపువ్వే కొంటారంది. దినమంతా ఎండితే చాలునంది. నాలుగుతట్టలపూవు! అరరూపాయి. ఒక్కసారి అరరూపాయి. ఇంకేం కావాలి - దరిద్రం తీరిందన్నమాటే. కాంతానికి గాజూమట్టే. చీరే శతమానం. ఔను...ఆఁ! కాంతేను. నేననుకున్నట్టే రెండుతట్టలోకేతూరి నెత్తిని పెట్టుకొని వస్తూంది. క్రిందికున్న ముంజూరు వంగి దూరి మునివాకిటికి వచ్చి బిడ్డతలనున్న గంప లందుకొని కన్నుల ఆనందబాష్పాలు నించింది కనకమ్మ. "బిరాన వెళ్లి మిగిలిన రెండుతట్టలూ తీసుకొనిరా చీకటిపడుతుంది."

కాంతచేతులు వ్రేలాడవైచికొని నిలచింది లిప్తమాత్రం.

కనక—నిలవడానికి ప్రొద్దుందా? చీకటయిపోతూంది. వెంటనేవెళ్లి మిగిలిన తట్టలు తీసుకొనిరా! త్రోవమంచిదికాదు పురుగేమో పుట్టేమో?

ముందుకుపడని బరువయిన అడుగులను నెట్టుకుంటూ నడుస్తూంది కాంత - అలసిపోయిందేమో! చిన్నపిల్లగదా! అయితేనేం నడుంవంచి పనిచేయాలి. అమ్మ కోప్పడుతుంది. ఆకలొకటి! ఏవేవో ఆలోచిస్తున్నట్టు అలక్ష్యంగా ఆ ముదురుతూన్న చీకటి బోగలలోకి చూస్తూ వెడలింది.

కనకమ్మ ఆ రెండుతట్టలూ నట్టింట ఒకదానిప్రక్క నొకటి ఉంచి వానినిచూచి- ఆవాసన నతిప్రేమగ ఆఘ్రాణిస్తూ "ఇప్పపువ్వు" దీనికింత విలువా? ఇన్నాళ్లాయూ నాకు తెలిస్తే ఎంతసొమ్ము చేసిఉందును. అక్కమ్మ ధర్మమా అని ఇదొక ఉపాయం జీవనానికి - సుఖజీవనానికి చేపడింది. అక్కమ్మ మంచిది. పరోపకారబుద్ధి గలది. తెలివితేటలు గలది. మాటలు చక్కగా ఆడుతుంది. పనులు చకచకా చేస్తుంది. ఆమెకు చేతులు జోడించి దండంపెట్టాలి." ఆకనకమ్మ విశ్వాసపూరితమయిన హృదయంతో గడపలోకివచ్చి కాంత రాక కెదురుచూచింది. చీకటి చిక్కపడుతూంది. దానిని చించుకో మరీచూస్తూంది. చేరువనే ఒకపెడకు రెండుతట్టలూ తలమీద పెట్టుకొని చేతులు వ్రేలాడవైచికొని కాంత నిలబడ్డది మాటాడకుండా క్రీనీడలాను.

కనకమ్మ త్రుళ్లిపడి 'కాంతా వచ్చేవా? నీకోసమే చూస్తున్నాను-పిలువవేమీ! బరువు మోస్తూ నిలబడిపోయావు?—" అంటూ తట్టలందుకోబోయింది. రెండుతట్టలూ ఆమెచేతుల్లో తేలిపోయినాయి. ఆమె తెల్లబోయి కంగారయి గంపలు నేలదించింది వేరువేరుగా. తట్టలలో ఇప్పపూల తెల్లనిజాడ కంటబడలేదు. వానిలో చీకటేఉంది. కనకమ్మ హృదయంలో చీకటి అలముతూంది. కాంత కన్నులలో చీకటి పులుముతూంది బుద్ధి.

రెండుచేతులా రెండుతట్టలోకేసారి తడవింది కనకం వణకుతూ.

అయ్యో! వట్టిగంపలే! కాంతా ఏదీ ఇప్పపువ్వేదీ? ఏం చేసేవు?

కాంత మాటాడలేదు. నోట వ్రేలుకరచికొని తల్లిని చూస్తూంది ఆ చీకట్లో -

ఏమే మాటాడవూ! ముండిదానా? ఏదీ పువ్వంతాను? పిడికెడా- చేరెడా? రెండు తట్టల పువ్వేమయిందే? అయ్యో! ఎంత దౌర్భాగ్యమే. దరిద్రురాలు తలగడుకొక్కబోతే వడగళ్లవాన కురిసిందట. అయ్యో! ఎంతశ్రమపడి ఏరనే? చీకటింటపోయి, సిగ్గూ దుఃఖం అన్నీ విడిచి-ఏం చేసేవే! చెప్తావా? చెప్పవా? ఎవరికిచ్చేశావు-ఎవరైనా నిన్ను బెదరించి ఎత్తుకొని పోయారా!

కాంత:—లేదు.

కనకం. లేకపోతే పాడుముండా! రెండు తట్టల పువ్వేమయిందే?

కాంత:-మాటలేదు. వెక్కివెక్కి ఏడుస్తూంది.

"కనకమ్మ వదినా? పువ్వింటికి వచ్చిందా?" అంటూ అక్కమ్మ ప్రవేశించింది.

కనక:- అక్కమ్మా నాదురదృష్టానికి అంతమున్నట్టు కనబడదు. నీవే చూచేవుగదా నాలుగుతట్టల పువ్వు తెచ్చి ఎండబోసి ఈపాడుముండను కాపుంచేను. కడుపునిండా చల్లంది పెట్టి కఱ్ఱచేతికిచ్చి కాపు కూర్చోమన్నాను. కానీ చక్కలం కొనిఇచ్చేను. దీనిముద్దుముక్కలుగాను- దీనిసిగ్గు చిమడా, పదేండ్ల పిల్ల ఇంతపనికిమాలిపోవడమా?

అక్క:-(ఆశ్చర్యముతో) ఏమయింది? ఏంచేసింది?

కనక:-ఏమో ఏంచేసిందో రెండుతట్టల పువ్వేమాత్రం తెచ్చింది. ఇవిగో రెండు వట్టి తట్టలు తెచ్చి నానెత్తిని కొట్టింది?

అక్క (విచారం జాలీ నటిస్తూ) అయ్యో! రెండుతట్టల పువ్వే బండపాలు చేసింది. ఏం చేసిందో! ఏ షావుకారు కిచ్చేసి చక్కిలాలు పుచ్చుకుందో? తవ్వెడా? అడ్డెడా? ఇంత తరుగేమిటి? చూడడానికి చుంచులాగుంటుందిగాని వదినా! వీళ్ళకు ముద్దులావయిపోయింది. గాలుగాయలయి పోయారు. శిక్షిస్తూ ఉంటేగాని లొంగరు. కానీయా? పరకా? నాలుగణాలు! ఎలా వస్తాయమ్మ మనలాటివాళ్ళకు. ఒకదినగ్రాసం ఒడ్డెక్కిందమ్మా! మా పోలికింత పెంకితనం లేదు. నాలుగు తట్టలపువ్వూ ఎత్తుకొనివచ్చి నట్టింట దింపింది ఇప్పుడే. నాదగ్గర ఈవేషాలూ, ఈముద్దూ పనికిరావు. కొంచెం తప్పితే వీపుపగులగొడతాను. దౌడలువాయగొడతాను. తెలుసునా? ఇలాగయితే సంసారం చెటమూలకు రాదూ? ఇవేళ ఊరకుంటే రేపిదేపని.

కనకమ్మ ఆకబురులు విని కాంతమీద ఒడలు మండించుకొని రొసరొసలాడిందో విసవిసలాడిందో-చీకటి-ఆనట్టింట్లో చీకటే ధ్వనించి ప్రతిధ్వనిస్తూన్నట్టుందింతసేపూ. అక్కమ్మ నాల్కయి మాటాడుతూంది. చెవి అయి వింటూంది. కనకమ్మ కదలిన చప్పుడయింది. రంయిమన్న విసురు. "అయ్యో చచ్చే"నన్న పిల్లయేలుగు. కేకలు. ఛెడేల్‌మని వెంటనే దెబ్బునచప్పుడు వినబడింది. "చావుముండా! చావ"ని కనకమ్మ రోషంగా అరచింది. చేతిలోని చీపురా చీకట్లోకి విసిరేసి ఒగరుస్తూ నిలచింది. అక్క వెలిగించిన దీపపు ప్రమిద పుచ్చుకొని తిరుగా ప్రవేశించింది. కాంత నేల నొరిగి చుట్టుకుంటూంది ఒడలంతా.

అక్క (తేరిచూచి) ఆఁ! వగలాడీ! ఈ పాటిదానికే ఇంతనాటక మాడుతున్నావా? నీవెంతకయినా సాహసురాలివే! మొన్న మాపోలినికొట్టి దానివేపగింజ లెత్తుకొచ్చేవు కదా! నువ్వుదొంగవు. ఆఁ! ఇంతకాదు మరిం తగించుకున్నా నిన్ను చూచి జాలిపడం- వదినా? చూడవో? దానివగలు? అబ్బ! కాకరపువ్వు కాలిమీద పడ్డదన్నదట సీంహాటి ఇల్లాలే!

కాంత:—అయ్యో! అయ్యో! అమ్మో! అమ్మో! అని కొట్టుకొని కొట్టుకొని ఊరకుంది. అక్క ఆమెపైకురి చూచి తెల్లమొగంవేసింది. భయంతో కనకమ్మ తనపిల్లని చేరవచ్చింది. కదలని కాంతమీదపడి భోరున యేడ్చింది. అక్క ఆమెనోరుమూసి చెవిలో ఏమోచెప్పింది. కాంతకష్టములు గట్టెక్కినవి.

* * *

కనకం ఒంటికత్తె అయిపోయింది. జీవయాత్ర సాగించకతప్పదు. ఈ నాలుగుకోజులూ అక్కమ్మ ఇంతగంజిపోసింది. ఇకనెవరుదిక్కు- దుఃఖం దిగమ్రింగుకొని ఇప్పపువ్వేరికొనవలెనని నిశ్చయించుకొంది.

కాంత మోసికొని వచ్చిన ఆనాటితట్టలతో తిరుగా యిప్పపువ్వు తెచ్చి ఎండబోసి బంపరాతికడ ప్రొద్దుక్రుంకేదాకా కాపుకూర్చుంది కనకం. ప్రొద్దుపోయింది. సందెవెలుగులో పువ్వుతట్టల కెత్తింది. రెండుతట్టలే ఉంది పువ్వు. కనకం నిలువున కంపించింది. ఆశ్చర్యపడింది. ఆ లో చిం చిం ది. ఎం డి త గ్గి న ది! ఇ ది కాం త తప్పుకాదు. అయ్యో! కాంత! కాంత! ఓసోసి! నాకూతురు ఓ కాంత! నాకాంత! భూకాంత!" అని గొంతెత్తి డొక్కలు పగిలేటట్టు వాపోతూంది. ఎవరేమడిగినా ఇదే పదం—ఈ నాలుగుముక్కలే అనస్తూంది. ఆమెను చూచినవారు విన్నవారు-ఏకారణము నిర్ణయింపలేక వెఱ్ఱి యెత్తినదని విడచేశారు. యిప్పపూవూ లేవు. ఇంటి మొగమూ లేదు. కనకమ్మ కానలు పట్టిపోయింది. నాటికి నేటికీ.

పొరుగున అక్క పోలిని ప్రక్కలో వేసి కోపడుక్కుంది. ఏవేవో కథలుచెబుతూ పెరటిలోనుండి "ఓసోసి! ఓకాంత! నా కాంత! భూకాంత!" అన్నగోల వినిపించింది. "అమ్మా కనకమ్మ అత్త కాంతకోసం ఏడుస్తూందం"ది. పోలి. అక్క ముడుచుకుపోయింది అదోవిధమయిన భయంతో.

అక్కకి ఆహూత అనుదినమూ వినబడేది. ఆమె ఆ హూతవిని గిజగిజలాడిపోయేది.

పోలి ఆహూతవిని "కనకమ్మ అత్త" అనీది నల్లిక్రో.



# రామలేఖలు

## ౧



**రంగా,**

నీవు జినోవానుంచి వ్రాసినజాబు అందింది. నీవువ్రాసినట్లు ఏడను చుట్టూ పరశు రామ క్షేత్రమే. ఏడను జిబ్రాల్టరు బ్రిటిషురాజ్యాంగ కళేబరమునకు రెండు కుతికెలు. ఇవిబిగిస్తే ఆట కట్టుతుంది. వీటిని కాపాడుకోవడము బ్రిటిషు రాజ్యతంత్రములలో మొదటి ఎత్తుగా భావిస్తారు.

నీవు సూయెజులో దిగి రైలెక్కి పిరమిడ్లు చూచి కైరోమీదుగా సయెద్ బందరులో తిరిగి బోటుకువచ్చి కలుసుకోవడము చాలా తేలికైనపని. సయ్యెద్ బందరులో బొగ్గువేసుకోవడము రోజున్నర పట్టుతుంది. ముక్కులు, గుడ్డలు బొగ్గుదుమ్ముతో నిండిపోతవి. ఇది తప్పించుకొని ఈజిప్టు ప్రాచీనవైభవము కండ్లారచూచి ఆనందించగలిగావు. ఈజిప్టుకు స్వరాజ్యంవచ్చి ఇండియాకు రాకపోవడానికి కారణ మేమని వూహిస్తావు?

కళాభిజ్ఞుడ వయిన నీవు, జినోవాపర్వత సానువులపై గట్టిన ఋషి మందిరములను జూచి యానందించుటలో ఆశ్చర్య మేమున్నది? తెల్లని చలువరాలతో గట్టిన మిద్దెలు తాజ్ మహాలున కినుమిక్కిలిగా వుంటవి. మగరాలతో జెక్కిన విగ్రహములలో ప్రాచీన రోమక, గ్రీకు శిల్పుల కళావిజ్ఞానము కొనమెట్టు కెక్కినది. నగ్నశిల్పములలో అంగసౌష్ఠవ మెంత చక్కగ చూపబడినది? బ్రహ్మసమాజకుడ వయిన నీకవి కంటగింపుగా నున్నవి గాబోలు! చిత్తశుద్ధికి అడ్డు తగులునని కొందరు క్రైస్తవ సాంప్రదాయముల వారు ఆదివారమునాడు వారి యిండ్లలోని గోడలపై గట్టిన చిత్తరువుల మూసివేసేవారట. కళాభిజ్ఞుడయిన రస్కిను కిది ఘోరముగా గన్పడేదిట. ఈవింత భావములే బ్రహ్మసమాజకులలో కొందరకున్నవి. సరస పిపాసకును వింత చిత్తశుద్ధికి జంట ఎట్లాకుదిరింది? ఇవి రెండు ఒక ఒరలో ఇముడవ వనుకోను. రెంటిలో ఏదో ఒకటి విరమించుకోక తప్పదు. అతి పనికిరాదని తెలుసుకో?

మనము వెనుక విద్యార్థులముగా పోయినప్పటికిని ఇప్పటికిని ఇటలీలో చాలా తేడావున్న దనుకుంటాను. ఇటలీ హిందూదేశమువలె పైరు వేసి వేసి సత్తువ తీసిన పొలమువలె కనుపడేది. ప్రపంచనాటకములో ఈ రెండు దేశములు ఆఖరు అంకమును ఆడివేసినవా అనిపించేది. ఆమని రాంగానే మోళ్లు మోసులెత్తినట్లు ఇటలీ విజృంభిస్తున్నది. అవతారమూర్తి ముసోలినీ క్షీణించిన ఇటలీయొక్క ముసలి రక్తనాళములలోకి యౌవన మెక్కించి జాతిని పరుగులెత్తిస్తున్నాడు. ఇటలీ మునుపు ఎట్లు లోకమును జయించి ప్రపంచసామ్రాజ్యమును స్థాపించినదో ఉపన్యసిస్తున్నాడు. మీరు సీజరుయొక్క సంతతివారు కాదా. అని ప్రశ్నిస్తే ఇటలీ యువకుల రక్తము ఉడికి పొంగిపోతుంది. ప్రాచీన హైందవ వైభవమును గూర్చి ఇట్టి ప్రశ్నలే మన యువకులకు వేస్తే చల్లనైన వీరి రక్తములో చలనం బుట్టదు. కృష్ణదేవరాయల సంతతివారు కారా అని ప్రశ్నిస్తే ఆయన తెలుగువాడా, బ్రాహ్మణుడా, కమ్మా, కాపా అని పాతరకపు యువకులు ప్రశ్నిస్తారు. ఇతర రాజ్యాలను జయించడం వారిని దాస్యాలలో ముంచడంగాదా? అవి స్తవనీయమా అని సోషలిస్టు వేదాంతు లడుగుతారు. కుల్లుకు పని సున్న. చలనం మన తత్వంలో లేదు. పడుకొనడానికి ఏదో ఒకసాకు.

మనదేశములో పైజాతులన్నీ బెండలిగిపోయినవి. వీటికి ఉత్తేజం గలుగుతుందని నాకునమ్మకంలేదు. దిగువ జాతులకు అవకాశమిచ్చి మనము వైదొలగితే మంచి దేమో. హరిజనులింకా బంజరు భూములు. అక్కడ నయినా కృషిజేసి విత్తనాలు చల్లితే కర్రలౌతవేమో!

నీవు ఎన్నో దేశాలు చూస్తూపోతున్నావుగదా? హిందూదేశమువలె పరాధీనతలో మునిగి సడుమువిరిగి పడిన గోవువలె తిరిగి లేవడమునకుకూడ శక్తిలేక తిరిగి లేచేప్రయత్నముగూడ వదులుకొని యింపులో దాస్యమును గుడుచుదేశము మఱియొక్కటి కనిపించినదా? దాస్యము ఇంపుగొలిపిన తరువాత వ్యభిచారమే వృత్తిగా పరిణమించి కులవృత్తికి సాటిలేదు గువ్వలు చెన్నా, అను వేశ్యలవలె విధేయతయే మా జాతికి సహజభూషణమని లబ్జులతో సురేంద్రనాథ బెనర్జీవంటి మహానాయకులుపన్యసించడములో చిత్రములేదు. బానిసను తన్నితే యజమానికి కాలు నొప్పి యెత్తినదేమోయని కాలు పిసుకునట్టి బానిసయొక్క మానసికస్థితివంటిదే వీరి మనఃప్రవృత్తిగూడాను.

ఇట్టి తలంపులు నామనసును చిక్షాకు పరుస్తవిరంగా. కొంతసేపు నాకు కలము సాగిందిగాదు. ఎందుకీ పనికిమాలిన విచారము. హిందువులకు విషయగ్రహణములో లోపము లేదు. దేవుడు కావలసినంత తెలివి బెట్టాడు. దాక్షిణ్యాబుద్ధిగూడా వున్నది. లోకము యొక్క ఇక్కట్టులను గూర్చి జాలిపడతాడు గూడాను. కాని మనోదండి లేదు. ఒక సత్కార్యమును నిర్వహించవలె నను సంకల్పమునకు వచ్చే అడ్డంకులకు వెఱువక ఎన్ని కష్టములు వచ్చినను సహించుచూ దీక్షతో కార్యమును కొనసాగించు మనోనిశ్చలత్వము తక్కువ. ఓపలేనమ్మకు వద్దనేది కన్నతల్లి. అడుగడుగుకు ధర్మసందేహాలు. అర్జును డిదేరకం. సాధారణ హిందువునియొక్క మానసప్రవృత్తికి అర్జునుడిదే తార్కాణము. వెంటబడి ముల్లుగఱ్ఱతో పొడుస్తుండాలె. లేకపోతే చచ్చు నాయనమ్మలు జారిపోతారు. జారిపోయే జాలిగుండెలకు కరు కెక్కించడానికి అన్నప్పుడల్లా శ్రీకృష్ణు డెక్కడ దొరుకుతాడు?

మనసుకు చికాకు కలిగినప్పుడు మరల్చకుండా మని ప్రయత్నిస్తాగాని అది సాగదు. మళ్లీ మామూలు ధోరణిలోకే దిగిపోతాను. కాని ఈసారి ఏదో పని నాకు దొరికింది. "క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వ ఉత్తిష్ఠ" అనే భగవానుడి కొరడాదెబ్బలు చికాకు దారినుండి మరల్చినవి.



ఈ "రామలేఖలు" వ్యాసకర్తలు ఆంధ్ర నాయకులలో సుప్రసిద్ధులు. పండువారిన వీరి సంస్కారము, వివిధవిషయ పరిజ్ఞానము, భావ గాంభీర్యము, అన్నిటిని మించిన వీరి వాదకౌశలము ఈ మొదటి లేఖలోనే ధ్వనిస్తున్నవి. ఈ లేఖలు పరంపరగా కొంతకాలం మా ఆంధ్ర వారపత్రికలో ప్రకటింపబడతవి.—సంపాదకుడు.



ఇప్పుడు నీవు కేవల విద్యార్థివిగా పోవడములేదు. హిందూదేశమును కలవరపరచుచున్న సమస్య లేవో నీకు దెలుసు. తూర్పు పడమటిదిక్కు లెప్పుడును కలవని మాట వాస్తవమే గాని ప్రాచ్యులు అప్రాచ్యులు అందరు మానవులన్న సంగతి మరచిపోవద్దు. ప్రాచ్యులు ఉచ్చదశలో నున్నప్పుడు- అప్రాచ్యుడనగా మూఢుడు- అనాగరకుడుగా భావింపబడి ఒక తిట్టుపదముగా ఎంచబడుచుండెను గాని కాలచక్రము కిందుమీదు చేసింది. ప్రాచ్యు లిప్పుడు అనాగరకులు లేక అర్ధనాగరకులుగా చూడబడుతున్నారు. ఘాతుకములయిన యుద్ధ ప్రకరములు నెక్కువగ జేయువారే ఉత్తము లిప్పుడు. ఈ విషయమున పాశ్చాత్యులను మించిపోయిన జపాను కున్న గౌరవము ఆసియా ఖండములో నితరులకు లేదు. విజ్ఞానసంపద సంపద గాదు. అర్థార్జనశక్తినిబట్టియే మానవునివిలువ లెక్కించబడుచున్నది. పాశ్చాత్యులు ప్రకృతిశాస్త్రజ్ఞానమును పెంపొందజేసి ప్రకృతియందలి జడపదార్థములను వానియం దంతర్లీనమైయున్న ప్రాణశక్తి సహాయమున ఎక్కువ ఉపయోగకారులుగ జేసికొనుచు మానవులకెక్కువ సౌకర్యములగూర్చుచున్నారుగాని సృష్టియొక్క యీ అన్నమయ ప్రాణమయకోశములకంటె ఎక్కువ సున్నితమును బలవత్తరమును నగు మనోమయకోశమును స్వాధీనపరచుకొనుటకు ప్రయత్నములు చేయడములేదు. ప్రాణమయకోశమునకు లోబడనూదు

మనోమయ విజ్ఞానమయ కోశముల వికాసముచే పొందదగిన ఆనందమును వారింకను గుర్తించుటలేదు. పాశ్చాత్యుల ఉద్యమములన్నింటికిని ఈ దోషమే కొట్టినది. దీనిని గుర్తింపకపోవుటచేతనే పాశ్చాత్యుల కిప్పుడు విజృంభించుచున్న సామ్యవాదము రసములేని పిప్పిగ గన్పట్టుచున్నది. కారల్ మార్క్సుయొక్క ఆర్థిక సిద్ధాంతములన్నియు విజ్ఞానసముద్రముయొక్క పైకెరటములమీద తేలియాడుతున్నవేగాని లోతుకు దిగలేదు. మీ గురువులగూర్చి తేలికగా మాట్లాడినానని నీకు కోపము వస్తుందేమోగాని వారి సిద్ధాంతములోని మేలును నేను గ్రహించక పోలేదు. కాని దీనినిగూర్చి మఱియొకపర్యాయము సావకాశంగా వ్రాస్తాను. నీవింగ్లండు చేరిన తరువాత అచ్చటివింతలు నాకు వ్రాస్తూవుండు. సిద్ధాంతము లుపదేశించి నిన్ను విసిగించుతానని అనుకోవద్దు. ముఖ్యముగా కాంగ్రెసు వారు మంత్రిపదవులను స్వీకరించి ఎట్లా వర్తిస్తున్నారో తెలుసుకోవడానికి నీవు ఆతురపడుతుంటావని నే నెరుగుదును. వాటిని గూర్చికూడ వ్రాస్తాను. ఇతరుల కింపైనా కాకపోయినా నాకు తోచిన విధముగానే వ్రాస్తాను. నీకు యిష్టపడాలనికూడ లెక్కజేయక విమర్శిస్తాను కాచుకో!

ఇటు

రామ.



# ఆంధ్రకేసరి

రాజాసాహెబ్



విగ్రహంచిన్నదు, గుండెకు గుండె నిచ్చేసాహసం, సముద్రంవంటి గాంభీర్యం, కష్టనిష్ఠురాలను గణించకుండా కార్యాన్ని సాధించేపట్టుదల, ముందువెనుక లెరుగని త్యాగం మొదలైన సద్గుణవిశేషాలవల్ల బారిస్టరు టంగుటూరి ప్రకాశంపంతులు ఆంధ్ర రాజకీయవేత్తలలో అగ్రగణ్యుడై ఆంధ్రకేసరి యను సార్థక నామమును బడసినాడు. వేలకువేల నార్జించే బారిస్టరుపదవికి ఏనాడు తిలోదకముల నిచ్చేడో ఆనాడు మొదలు మొన్నమొన్నటివరకు పరివ్రాజకునివలె తిన్నఊరిలో పడుకొనకుండా యావదాంధ్రదేశం, ప్రతి మారుమూల గ్రామంకూడా సంచారంచేసి రాజకీయ ప్రబోధమును గావించిన ప్రతిభాశాలి ప్రకాశం పంతులు.

బాల్యంలో అప్రయోజకులుగా త్రోసివేయబడినవారే మహాపురుషు లనుట లోకసామాన్యము. బాల్యమున తలిదండ్రులకు సైతము కంటకుడై అప్రయోజకుడుగా పరిగణింపబడి వదలితే చాలునని ఇండియాకు పంపబడిన రాబర్టుక్లైవు భారతదేశంలోని బ్రిటిష్ సామ్రాజ్యానికి ప్రథమనిర్మాతయై నేటిబ్రిటిష్ సామ్రాజ్యవేత్తలకు ఇలవేలు పైనాడు. ప్రకాశంపంతులు బాల్యమును అనంతరజీవితమును పోల్చి చూచునపుడు రాబర్టుక్లైవు జ్ఞప్తికి రాకమానదు. క్లైవువలెనే ప్రకాశంపంతులు చిన్ననాడు తలిదండ్రులకు గురువులకు అందని అల్లరిపిల్లకాయ. స్వశక్తివల్లా, ధైర్య సాహసాలవల్లా ఆంధ్రప్రపంచంలో మహా కీర్తివంతుడై ఆనాడు రాబర్టుక్లైవు ఈదేశానికి తగిలించిన సామ్రాజ్య శృంఖలాలను ఛేదించడానికి పోరాడుతున్న జాతీయ వీరులలో ముఖ్యుడైనాడు. సుమారు 65 సంవత్సరముల వయస్సువచ్చినా కష్ట సుఖములను గణింపక, నిత్య యౌవనముతో జాతీయ స్వాతంత్ర్యంకోసం పోరాడుతున్న వృద్ధయువకుడు ప్రకాశం.

అతి సామాన్యమైన కుటుంబమున జన్మించి దేశముగాని దేశములో కేవలం స్వశక్తిచేత ధనమునూ కీర్తిని సంపాదించి, మళ్లీ దేశం కోసమే ఆధనాన్ని చేతులార ధారపోసి, ఒకవంక పరప్రభుత్వంతోటి, వేరొకవంక కష్టములతోటే నిత్యం పోరాటం సల్పుతూ వస్తున్న ప్రకాశంపంతులు జీవితచరిత్ర వ్రాయాలంటే చిన్న వ్యాసంలో ముగించడం దుస్తరం. వాస్తవానికి స్వీయచరిత్ర వ్రాయవలసిన జీవితవిశేషం గలవారు ప్రకాశంపంతులు. ఆగర్భ శ్రీమంతుల ఇండ్లల్లో జన్మించి, బంధుమిత్రుల ప్రాపుచే కీర్తివిశేషాలను గడించి, సుఖజీవితం గడుపుతూ ప్రజాహిత జీవితం సాగించడంలో విశేషమేమీలేదు. కాని ప్రకాశంవలె పుట్టినప్పటినుండీ ప్రతికూలశక్తులతో పోరాడుతూ, ఒక మహాదాదర్శం కోసం సుఖదుఃఖాలను పరిసమానముగా ఎంచి, నిరంతరము కత్తుల మీద, నిప్పులమీద గారడీ వానివలె నడుస్తూ ప్రజాహితజీవితం గడుపగలిగిన సమర్థులెందరోలేరు. అందుచేతనే ఆయన జీవితచరిత్ర,— అందులోను ఆయనకు వ్రాసే తీరికే ఉంటే స్వీయచరిత్ర,— లోకాని కెంతో ప్రయోజనకారిగా ఉంటుంది. అయితే ఆయనకే తీరిక ఎప్పుడైనా లభిస్తుందా అన్నదే సంశయం.

## బాల్యము: నాట్యకళాభిరుచి

ప్రకాశం గుంటూరు జిల్లా ఒంగోలు తాలూకాలోని వల్లూరు గ్రామంలో మిక్కిలి సామాన్యమైన నియోగిబ్రాహ్మణవంశంలో 1873 సంవత్సరం ప్రాంతంలో జన్మించాడు. ఈయన జననం తేదీ విషయమై సుమారుగా వ్రాయవలసిందే. ఈమధ్య నెవ్వరో వ్రాసినట్లు ఆయన వయస్సు ఆయనకే తెలియడం కష్టం. కాని ఆయన సమకాలికుల అంచనా ప్రకారం ప్రస్తుతం ఆయనవయస్సు సుమారు 65. చిన్ననాడే ఆయన తండ్రి స్వర్గస్థుడగుటచే ఒంగోలులో తల్లి విశేషమైన శ్రమకోర్చి ప్రకాశం ఆయన సోదరులకు చదువుచెప్పించుచుండెను. ఒంగోలులో ఆయన చదువుకొనే రోజులలో సామినేని హనుమంతరావునాయుడు గారక్కడ ఉపాధ్యాయులుగా ఉండేవారు. హనుమంతరావునాయుడుగారికి నాటకాలంటే చాలా ఇష్టం. నాటకంలో స్త్రీ పాత్రధారణకు ప్రకాశం మంచి చలాకీగా కనుపించడంచేత నాయుడుగా రాయనను అభిమానించినాడు. క్రమంగా నాట్యకళయందు ప్రకాశమునకు అభిరుచిని సామర్థ్యమును కూడ కలిగించినాడు. తరువాత 1887 సంవత్సరం ప్రాంతములో ప్రకాశంపంతులు 14 సంవత్సరముల వయస్సువాడై యుండగా హనుమంతరావునాయుడుగారికి రాజమహేంద్రవరం ఉద్యోగం బదలీ అయినది. నాయుడుగారు తనతోపాటు ప్రకాశమును కూడ రాజమహేంద్రవరమునకు తీసుకొని వచ్చాడు. రాజమహేంద్రవరంలో బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు నాటకాలు వ్రాయడం (కేవలం గద్యనాటకాలు) హనుమంతరావుగారు స్టేజిడైరెక్టరుగా ఉండి నాటకాలు ఆడించడం ప్రకాశం పంతులు ప్రధాన స్త్రీ పాత్ర ధరించడం జరుగుతూ ఉండేది. ప్రకాశం ప్రజలను తన నటనానైపుణ్యంచేత రంజింపచేసినకొద్దీ నాయుడుగారి అభిమానానికి పాత్రుడైనాడు. వారు తన బిడ్డలకన్న ఎక్కువగా ప్రకాశము నాదరించిచిన్ననాడువిద్యాబుద్ధులుచెప్పించినాడు.

## విద్యార్థి దశ

చదువులో ప్రకాశం పంతులు మరీచిను రసగా ఉండేవాడు. కాని ఆతని స్వతంత్ర పోకడలు మాత్రం అధ్యాపకులకు అంతగా నచ్చించేవికావట. 1889 సం॥రంలో మెట్రిక్యులేషన్ పరీక్షయం దుత్తీర్ణుడై 1890-91 సం॥రములు రాజమండ్రి ఆర్ట్సుకళాశాల యందు యఫ్. ఎ. పరీక్షకు చదివెను.

సర్ కె. వి. రెడ్డి, కీ. శే. పేరి నారాయణమూర్తి, తంజావూరు రఘునాథరావుగార్లు ఆయన సమకాలికులు.

## ప్లీడరీ

1892 సంవత్సరమున ఫస్టు గ్రేడుపరీక్ష ప్రైవేటుగా చదివెనుకాని వయస్సు చాల నందున పరీక్షకు కూర్చుండలేదు. 1893 సం॥రమున మద్రాసు లాకాలేజీలో ఫస్టుగ్రేడు పరీక్ష చదివి ఉత్తీర్ణుడైనాడు. 1895 సం॥లో బి. ఎ కుకూడ ప్రైవేటుగా చదివి ఒకభాగము ప్యాసయినాడు. 1894 మొదలు 1904 వరకు సుమారు 10 సంవత్సరములు రాజమహేంద్రవరములోనే వకీలుగా ప్రాక్టీసుచేసెను. చివరరోజులలో ప్రస్తుతం జిల్లాజడ్జీ చేసి రిటైరైన పిళ్లారిసెట్టి నారాయణరావు నాయుడు గారును ప్రకాశము గారున్నూ జాయింటుప్రాక్టీసు చేసిరి. ఆరోజులలో కూడ ప్రకాశం స్వతంత్రపు పోకడలు ఈనాటికిని రాజమహేంద్రవరములో కథలుగా చెప్పుకొనబడు చున్నవి. అప్పుడు లంచగొండియగు జిల్లా మునసబు ఒకాయ నుండెడివాడట; ప్రకాశం ఆయనను బహిష్కరించి ఆయన కోర్టులోనికి ప్లీడర్లెవ్వరూ వెళ్లకుండ ఒక ఉద్యమమును లేవదీసెను. ఆఉద్యమమునకు క్రమముగా చాలమంది తోడ్పడిరి. ఆమునసబుపై చర్య తీసుకొనుటకు తగిన సంజాయిషీనికూడ ప్రకాశం తయారుచేసెనట కాని ఆనాటి కొందరి ప్రముఖుల ఆటంకముచే అది జరుగలేదు.

## మ్యునిసిపల్ గడబిడలు

ఆరోజులలోనే ప్రకాశం రాజకీయములందు పాల్గొన నారంభించాడు. రాజమహేంద్రవరం మ్యునిసిపాలిటీ ఎన్నికలలో పాల్గొన్నాడు. చిరకాలంనుంచి వేళ్లుపాతుకున్న ప్రముఖులగు కౌన్సిలర్లను ఓడించి మ్యునిసిపల్ కౌన్సిలరైనాడు. ఆనాటిమ్యునిసిపల్ పెద్దలు, పార్టీదారులు నిడమర్తి సూర్యయ్య, మోచర్ల రామచంద్రరావు, నేతిసోమయాజులు, న్యాయపతి సుబ్బారావు పంతులుగార్లు వగైరాలు. అప్పటికే బాగా పలుకుబడిని సంపాదించిన ఈ పెద్దలనందరినీ ధిక్కరించే ప్రకాశం మ్యునిసిపల్ కౌన్సిలులో ప్రవేశించినాడు. తర్వాత 1903 సంవత్సరంలో ఆసంఘానికి చేర్మెన్ అయినాడు. ఆయన చేర్మెన్ ఎన్నిక గెజెటు కాకుండకూడ ఆనాటి కొందరు పార్టీదారులు ప్రయత్నించి విఫలులైనారట. ఇటీవల ప్రకాశంపంతులు సమకాలికులైన ఒకరితో మాట్లాడుతుండగా ఆయనఇట్లు చెప్పినాడు. "మొత్తంమీద ప్రకాశమునకు అనవసరముగా చాలామంది శత్రువులైనారు. లోపలొకటి ఉంచుకుని పైకి తియ్యగా మాట్లాడడమనేది ఆయనెరుగడు. ఎంతవాడినైనా మొగంమీద కుండ బ్రద్దలుకొట్టేటట్లు చెప్పేవాడు. అందుచేతనే అతనికి శత్రువు లెక్కువైనారు. మ్యునిసిపాలిటీవల్ల కొందరాయనకు శత్రువులైనారు. నోటి దురుసుతనముచే మరికొందరైనారు. ఆనాటి మెత్తదనము లేకపోవడంచేతనే ఆఖరికి వీరేశలింగంగారికి కూడా కష్టంగా ఉండేది. ఒకసారి నాటకమాడుకోడానికి టౌనుహాలిమ్మని అడిగేడు ప్రకాశం. పంతులు ఏదో సాకు చెప్పేసరికి ప్రకాశం దురుసుగా మాట్లాడేడు. "ఏమి కొంపతాపా ఏమిటి?" అన్నారు వీరేశలింగంపంతులు. గురువుగారనే సంకోచమేమీ లేకుండా "అందుకైతే ఇక్కడిదాకా రావలెనా?"అన్నాడు ప్రకాశం. మొత్తంమీద ఇల్లాంటి స్వల్పమైన మాట పట్టింపులతోటే ఆయనకు పెద్దలు ప్రతికూలురైనారు. ఆపెద్దలలో కొందరు ప్రకాశంపై లేనిపోని నిందలుకూడా మోపి చిక్కులు పెట్టడానికి ప్రయత్నించారు. కాని అన్నింటిలో ప్రకాశమే జయము పొందినాడు."

ఆనాటి ప్రకాశమందలి ధిక్కారలక్షణము, స్వాతంత్ర్యపోకడలు, పట్టువలె నేటికిని ఆయనలో ప్రస్ఫుటంగా ఉండడమే కాకుండా ఆయన జయమునకు కారణములవుతున్నాయి. పైలక్షణాలతోపాటు మంచి పిండపుష్టి, జబ్బపుష్టి కూడా ఉండడంచేత ప్రతికూలపక్షమువారికి మాత్రము ప్రకాశం భయంకరుడుగానే ఉండేవాడు. కార్యసాధనకవసరమైన పట్లు చెయిచేసుకోవడం కూడా కలదు కనుక ఆ కాలంలో ప్రకాశాన్ని చూస్తే సమకాలికులు 'రౌడీ'గా భయపడుతూ ఉండడంలో ఆశ్చర్యమేమీలేదు. ఈ విషయమైన కథలనేకములు కలవు, కాని అవి ప్రస్తుత మనవసరము. సుమారు 10 సంవత్సరముల క్రిందట ఇప్పుడు కీర్తిశేషుడైన ఒక ప్రసిద్ధ రాజకీయవేత్త ప్రకాశమును గూర్చి చులకనగా 'రౌడీ' యనేమాట నుపయోగించినప్పుడు ప్రకాశం పంతులు ఆగ్రహం చెందక "ఆనాటి ప్రకాశమే అయితే ఆయన ఇల్లామాట్లాడనే మాట్లాడడు అంతేకాదు ఆరౌడీ సహాయముతోనే తాను ఉన్నతపదవి నధిష్ఠించిన సంగతి మరచిపోయినాడా?" అన్నాడు.

## బారిష్టరీ

1904 సంవత్సరంలో కీ. శే. కంచుమర్తి రామచంద్రరావు, మాగంటి సీతయ్య, లక్ష్మణదాసు మున్నగు మిత్రుల సహాయముతో బారిష్టరు పరీక్షకై ఇంగ్లాండుపోయెను. ఈ సందర్భంలో కూడ రాజమహేంద్రవరంలో ఒకకథ ప్రచారంలో ఉంది. ఏదో సందర్భంలో ఒక పెద్దవకీలు ఆయన డిగ్రీనిగురించి కొంచెం చులకనగా మాట్లాడినాడనియు, ఆ వేళన కొంతవరకు ఆయన బారిష్టరీకి కారణమైనదనీ కర్ణాకర్ణిగా చెప్తారు. ఏమైనా చేతిలో విశేషం డబ్బులేకుండా పోయినా మిత్రుల అండ చూచుకుని బారిష్టరు పట్టము పూర్తిచేసినాడు. ఆనాటి స్థితిగతులలో అది మహా సాహసమైన సంగతి. లక్షల పెట్టుబడిగలవాళ్లు దినపత్రికను నిర్వహించడానికి జంకేరోజుల్లో, చేతిలో వెయ్యి రూపాయిలైనా లేకుండాకూడా దినపత్రికను పెట్టే అపూర్వ సాహసానికిదే పునాది. ఈ విషయాన్ని తలుచుకుంటేనే 'గుడిని మింగే వాడికి గుడిలోని లింగమెంత' అనేసామెత జ్ఞాపకానికొస్తోంది. బారిష్టరు చదువడానికి వెళ్లేటప్పుడు ఆయన రాజమహేంద్రవరం మ్యునిసిపల్ చెయిర్‌మెను. ఇంగ్లండునుంచి తంతిమూలకముగా తన చెయిర్‌మెన్ పదవికి రాజీనామా ఇచ్చేడు.

## రాజకీయము

ప్రకాశం రాజమండ్రిలో ప్రాక్టీసుచేసే రోజులలో అప్పుడే కాంగ్రెస్ తప్పటడుగు లేసుకుంటూ ముందుకు సాగుతోంది. ఆ మహాసంస్థ ప్రకాశమును కూడ ఆకర్షించినది. కాని ఇంగ్లాండునుంచి తిరిగి వచ్చినతర్వాతనే రాజకీయములందు ఎక్కువ పాల్గొనుటకు ప్రారంభించినాడు.

## సనాతనులతో పేచీ

ఇంగ్లాండు నుంచి తిరిగి వచ్చినవెంటనే రాజమహేంద్రవరములో ఆయన సనాతనులతో పోరాడవలసివచ్చెను. ఆరోజుల్లో

సముద్రప్రయాణము చేసినవారిపై తీవ్రమైన ఆంక్షయుండేది. అప్పటి శంకరస్వాములవారీయనపై ఒక ఆంక్షను ప్రకటించడం, ఆ ఆంక్షనుబుట్టదాఖలు చేయడం జరిగింది. సాంఘిక విషయాల్లో ప్రకాశం చాల ముందడుగువేసితరువాత వారికి మార్గదర్శకుడైనాడు.

పుష్కలముగా ధనార్జన చేయడమే కాకుండా బారులోని హేమాహేమీలలో నొకడయ్యెను. న్యాయశాస్త్ర విధానానికి సంబంధించినంతవరకు ప్రకాశం ఈ రాష్ట్రమున ఎన్నియో క్రొత్తపోకడలకు మార్గదర్శి. మద్రాసు బారునకు కొంతకాల మధ్యక్షుడు.



బారిష్టరు ప్రకాశం

సాంప్రదాయ సిద్ధమైన సాంఘిక సంకెళ్లను తెంచినవారిలో ముఖ్యుడు ప్రకాశంపంతులు.

**బారిష్టరు ప్రకాశం**

ఇంగ్లండునుంచి తిరిగి వచ్చినతర్వాత ఆరోజుల్లో దేశస్థులైన బారిష్టర్లు సకృత్తుగా ఉండడంచేత ప్రకాశం మద్రాసు హైకోర్టులోనే **1907** సం॥ లో ప్రాక్టీసు ప్రారంభించెను. ప్రాక్టీసు ప్రారంభించిన కొద్దిరోజులకేలా జర్నలునకు ప్రధానసంపాదకుడు. ఆ సంపాదకత్వమువహించి జడ్జీలనుసైతము నిర్భయముగా విమర్శించేవాడు. ప్రస్తుతం హైకోర్టు జడ్జీలుగా ఉన్నవారిలో కొందరు అయనవద్ద జూనియరులు. సమకాలికులు. అయనవద్ద పనినేర్చుకొనినవారెందరో ఇప్పుడు ఉన్నత పదవులలోనూ, పేరుమోసిన లాయర్లుగనూ ఉన్నారు. మద్రాసు బారులో ప్రకాశం వేలాదిగ సంపాదించిన ధనార్జనాపరుడుగానే కాక జడ్జీలను లెక్కచేయని స్వతంత్రుడుగా కూడా పేరుపొందినాడు. ఒక ప్రసిద్ధుడైన లాయరు "ఇటీవల మద్రాసు బారులో స్వతంత్రముగా ప్రాక్టీసు చేసిన ప్రముఖులలో ప్రకాశం, యస్. శ్రీనివాసయ్యంగార్లు మాత్రమే" అని చెప్పినాడు. బెంచిమీద నిద్రపోయే జడ్జీలకు, విషయ మర్థము చేసుకొనకుండా లాయర్లను తికమకపెట్టే జడ్జీలకు లాయరు చెప్పేదానిని వినే ఓపికచాలని జడ్జీలకు ప్రకాశం కొరడావలె ఉండేవాడు. బారిష్టరుగా ప్రాక్టీసుచేసిన సుమారు **14** సంవత్సరములలో రాజధానిలోని పెద్దపెద్ద సివిలు క్రిమినలు కేసులనెన్నిటినో జయప్రదముగ వడిషి పుష్కలంగా ధనాన్ని, కీర్తిని సముపార్జించినాడు. ప్రాక్టీసు మానేసరికి ఆయన ఆస్తి సుమారు 5 లక్షలవరకూ అంచనా వేయవచ్చును. ప్రాక్టీసుచేసే రోజులలో మాత్రం డబ్బుపుచ్చుకొనే టప్పుడు నిర్మొగమాటంగా పుష్కలంగా పుచ్చుకొనేవాడట. ఆడబ్బు ఏదైనా వినియోగపరుపవలసినప్పుడు కూడా ఆలాగే చేతికి ఎముకలేకుండా ఖర్చుచేసేవాడట. ఇటీవల నేను ఆయనతో సంచారము చేస్తుఉండగా ఆయనను మహదైశ్వర్యములో ఉండగా చూచిన పాతక్లయింటు ఒకాయన వచ్చి అయ్యోపంతులుగారి ఆస్తిఎంత పెద్దది! ఏమాశీవి! ఆరోజులేమి? మాట్లాడడానికి మాబోట్లకు తావాతుండేదా? అల్లాంటివా రెల్లా అయిపోయినారు? అంటూ విచారిస్తుంటే ప్రకాశంఆపెద్దమనిషిని మందలించి "నాఆస్తిపోయిందని నీవేందయ్యా అల్లా విచారిస్తావు. నా ఆస్తి అంటే ఎక్కడిది? ఈజనందగ్గరే బాగాగుంజి సంపాదించాను. మళ్లీ ఆజనానికే అది దఖలుపడిపోయింది" అన్నాడు.

ప్రకాశంప్రాక్టీసు విరమించడానికిముందు నిర్వహించిన పెద్దకేసులలో రాజమహేంద్రవరం కర్రెన్సీ నోట్లకేసు ముఖ్యమైనది. ఆ కేసు సందర్భంలో ఆయన చాలాకాలం రాజమండ్రిలో మకాంగా ఉండేవారు. నల్లటిసూటు, దానిమీద ఒక బొచ్చుటోపీపెట్టుకొని కోర్టుకువస్తే భయంకరంగా ఉండేది. ఆకేసులోనే బులుసు సాంబమూర్తిగారు సిల్కు సూట్లల్లో విహరించే రోజుల్లో ఆయనకు జూనియర్‌గా ఉండేవారు. అప్పటి జోస్తీయే ఇప్పటికీ అవిచ్ఛిన్నంగా నడుస్తోంది.

### కాంగ్రెస్ రాజకీయాలు

బారిష్టరీ చేసేనాటి జిల్లా కాంగ్రెస్ జాతీయవాదము ప్రకాశంపంతులు నాకర్షించినది. సూరత్ కాంగ్రెస్ సభలో ఆయన కూడ ఉన్నట్లే ఒకసారి చెప్పినాడు. ఆంధ్రోద్యమమందు కూడ అభిమానముతో పాల్గొనినాడు. 1919 సం॥లో మహానందిలో జరిగిన ఆంధ్రరాష్ట్రీయ మహాసభకు ప్రకాశం అధ్యక్షుడు. ఆ మహాసభయందే మాంటేగ్యూ సంస్కరణలను గురించి తీవ్రమైన వాదోపవాదాలు చెలరేగినవి. ముందురానున్న సహాయ నిరాకరణ తుపానుకు ఎన్నియో సూచన లగుపడినవి. ఆరోజుల్లోనే ప్రకాశం రాజమహేంద్రవరంలో కే. శే. గజవల్లి రామచంద్రరావుగారి అధ్యక్షతక్రింద టౌనుహాలులో జరిగిన బహిరంగ సభలో మాంటుఫర్డు సంస్కరణలను గురించి ఉపన్యసించాడు. ఆ ఉపన్యాసమునకు టౌనుహాలులో జనం కిటకిటలాడిపోయినారు. మొదటి 15 నిముషములవరకు ప్రకాశం నోట నుండి నిముషమున కొకమాట చొప్పున వెలువడింది. ఉపన్యాసవైఖరులను విమర్శిస్తూ ఉండే విద్యార్థులకు 'ఏమిరా ఇది' అనిపించింది. కాని కాస్సేపయేసరికి, ఘాటంకుకున్నాక ప్రకాశమంటుఫర్డు చట్టమును చక్కగా విమర్శచేసి సభ్యులహర్షానికి పాత్రుడైనాడు. నేటికిని ఉపన్యాస సందర్భంలో ఆయునపద్ధతం తే. మొట్టమొదట కె. యమ్. పాణిక్కరు వ్రాసినట్లు "His pauses are more significant than his speeches" ఆయన ఉపన్యాసముకన్న భావగర్భితమైన మౌనమే గొప్పగా ఉంటుంది.

### గాంధిజి సత్యాగ్రహ ప్రతిజ్ఞ

భారతరాజకీయములలో చరిత్రాత్మకమైన కాంగ్రెస్ అమృతసరం కాంగ్రెస్. పంజాబు వీరులరక్తముతో తడిసి పునీతమైన అమృతసరమందు, మాంటుఫర్డు సంస్కరణలనుగూర్చి నిశ్చితాభిప్రాయాన్ని తెలుపడానికి మోతీలాలు పండితుని అధ్యక్షతక్రింద 1919 సం॥ డిశెంబరు నెలలోసమావేశమైనది. లోకమాన్యుడు, అప్పుడే జైలునుండి విడుదలైన ఆలీ సోదరులు సభ నలంకరించిరి. మాంటుఫర్డు సంస్కరణములు నిరాకరింపబడవలెననేతీర్మానం చర్చకువచ్చినపుడు ప్రకాశం, దేశబంధుదాసుగారి సవరణకు అనుకూలుడు. అప్పటికే మద్రాసు రాజధాని రాజకీయము లందు ప్రకాశం పేరు ప్రాముఖ్యమును దాల్చినది. అప్పట్లో గాంధీజీ సత్యాగ్రహ ప్రతిజ్ఞను దస్కతుచేసిన వారిలో ముఖ్యులు ప్రకాశం, రాజగోపాలాచార్యులు గార్లు మాత్రమే.

### సహాయనిరాకరణం

1920 సం॥ సెప్టెంబరు నెలలో కలకత్తా స్పెషల్ కాంగ్రెసులో సహాయ నిరాకరణ తీర్మానం అమోదింపబడింది. శాసనసభా బహిష్కార కార్యక్రమానికి దాసు ప్రభృతులు వ్యతిరేకులు. ప్రకాశంపంతులుకూడ వ్యతిరేకుడే. కొండా వెంకటప్పయ్యగారు కూడా వ్యతిరేకులే. బహుశా ఒక్క పట్టాభిగారే ఆంధ్రనాయకులలో కల్లా అనుకూలురనుకుంటాను. బహిష్కార కార్యక్రమం అమోదింపబడిన తర్వాత దేశమంతటా ఓట్ల బహిష్కార ప్రచారమమోఘంగా జరిగిపోయినది. పిమ్మట నాగపురమందు కావలసినంతరాద్ధాంతసిద్ధాంతము జరిగిన పిమ్మట సహాయనిరాకరణ మామోదింపబడినది. సహాయనిరాకరణ కార్యక్రమమందు కోర్టుబహిష్కారము మొదట ప్రాముఖ్యతను దాల్చినది. మద్రాసు బారునుండి ప్రాక్టీసు మానివేసినవారిలో ప్రథముడు ప్రకాశం పంతులు. అదొక మహాప్రవాహం. బెంగాలులో దేశబంధుడు 60 వేల రూపాయల ప్రాక్టీసును వదలినాడు. మోతీలాలు కూడ వృత్తికట్లే తిలోదకాలిచ్చాడు. మద్రాసులో బారిష్టరు ప్రకాశం వృత్తిని విసర్జించినపుడు యావదాంధ్రరాష్ట్రం ఉప్పొంగి ఆయనత్యాగానికి స్వాగతమిచ్చింది.

ప్రకాశంపంతులు వృత్తిని విసర్జించిన తర్వాత మలబారు మోప్లాతిరుగుబాటు అనంతరం ఒట్టపాలెంలో కేరళరాష్ట్రీయ మహాసభాధ్యక్షత వహించాడు. ఆ సభలో అధ్యక్షోపన్యాసమునందు అప్పట్లో అక్కడజిల్లాపోలీసు సూపరెంటుగానుండిన 'హాచ్ కాక్' దారుణాలను ప్రకాశం విమర్శించాడు. ఆ ఉపన్యాసం హిందూపత్రిక ప్రకటించింది. దానితో ఆ 'హాచ్ కాక్' చాలా పెద్దమొత్తానికే ఈయనపైనా, హిందూసంపాదకుడైన కస్తూరి రంగయ్యంగారిపైనా, ఇంకా మరొకరిపైన పరువునష్టము దావా తెచ్చాడు. దావా డిక్రీయైనది. ఆ మలబారు తిరుగుబాటు రోజుల్లో పోలీసుల జబర్దస్తీ నెదుర్కొనవలసిన అక్కడి కాంగ్రెస్ నాయకులకు ప్రకాశం అనేకవిధముల తోడ్పడి వారికృతజ్ఞతకు పాత్రుడైనాడు.

1921 సం॥ [illegible] వాడలో జరిగిన [illegible] కీయ మహాసభ కధ్యక్షత [illegible] శంఆ సభయందే మొట్టమొదట [illegible] మూర్తిగారి ఆధిపత్యమున సంపూర్ణ స్వాతంత్ర్యమే భారతదేశముయొక్క ఆదర్శమనే తీర్మానం ఆమోదింప బడింది.

### 'స్వరాజ్య' పత్రిక

తెలుగువాళ్ళకొక ఇంగ్లీషు దినపత్రికుండాలనే కోరిక తెలుగు నాయకుల కందరకూ ఉండేది. న్యాపతి సుబ్బారావు పంతులు, బయ్యా నరసింహేశ్వరశర్మ, మోచర్ల రామచంద్రరావు పంతులు వగైరా లెందరో ఆంగ్ల దిన పత్రికకోసం అంచనా వేస్తూవుండడం, మీనమేషాలు లెక్కించడం, చివరకి భయంచేత విరమిస్తూ ఉండడం జరుగుతూవచ్చింది. అటువంటి సాహసానికి పూనుకొని గలిగిన చొరవ ప్రకాశంపంతులుకే చెల్లింది. పూనుకోవడ మేమిటి, నెరవేర్చడ మేమిటి? 1921 సం॥ నవంబరు నెలలో కాబోలు స్వరాజ్యపత్రిక వెలువడింది. స్వరాజ్యకంపెనీకితనసర్వంత సొమ్ము రొక్కముగా పెట్టుబడి పెట్టటమే కాకుండా దేశంలో వేలకు వేలు షేర్లు పోగుచేసి పత్రికను మంచిసమయంలో స్థాపించ గలిగేడు. నేడు భారతదేశములోని సుప్రసిద్ధులైన పత్రికారచయిత లెందరో 'స్వరాజ్య'యందు ఓనమాలు దిద్దినారు. మొట్టమొదట స్వరాజ్యసంపాదకవర్గముఅద్భుతమైన జట్టు. ప్రకాశం ప్రధానసంపాదకుడు. కృపానిధి, రామకోటేశ్వరరావు, యస్. యస్. వరదాచారి చెరుకుపల్లి వెంకటప్పయ్య, కె. శ్రీనివాసన్ మొదలైన వారంతా సహాయసంపాదకులు. కాస సుబ్బారావు తరువాత ఆయుతాలో చేరినాడు. పత్రిక స్థాపింపబడిన కొద్దిరోజులకే దేశంలో నిర్బంధవిధానం తీవ్రంగా చెలరేగడం, దేశంలో అపరిమితమైన ఉత్సాహం ప్రబలడం జరిగింది. ఆ వాతావరణంలో 'స్వరాజ్య' పత్రిక అపారంగా ప్రచారమైంది. ఒకప్పుడు 10,12 వేల వరకు ఎక్కిపోయింది. దేశంలోని అరెస్టులను గూర్చి అప్పట్లో 'స్వరాజ్య' ప్రకటించే Toll of honour కోసం ఎదురుచూడనివాడు లేడు. దేశంలో జరిగే నిర్బంధ విధానాన్ని నిర్భయంగా ప్రకటింపగలిగిన పత్రిక అదొక్కటే. స్వరాజ్య పత్రిక సేవనుగురించి వేరే వ్రాయనక్కరలేదు.

(66-వ పేజి చూడుడు)

# విద్యాపరిశీలనము

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి



వివిధ విద్యాశాఖలకు సంబంధించిన సమస్యలు నేడనేకుల కన్నుల నాకర్షించుచున్నవి. విద్యాశాఖతో నిండుజోక్యము గల మంత్రి తక్క తక్కుంగల మంత్రులు వీనినిగుఱించి బహుళ సభాంగణములనుండి గంభీరోపన్యాసము లొనగిరి. విశేషముగ నేడక్కరైనది ప్రాథమికవిద్య యని, మొదటి మూడు ఫారములలోను హిందీ నిర్బంధపఠనీయాంశమై యుండవలెనని వీ రేకగ్రీవముగ వాకొనిరి. ఉన్నతవిద్యకంటె ప్రాథమికవిద్యయే నేడు విశేషాదరము నందునని నిన్నగాక మొన్న డాక్టర్ సుబ్బరాయన్ గారు ఎసెంబ్లీలో పలికిరి. ఒకప్పుడు ప్రఫుల్ల చంద్రరాయ లొనరించిన యాలాపనమునందుకొని, విశ్వవిద్యాలయములకు సీళ్లువేయవలెనని కొందఱు గీతిక పాడుచున్నారు. ఇంకను మఱికొందఱు "ఈ 'గొలాంఖానా' లను పెల్లగించి బలిచక్రవర్తి తలపై దొరలింపవలె"నని కనులెఱ్ఱజేయుచున్నారు. ఈ యీ యంశముల నించుక పరిశీలించుట పాడికాదా ?

## ఆంగ్లభాషా సంస్థాపనము

పరిస్థితుల నింతకుదెచ్చిన కారణము లీనాటివికావు. గతశతాబ్దియే వీనిని కనినది. కొంత Midwifery కి చేయిజేసికొనినవాడు మహామేధావి సెక్కాలే మహాశయుడు. భారతావనిలో నాంగ్లసంస్థాపనమై ముహూర్తమందే భారతీయుల హృదయము లందు నాంగ్లభాషాసంస్థాపనము జరిగితీరవలెనని గ్రహించిన గడసరు లాంగ్లేయులు. దానికి పునాదివేసినవారు వణిజులు; దీనికి పునాదివేసినవారు మిషనరీలు. వణిజుల దృష్టిలోనిది ఇహసాధనమని, మిషనరీల దృష్టిలోనిది పరసాధనమని చప్పున గ్రహించి భారతీయులు జయజయలతో వారికిని వీరికిని స్వాగతమనిరి.

Messiahకు ముందు John the Baptist పొడసూపవలెనని ఎరిగిన మనీషులు మిషనరీలు. క్రైస్తవమతమునకు మున్ను ఆంగ్లమావిర్భవించి తీరవలెనని యెఱిగి ఆంగ్లభాషా ప్రచారమునకై వీరు కడంగిరి. క్రొత్తదానిలో వింతయుండునుగదా! తొలుత మనసు నాకర్షించునది అదియేకదా! మిషనరీల మాటలకై చెవిగోసికొని, ఎందఱెందఱో వారి వెంటబడిరి. ఆ దినములలో వంగసీమయందు హిందువులచే నేర్పడిన సంస్కృతసంస్థలను, మహమ్మదీయులచే నెలకొనబడిన అరబ్బుపర్షియన్ సంస్థలును ఉండెడివి. దిగ్వలయమున మిషనరీలు తేజరిల్లినంతన జేజేలు పాడుచు వారివెంట పలువురు పర్వెత్తిరి. పైన దెలుపబడినసంస్థ లించుమించుగ ఖాళీయైనవి. సంస్కృతవిద్యార్థుల నాకర్షించుటకై కొన్ని Stipends చూపబడెనట! కాని విద్యార్థులైకకంఠ్యమున "ససేమిరా" యనిరట!

ఆతురపాటున పెద్ద లీదృశ్యమును విలోకించిరి. సామ్ము నష్టమగుచుండెను. కొందఱి యుదారాశయములకు భంగము గలుగుచుండెను. నూ అన్నడు, వేయిచెప్పడు; సంస్కృతాది భారతభాషలనుండి ప్రజల దృష్టిని మఱలింపవలెననెడి ఎత్తు ఢంకాపై దెబ్బకొట్టినది! పరిస్థితులు రామమోహనరాయ్ ప్రభృతుల మనసులను చివుక్కుమనిపించినవి. విద్యాసంస్థలం దాంగ్లప్రబోధము నజరుగవలెనని విలియమ్ బెంటింగ్ ప్రభువు ప్రకటన మహాజరు నంపెను. ప్రతీచీఖండము నుండి భౌతికపరిజ్ఞాన మాంగ్లముగుండా భారతీయుల మనసులందు ప్రవేశింపవలెనని మత దుద్దేశించెను. డేవిడ్ హేర్ మున్నగువారీతని యుద్దేశమును బలపఱిచిరి. మనభాషలను, మన విజ్ఞానమును వెక్కిరించి వంగవాసులను తీవ్ర విమర్శనమునకు గుఱిగావించిన మెకాలే మహాశయుడు చక్కని Minute ను తయారొనర్చించి బెంటింగ్ ప్రభువునకు ప్రసాదించినాడు. Anglicans విజయధ్వజ మెత్తిరి. దిగ్భ్రాంతితో Orientalists ఎనక్కు తరలిరి.

## మెకాలే జోస్యము

ఈ విద్యావ్యవస్థకతనభారత జాతీయత్వమునకు భంగము గలిగెనని తలచువారు కొందఱున్నారు. దీనివలన పాశ్చాత్య దృష్టాంతములను హృదయంగమ మొనరించుకొని జాతీయత్వ మననేమో భారతీయులు తెలుసు [illegible] రని వచించువారు కొందఱున్నారు. ఇందు వలన మనకు బానిసలు సంభవించెనని కూడ [illegible] తను. ప్రతీచీ హృదయ కవాటములు తెరువ గలిగితిమి. ఆధునిక [illegible] కనుగొంటిమి. [illegible] స్త్రీయ [illegible] [illegible] కాదా! [illegible], అమృ [illegible], అమృతమైన యమృతకు [illegible] [illegible] విజ్ఞానాంగణమున [illegible] ప్రాచీ నాగరికతవిూది విశ్వాసమును [illegible]

ప్రతీచీ సభ్యతనే ఇలుకేలుపు గావించుకొని, భారతీయుల మయ్యు వేషభాషలందును హావభావములందును అపరాంగ్లేయులమై ప్రవర్తించుచున్నాము. మెకాలే జోస్యమును తూచాతప్పక ఫలింపజేసితిమి.

## వంగీయుల సాదృశ్యము

వంగవాసులు సూక్ష్మదృష్టి గలవారు. మాతృభాషకును, సంస్కృతమునకును దెబ్బ తగుల నిచ్చిరి కారు. రామమోహనుని దృష్టాంతమున నంతఃశ్శైవలినివలె ప్రవహించిన ఉత్కృష్టభావ మెద్దియో వారు గ్రహించిరి. రామమోహనుడు ప్రాచీప్రతీచీ విజ్ఞానములను దిగ్రమించిన మహాభోక్త. ఆంగ్లము నీతనధిష్ఠానదేవత గావించుకొనలేదు. ఆధునికవంగభాషా రచనమునకు మార్గదర్శకుడైనాడు. నవయుగదిగ్వలయమున నుదయించిన ఈ విజ్ఞానభాస్కరునకు భక్తిపుష్పాంజలి నొసగ నెందరో వంగజిజ్ఞాసువులు ముందంజవేసిరి. వీరే వంగావనియందు నవ్యవిజ్ఞాన విభవమునకు సృష్టికర్తలైరి. వీ రాంగ్లమునకు నాంకు బెట్టలేదు. సంస్కృతముమీది కాంక్షకు తిలాంజలిని విడువలేదు. మాతృభాషను జూచి మూతిముడ్కలను విరుచుకొనలేదు. సంస్కృతమునుండి ప్రాచీన విజ్ఞానలహరిని, ఆంగ్లమునుండి అర్వాచీన విజ్ఞానపూరమును స్వీయభాషా కేదారము లోనికి బాటించి దానికి క్రొంగ్రొత్తరూపొసగిరి. సుజలసమన్వితమై, సుఫలయుతమై, సస్యశ్యామలసంశోభితమైన దీనిగాంచి సభ్యజగతినే డచ్చెరువొందుట లేదా ?

మాతృభాషాభివృద్ధివలన చేకూరు మేళ్లు బహుళములు. దీనివలన మనసు వికసించి, మనుష్యజీవనమును గంధబంధురము గావించును. సర్వతోముఖసమృద్ధికి వలసిన భావసంపద దీనియందే లభించును. సారస్వతోద్యమముపై నాధారపడిన సర్వోద్యమములు కపిధ్వజము నెత్తినవని, శంఖములు పూరించినవని, విజయపాణింధమములను ప్రయోగించినవని ప్రపంచచరిత్రలు చాటుచున్నవి. ఐరోపాఖండమున **Renaissance** లేకుండిన **Reformations** గాని **Revolutions** గాని పొడసూపజాలెడివా?

వంగసారస్వతోద్యమము బహుశాఖలు గలిగి పెంపొందినది. ప్రాచీనవిజ్ఞాన మహత్త్వమిట్టిదని ప్రపంచమునకు వీరు తెలుపగలిగిరి. రామకృష్ణ వివేకానంద రవీంద్రాదులు ప్రతీచీవాసుల కాచార్యులు కాజాలలేదా? నేడును పరమానంద గోస్వామి ప్రభృతులు పశ్చిమావనిలో తమ సంస్థల నెలకొలిపి ఉత్తమాశయములను ప్రతీచీవాసులకు ప్రబోధించుటలేదా? పాశ్చాత్యజిజ్ఞాసువులు శాంతినికేతనమునకు విజ్ఞానయాత్రికులై యరుదెంచుటలేదా? తమ భాషనుండి ప్రాచీవిజ్ఞానమును గ్రహించియే, మాతృభాషారాధనముకతన స్వావయస్థ దివ్యధరాజమును గుర్తించియే వంగప్రతిభావంతులు విజ్ఞానఫలములను వసుంధర కొసగుచున్నారు. అన్యభాషలకు వారాంకు బెట్టరు; కాని వానిని వారు గ్రహించుతీరు వేఱు. మాతృభాషను జగద్ధాత్రిని గావించియే అన్యభాషలను వారాదేవికి పరిచారికల గావింతురు. దృష్టాంతము లసంఖ్యాకములు. విపులోల్లేఖనమున కీ చిన్నివ్యాసమున చోటులేదు. హరినాథదే, సతీశచంద్ర విద్యాభూషణ్, సునీతికుమార ఛట్టోపాధ్యాయ, అమూల్యచరణ విద్యాభూషణ్, విధుశేఖర శాస్త్రి ప్రభృతులు ప్రాచీప్రతీచి భాషల నెన్నింటినో పఠించి ఎంతో పాండితి నంది స్వీయమాతృకకు క్రొత్తశక్తిని, క్రొత్త చెలువమును చేకూర్చిరి. ఇపుడు జాతీయవాదులదృష్టిలో మిన్నయై యున్న హిందీ వంగకవాటములను కూడ తట్టుచునే యున్నది. అతిథిసత్కారమున కీయకొనుచు, హిందీని వంగీయులు యథాస్థానమున నిలుపుచున్నారు.

## ఆంధ్రుల ప్రతిభాశూన్యత

ఆంధ్రు లుత్సాహవంతులై వంగోద్యమములు పొడసూపినపుడు వెన్కనుండి "శభాష్" యనిరి. వీరేశలింగమనీషి పోలు నేకొలదిమంది వీరిలో తక్క క్రియాంగణమున నడుములు గట్టినవారు దక్షిణమున జూపినవారె కారు. వంగావనిలో నుదయించి వ్యాప్తినొందిన అద్భుతభావోద్యమ మెట్టిదో మన యాంగ్లవిద్యాధికులు గాని మనపండితులుగాని, మనకవులుగాని, మనసారస్వతోపాసకులలో నెవ్వరు గాని మననాయకులు గాని గ్రహించిరనుట కెట్టి యాధారములు గానరావు. సంస్కృతాంధ్రాంగ్ల భాషలందలి పాండితి అధునాతన విజ్ఞానవసుంధరలో "నేనును మొనగాడనే" యనుకొనగాంక్షించు మనుష్యునకు అనివార్యమైనదని గ్రహించినవారు మనలో నెందరున్నారు? ఈ మూడు భాషలను చక్కగపరిశీలించినవా రెందఱున్నారు? కలకత్తా విశ్వవిద్యాలయమున పట్టభద్రులకు సంస్కృతమును, పట్టపరీక్షలకు బెంగాళీయును నిర్బంధపఠనీయ విషయములు. కన్నుపొడుచుకొనినను ఇట్టియేర్పాటు మన విశ్వవిద్యాలయములందు కానరాదు. కావున మన యాంగ్లవిద్యాధికులకు సంస్కృతము రాదు. తెలుగనిన దలనొప్పి. గాంధియుగమున మాతృభాషనుగూర్చి కొంత సంచలనము పొడసూపినను, ఇది తెలుగుగుండెలో నంతగా ప్రవేశింపలేదు. నాగేశ్వర, కృష్ణారావు మనీషుల నటునిలుపుడు. ఆంధ్రభాషాభివృద్ధికై కృషిచేసిన నాయకు లేరి? ఇక పూజనీయులైన మనపండితులు? ఆంగ్లమున వీరిలో ననేకులకు గల పాండితి శుద్ధశూన్యము. కావున అధునాతన భావప్రవంతిని వీరు కనజాలరైరి. ఇక్ష్వాకుని కాలమందే తమ మనసులను బిగించి తాళములు వేసిరి. తమ వ్రాతలందు అడ్డుబొట్లను నిలువుబొట్లను దిద్దుచున్నారు. కాలమునకు కావలసిన యక్కర లోకప్ప డనువాదములకు ప్రోత్సాహము లొసగినవి గాని సర్వకాలములందు నివి రచయితల యేకైకయాశయములై యుండరాదను నంశమును గమనింపక, జగదీశుడు ప్రసాదించిన దీర్ఘాయువు ననువాదములందును, అనుకరణములందును, అనుసరణములందును వీరు వ్యర్థము గావించుచున్నారు. **Translation** లోను **Technique** లోను తమ మనసులచే కసరత్ చేయించుచున్నారు. భాషాంగణమున చక్కని పైల్వానులై యున్నారు. పెద్దలటుండ చిన్నలు సంస్కృతమును జూచి "ఇసీ!" యని, ప్రాచీవిజ్ఞానవిభవమును తొంగియైన జూడక, స్వాతంత్ర్యమును, విచ్చలవిడి నడకయును నొక్కటియ యని భ్రమసి, చిత్తమువచ్చిన వ్రాతలను వ్రాయుచు సంతసంపడుచున్నారు. తెల్లకోటలను మించిన నల్లదొరలు తెల్లవారిలోని సద్గుణములను గాక దుర్గుణములనే అనుకరించుచున్నారు.

సాహిత్యము దివ్యదేవాలయమున కెనయైనదని స్మరించి, అందలి గర్భాలయమున దేజరిల్లు పరంజ్యోతినిగాంచి, పరవశులై దివ్యగీతికల నాలాపించిన సారస్వతోపాసకులు మనలో నెందఱున్నారు? దేవమందిరమున ప్రవేశించి బండమాటలను ప్రయోగించువారిని జూచి దురంతసంతాపమున బొగులనివారెవరు? సర్వకాలములకును ఆచార్యులు కావలసినవారు సారస్వతోపాసకులని ఋజువుపఱచిన రవీంద్రాదులను జూపితిని. మనయాధునికులలో మన తెలుగునేలలో నిట్టివా రెవ్వరని ప్రశ్నిం

**తము. ఈశ్వరోపాసకులై - మహాత్ములై, సహజ శక్తిని, స్వతంత్రశక్తిని అద్భుతమైన నైసర్గిక ప్రతిభను సమస్త వసుంధరసమ్ముఖమున ప్రదర్శించి మణిమకుటము దాల్చిన సాహిత్యాచార్యులు నేడాంధ్రావనియందున్నారా? మన స్థితి శోచనీయమై యుండలేదా?**

ఇరువదవ శతాబ్దిలో ప్రపంచ జాతులందు పరస్పర సంబంధము లెట్లనివార్యములో, ప్రపంచ భాషలందును సాహిత్యములందును ఇట్టి సంబంధము లనివార్యములు. వీనికతన వైజ్ఞానికసంఘీభావ మేర్పడును. దీనివలన మానవహృదయములొకే ప్రణయగ్రంథియందు జేరుకొనును. జగతి సుఖశాంతులు నెలయును. ఈ యుత్కృష్టాశయమును దృష్టిలో నిడికొనిన సాహిత్యోపాసకు లింకను మనలో గోచరింపలేదు.

మఱొకభాష నెట్టియుద్దేశముతో మన విజ్ఞానాంగణములోని కాహ్వానింపవలెనో మన నాయకులును, ప్రజలును తొలుత గుర్తింపవలెను. లేకున్న చెఱుపు వాటిల్లును. ఆంగ్లమును జూచి వంగీయులు **"అమ్మో!"** యనక వంగమాతృకకు దానిని శరణాశ్రితదాసి గావించిరి. మనమో? ఆంగ్లమునుజూచి ఆంధ్రమును మఱచితిమి. సముచితమైన ఆంతరంగిక పరివర్తనము నందినగాని హిందీ నాంధ్రమునకు చెలిమికత్తె గావించు టెఱుగకుందుము. హిందీకతన నాంధ్రభాషాభివృద్ధికై గాక, ఆంధ్రభాషావిస్మృతికై పాటుపడెదమేమో!

## హిందీ ఆవశ్యకత

అన్యరాష్ట్రీయులతో సంభాషణముసలుపజాలుటకు నక్కరైన హిందీ పరిజ్ఞానము కావలెనని మననాయకు లనుచున్నారు. ఇట్టి పరిజ్ఞానముకతన దక్షిణదేశస్థులకు ఉత్తర హిందూస్థానమున సవలీలగ నుద్యోగములు లభించునని ప్రధానమంత్రిగారు వాకొనిరి. ఈ యుద్దేశములు గురుగంభీరములు కావు. హిందీపరిజ్ఞానము జూచి ఉద్యోగములు చివాలున నొడిలో దుముకునని తలపజెల్లదు. ఆంగ్లమందును హిందీలోను మేటివిజ్ఞానులైన హిందుస్థానీయు లెందఱో తమ నేలలో నేడు నిరుద్యోగులసంఖ్యలో నున్నారు. విజ్ఞానసంపాదనమును, ఉద్యోగ సంపాదనమును అర్థనారీశ్వరులట్లు అవినాభావసంబంధము గలిగియుండునవి కావు. ఉద్యోగపుటెర జూచి విద్యాంగణమున ప్రవేశించినవా రెందఱో నేడు బుఱ్ఱలకు బొప్పి గట్టించుకొనలేదా?

భావవిభవమున హిందీ వంగభాషకు వెనుక నిలిచినను, ఈ భాషను మాడువారి సంఖ్య భారతావనిలో విశేషమై యుండుట చేతను, సంస్కృతపదభూయిష్ఠమై, మధురమై అన్యభారతభాషలకమారమున నుండుట వలనను, విశేషించి మహమ్మదీయసోదరుల మాతృభాషకు సమీపమున నుండుటచేతను, భారతభూమియందది జాతీయభాషయై, వివిధ రాష్ట్రభాషా గ్రంథకర్తల పరస్పర భావ వ్యక్తీకరణమందును, భావ హృదయంగమమందును అక్కరైన కేంద్రభాష కాజాలును. దీనివలన వివిధ రాష్ట్రవాసులకును, వివిధ జాతులవారికిని, వివిధ మతములవారికిని సంఘీభావము చేకుఱును. వట్టి నోటిమాటల వలన నిది చేకూరనేరదు. ఉత్తరహిందుస్థానీయుల మాట ముసల్మానులకు బోధపడనిది కాదు. ముసల్మానులమాట ఉత్తర హిందూస్థానీయులకు తెల్లముకానిది కాదు. కాని హిందూ ముసల్మానుసమ్మేళన మార్యావర్తమున మృగ్యమైయుండుట తఱుచుగ జూచుచుంటిమి కదా! వీరును, వారును, తక్కుంగలవారును విజ్ఞానవీథియందు చేతులతోపాటు మనసులను గలుపుకొనిన మంగళమహూర్తమునందే చలింపని సంఘీభావము, శిథిలముగాని సహృద్భావము సుసాధ్యమగును.

కాని నేడు హిందీప్రచారము చేయువారి దృష్టిలో భావబంధురవైజ్ఞానికోద్దేశము కలదనుట కట్టిచిహ్నములు కానరావు... మాతృభాషను చదువను వ్రాయను ఎఱుగని గ్రామస్థులు కొందఱు హిందీకై ప్రాకులాడుచున్నారని విందుము. తల్లిమాట నెఱుగనివారు మఱొక పుల్లిమాట నెట్లు గ్రహింపగలరు?

**"మే మిందుండ మాతృభాషల కెగ్గు కలుగునని యడలరా"** దని మంత్రులు వచింతురు. కాని ఈ మధురభావ వ్యక్తీకరణముతో మాతృభాషలు పునరుద్ధరణమును గనజాలవు. హిందీ ప్రచారముపట్ల జూపు శ్రద్ధను వీరు మాతృభాషాభివృద్ధికై కూడ జూపినయెడల జిజ్ఞాసువులు తృప్తినందెదరు. ధనవ్యయము వలన గాని, సముచితనిర్మాణకార్యక్రమము వలనగాని ఈ యుద్దేశములు సిద్ధింపవని నాయకులెఱుగుదురు. కావున హిందీప్రచారమునకై గొప్ప **Organisation** నెలకొలుపబడినది. దీని కుజ్జీయగు **Organisation** మాతృభాషాభ్యున్నతికై కూడ స్థాపింపబడవలెను.

## మాతృభాషా పోషణము ప్రధానము

ఒక్క భారతభూమిలో దక్క సర్వదేశములందును విద్యాప్రబోధము మాతృభాషలందే జరుగుచున్నది. మన సీమయందును ఇట్లే జరుగవలెనని కొంతకాలమునుండి నాయకులనుచున్నారు. సంతోషము! కాని మాతృభాషారాధకులు మలమల మాడుచున్నను వీరిపై నొక్కరును ఆదరంపుజూడ్కి నిగిడింపకున్నారు. కలములు కృశించి, ఎండిపోవునపుడు రసస్రవంతు లెందుండి జాలువారును? కడుపులందు చిచ్చురవులుచుండ, గుండెలందు వేడిపొగలు నిండుచుండ మధురభావబిందువు లెందుండి కురియును? రచయితలు సృష్టికర్తలే! కాని వీరును మానవులేయని, ఆకలిదప్పులు వీరికిని నుండునని గుండె గలవారు మఱవరాదు. మాతృభాషాప్రబోధమునకు వలసిన సరుకును త్రవ్వుట ఎందుండి? కవులగుండెయల నుండియే కదా! మాతృభాషారాధకుల మనుగడ కడచినపుడు మాతృభాష వృద్ధినంది, బహుశాంశ ప్రబోధమునకు చక్కనిమార్గము కాజాలును. సహృదయులును, దేశభక్తులును, ధనాఢ్యులును, పాలకులును మాతృభాషాపోషణమునకై పూనుకొనవలెను. ఇట్టి యత్నములు జరుగుతటి హిందీప్రచారమును గుఱించిగాని యితరభాషాప్రచారమును గుఱించిగాని సంశయించువారును అడలువారును ఉండరు.

సంస్కృతాంగ్లముల ప్రాముఖ్య మెట్టిదో యుల్లేఖించి యుంటిని. అంతర్జాతీయ సంపర్క మక్కరై యున్నది. కావున, నాంగ్లమును, ప్రాచీవిజ్ఞానశైవలిని నిరంతరాయముగ మానసకేదారములందు ప్రవహించు టొప్పుగావున సంస్కృతమును అవశ్యపఠనీయము కదా!

"నాలుగుభాషలను నేర్చుట సాధ్యమా?" యని ప్రశ్నించువా రుండకపోరు. ఆంగ్లము తక్కతక్కిన మూడుభాషలును విశేష సంబంధము గలవి. ఒకభాషలోని పాండితి వేఱొకభాషా పరిచయమునకు తోడుపడును. అన్యదేశీయులలో ననేకులు మాతృభాషలతోపాటు ఫ్రెంచ్, లేటిన్, గ్రీక్ భాషల నభ్యసించుటలేదా? పైని జేర్కొనబడిన నాల్గు భాషలను క్రమగతి నభ్యసించు వ్యవస్థను వివిధ తరగతులందు విద్యాశాఖాధికారులు కావింతురుగాక!

## పారిశ్రామిక విద్య

ఇంగ్లాండు అమెరికా జపాను మున్నగు దేశములందు ప్రజలందఱు నించుమించు

విద్యాగంధ మెఱిగియుండ, భారతావనిలో నూటికి పదుగురైన చదువు నెఱుగకుండుట శోచనీయమే! ఈ శోచనీయస్థితి నెఱిగియే నాయకులు ప్రాథమిక విద్యకు నేడు ప్రధాన స్థానము నీయ నిశ్చయించిరి. వయోజనవిద్య కూడ విశేషముగ వీరి ప్రోత్సాహము నందవలెను. సాధారణమైన వ్రాతకోతలతో పల్లెవాసులను వీరు సంతోషపెట్టరాదు. అధునాతన వ్యవసాయాభివృద్ధికి సంబంధించిన పరిజ్ఞానమును వారిమనసుల ప్రవేశపెట్టవలెను. కేవలసేద్యవృత్తివలన రైతులకడుపులు నిండజాలవు. కమతమైనను ఏటిపొడువున జరుగదు. కావున కృషికులు గృహపరిశ్రమలందుగూడ నాటితేటి యుండవలెను. వీనిని గురించిన పరిజ్ఞానము వారి కల్గవజేయుట విద్యాశాఖాధికారుల పవిత్రకర్తవ్యము.

ఇట్లని, ఉన్నత విద్యపై నాఘాతము వేయుటకు వీరు తలపడరాదు. నిరుద్యోగులకు హేతువైనది ఉన్నత విద్య కాదు. ఉద్యోగములు లభించుటలేదని విశ్వవిద్యాలయములను మూయదలచుట ఉన్నతవిద్యకు చెఱుపుచేయదలచుట. ఇది పాదరక్షలను కొనజాలని వానిని పాదములు నరకుకొనుమని ప్రోత్సహించినట్లుండును. భారతభూమిలోని విశ్వవిద్యాలయములు మాత్ర మెన్నియున్నవి? ఇంగ్లాండు మున్నగు దేశములను పరికింపుడు. వైశాల్యమును, జనసంఖ్యను గమనించి, ఈ యా దేశములందలి విశ్వకళాపరిషత్తుల సంఖ్యతో మన సంస్థల సంఖ్యను పోల్చిచూచితిమేని ఇది మిక్కిలి తక్కువయైనదని గ్రహింతుము. నిరుద్యోగమును పెంచు కారణములు వివిధార్థిక రాజకీయ పరిస్థితుల నుండి జనించినవి. ఇవి జాతీయములును, అంతర్జాతీయములును. వీనిని తొలగించు క్షమశక్తి మనలో లేదు. కాని ఈపరిస్థితులను కొంత వనుకనైన ప్రతిఘటింపగలవారు ప్రజాభ్యుదయమును మదినిడికొను పాలకులు.

పారిశ్రామిక ప్రబోధము నిరుద్యోగమును పాపునని కొందఱందురు. నే డిట్టిబోధనము దేశమున కక్కఱైనదే! వాణిజ్యాభివృద్ధికిని, వ్యవసాయాభివృద్ధికిని, వివిధ పరిశ్రమలవృద్ధికిని అక్కఱైన పరిజ్ఞానము నంది నడుములు గట్టువారు కొందఱు తోచినయెడల దేశపురోభివృద్ధి కొంతదనుక దృగ్గోచరము కాగలదు. నిరుద్యోగులసంఖ్య కొంత సన్నగిలజాలును. ఒకేవృత్తికై పరుగులెత్తువారు కొందఱు వెనుక నిలుతురు. కాని కేవలము పారిశ్రామిక పరిజ్ఞానముకతన నిరుద్యోగము మటుమాయమగునని తలపరాదు. శిక్షితులకు తావల మొసగు క్రియాంగణములును, కర్మాగారములును, సంస్థలును తలసూపవలెను. గృహపరిశ్రమలే కావు,—విశ్వేశ్వరయ్య జవహరు ప్రభృతుల దృష్టిలో నున్న పెద్దపరిశ్రమలును దేశమున నెలకొనవలెను. వాణిజ్యవీథులం దన్యదేశీయుల నెదుర్కొనుశక్తి భారతీయుల కలవడవలెను. స్వరాజ్యము చేజిక్కిన యనంతరమే ఇది యలవడును.

## అభాగులగు నిరుద్యోగులు

**"Back to the villages"** అను వాక్కు దేశబంధుని నాటగోలె విశేషముగా వినబడుచున్నది. నిరుద్యోగులైన విద్యాధికులను గ్రామములమీదికి వదలినయెడల, నిరుద్యోగము చచ్చి స్వర్గముచేరునని పలువురు పెద్దలు చెప్పుచున్నారు. ఈ యభిప్రాయమున కెదుట ఎం.ఎన్. రాయిగా రానకట్టయై నిలిచిరి. కూడు గుడ్డలులేక నల్లాడు నిరుపేదలైన పల్లెవాసులమీదికి నిరుద్యోగుల దండును పురికొలుపుట నిష్ఠురకార్యమని ఈయన వాకొనుచున్నారు......**Statistics** ను ప్రోగుచేయుటకై పరిశ్రమలమంత్రి, గిరిగారు పూనుకొనిరి. నిరుద్యోగుల సంఖ్యోదంతమునకై తడసియున్నారు. రాయిప్రభృతుల వాక్కులొక చెవియందును, తక్కుంగలవారి వచనములు రెండవ చెవియందును ప్రవేశించుచుండ, నిరుద్యోగులు నిర్విణ్ణులై నిలిచియుండిరి; వీరి గుండెలో **Tug of war** వృద్ధియగుచున్నది. తమ ప్రణాళిక తప్పక జయభేరిని మ్రోగించునని మాట నీయజాలమని మంత్రిగారనిరి. ఒక యత్నముతరువాత వేఱొక ప్రయత్నమునకు పరుగిడి కాళ్లు విఱుచుకొనిన నిరుద్యోగులు శంకాసహిత స్వాంతులై ఏదిక్కునకు బర్వెత్తెదరు? నాయకులగుండెలలోని సద్భావముతో సరితూగుమాట ఖజానాలో లేదని వీ రెఱుగుదురు. నూతనవిజృంభణ మెట్లు పరిణమించునో యని చింతచేయుచున్నారు. ఊహపై నూహ వీరిచిత్తములపై దాడివెడలుచుండెను. సగమువఱకు వీరికీవఱలోనే పిచ్చిపట్టినది. వివిధములగు గీతగోవిందములకు వీను లొగ్గి, సానుభూతివచనములను వినివిని వీనివలన కడుపులు నిండకపోవుటచే విశేషముగ వీరు విశ్వాసమును గోల్పోయిరి. తమ దుర్గతిని తమ గుండెలందే రాజనిచ్చిన మేలుగాని, లోని సెగలను పొగలను గురించిన వృత్తాంతమును నాయకుల మ్రోల నివేదింపనేల యని వీ రూహించుచున్నారు. కడుపులో కళతను బాసియున్న యైనను, కంఠమునుండి ఇంకను ఊపిరి విమ్మక్రిమింపక పోవుటచే నీయభాగుల సంకెంకలి ఆత్మగౌరవము చచ్చిపోలేదు. మన హిత్వమెఱిగిన మాననీయులు తాము తలపెట్టిన జాబితా తబిసీళ్లకు వీరు చేయూతనిచ్చిరి కారని కినియకుందురుగాక! ఈకార్యమున జిల్లాకలక్టరులు తోడుపడుచున్నారు కదా!

ఘోరాపద కంఠీరవమువలె కట్టెదుట తోచినపుడు భీతచిత్తులై మనుజులు నలువంకలకు పరుగులెత్తెదరు. వీరి మనసులందలి హేతుమాత్ర మపుడు పుటుక్కున తెగుననుట నిస్సంశయము. నేడెందఱెన్నియుపన్యాసము లిచ్చుచున్నను, తమ చూడ్కిని కాలువన్న కడుపులమీదనే సారించుచున్నారు. ఈకడుపులను చల్లార్చుట అనివార్యమే! కాని, కడుపు చల్లారినంతన హృదయము చల్లారునని **"Man does not live by bread alone"** అని కదా ఏసుమునివరుడు వాకొనినాడు. ఆకలి కడుపునకే కాదు, మనసునకును ఆత్మకునుకూడ కలదు. మనసును దనుపునవి శాస్త్రములు; ఆత్మను తనుపునవి కళలు. వీనికి సంబంధించిన నైసర్గిక ప్రతిభతో, సహజప్రజ్ఞతో బుట్టువారు మానవులందు కొంద ఱుందురు. ఉన్నతవిద్యవలనగాని సహజప్రకృతికి ననుకూలమైన ప్రబోధ దృష్టాంతములవలనగాని వీరి శక్తులు వికసింపనేరవు. భారత భూమిలో చదువు సంధ్య లెఱుగనివా రెందఱో యుండుట నిక్కమే! సర్వకాలములందును సర్వదేశములందును ఆరాధ్యదేవతలు కాజాలు మహావిజ్ఞానులు రవీంద్రాదులు నేడు మన పుణ్యభూమియందు వఱలుచుండుటయు నిక్కమే! ఉన్నతశిక్షకతన బహుళ రవీంద్రులను, పల్వురు రాధాకృష్ణులను ప్రస్ఫుటింపజేయగల ప్రతిభ భారత హృదయమున వెలయుచున్నది. ప్రాథమిక విద్యకే మంగళసూత్రము గట్టి ఉన్నతవిద్య నెందో బందీజేసిన, దోచు చెడుగులనేకములు. అద్భుతప్రతిభతో బుట్టినవారిని సహజ ప్రకృతికి ప్రతికూలము లైన తరగతులయందునుపను లందును పెద్దలు పెద్దబొంతలకు బిగించినయెడల, భారతవిజ్ఞానమునకును, భారత గౌరవమునకును, మానవాభ్యుదయమునకును, లోకశాంతికిని భావికాలమున వెనలేని చెఱుపు వాటిల్లును.

## అన్యదేశానుకరణము అదిష్టదాయకము

అన్యదేశానుకరణము బహుశారిష్టములకు కన్నతల్లి యగును. పారిశ్రామికపరిజ్ఞానమును, భౌతిక శాస్త్రజ్ఞానమును అక్కరైనవే! కాని ఇవియే ముక్తిమార్గములని యూహించుట తప్పు. హృదయవిద్య నెఱుగక, ఆత్మను దనుపు విద్య నెఱుగక వీనియందే దిట్టలైన జాతులు నేడు ప్రపంచమును విధ్వంసముచే నింపుటలేదా? పాశ్చాత్యానుకరణమే పరమాశయమని యెంచి, ప్రతీచీప్రథలను బాగుగ నలవఱుచుకొనినజపాను వాసులు, మహత్తర ప్రాచీసంప్రదాయమును మంట గలిపి,ఉత్తమాశయముల నుదధిలో ద్రోచి చైనాలో దారుణకృత్యములను సలుపుచున్నారు గదా! భారతోద్ధరణమునకై నేడు వేయివెరవులు రోయుచున్న మహనీయు లన్యదేశ చరిత్రలనుండి అక్కరైన పాఠములను గ్రహింతురు గాక! ఈ సముద్ధరణము సర్వతోముఖమైనదై యుండవలెనని వీరు స్మరింతురుగాక! నేటి శిక్షణా విధానము రేపటిక్రియావిధానమునకు పునాది. నేడు మనసున జొచ్చిన భావములు రేపటి సత్కార్యముసకు కుఢ్యములగును. విద్యాసమస్యలు కేవలము భౌతిక విద్యాసమస్యలే కావు. ఆధ్యాత్మిక విద్యాసమస్యలు కూడ గలవను నంశమును విస్మృతి కప్పగింపరాదు. జ్ఞానము వేఱు; విజ్ఞానము వేఱు. రెండును గలిసినపుడే మానవకల్యాణము సుసాధ్యమగును. జ్ఞాన విజ్ఞానముల (**Knowedge and wisdom**) నలవఱుచు విద్యాశాఖలందెద్దియు ననాదరణము సందరాదు. ప్రాథమిక పారిశ్రామిక భౌతిక విద్యాశాఖలకే కేలుమొగిచి మిన్నకొనియుండక, లలితకళలకును తత్త్వశాస్త్ర మత శాస్త్రములకునుగూడ మనసిచ్చి, వీనిని గఱపు ఉన్నత విద్యావ్యవస్థకు గూడ నాయకులు తనప్రోత్సాహ మొసగవలెనని తెలుపుట నా యూశయము. వివిధ విద్యాశాఖలలోనికిని, శిక్షణా పంథలలోనికిని వివిధ విద్యార్థులను పంపునవసరమున వారివారి వ్యక్తిగత శక్తులను సాధ్య మగుసీల బరికించి, వారి ననుకూలమార్గములందే నిలిపి, పలసిన చేయూతను వారి కీయ బ్రయత్నించుట విజ్ఞానులైన నాయకుల పవిత్రకర్తవ్య మని వచించుట నా యూశయము.

### 3-వ పేజి తరువాయి

తెరమీద వాలిన నీడను చూస్తిని,
తెరచాటున నీపాటలు విన్నా,
తెర చొచ్చిన నీకాంతి జోగితీ,
తెర వేమన్నా
తెలియలేకనే
కలిగి పోతినీ,
తెర ఉన్నాది బాలా!
తెర ఉన్నదే!
కన్నుల కానని రూపం పిలిచీ,
కౌగిలి కందని భావం తలచీ,
తెరవైపున నాచేతులు మోడ్చి,
అరమూతలు నాతీరని కలతే,
చీల్చిన చిరగని
తెరయివతలనే,
చేరగరానీ
నీ వవతలనే,
తెర ఉన్నాది బాలా!
తెర ఉన్నదే."

అని పాడుకొని అశ్రులు విడిచాను.

అవి కాలేజీప్రథమదినాలు. నా యీ ప్రేయసీ బాలను వాంఛించి వాంఛించి,మధుర తాపముచే ఉడుకెత్తి గౌతమీ సహోదరి హృదయాన వాలి, ఆమె చల్లని కరుణలో ఊయలాడుతూ, కొంచెం ఉపశమనం పొందే వాణ్ణి. నాగురువు హాల్డేర్ నన్ను దగ్గరకు చేర్చుకొని,

"ఓ బాపూ! నీకూ నాకూ చాలా పోలికలు ఉన్నాయి. నా ఆశాస్వరూపిణి నాకు ప్రత్యక్షం కాలేదు. ఇంతవరకూ నాకున్నూ తెర వెనకనే గోచరిస్తోంది. ఈజన్మంతా ఇట్లా బ్రహ్మచారినై, ఆమెకై తపస్సు చేయవల్సిందే!" అంటూ వాత్సల్య శీతలమైన చేతితో నాశిరము పుణికినాడు.

ఒక్కణ్ణే వెన్నెల్లో గోదావరిఒడ్డుకు పోయి, అస్పష్టమూర్తి అయిన ఆ ఆశాబాలను ఉద్దేశించి,

"వెదకలేనే రాణి నిన్నూ,
వేదనాభరమైన బ్రతుకులోనూ,
వెదకలేనే రాణి నిన్నూ!"

అని లోలోన, నాకు గోచరింపని, నేను తెలియలేని ఆ దివ్యబాలికను పిలుచుకున్నాను.

తీవ్రమైన ఆవేదనలోనే నా 'తొలకరి' పాటల పాడుకున్నాను. కాలేజీచదువు పూర్తిఅయింది. నాగురువుతో ఎడబాటూ కలిగింది. వ్యక్తావ్యక్తంగా తోస్తూ శశికళాదేవి నాచేత పాటలు పాడించింది; కథలు రాయించింది.

గురువర్యులైన హాల్డేర్‌గారు కవి, చిత్రకారుడు, గానకళానిధి. చిత్రకళాకౌశలం చేతులో ఉన్నది నాకు. క్రమశిక్ష లేని సహజశక్తితో ఏవో బొమ్మలు వేసుకొనేవాణ్ణి, రంగులు పులుముకొనేవాణ్ణి. చిన్నతనాన తరగతులలో చిత్రలేఖనానికి పదికి పదిమార్కులు వచ్చేవి. కాలేజీలో హాల్డేర్ గురువుగారిని "చిత్రలేఖనం నేర్పండి" అని అడిగితే, "బియ్యే పూర్తి చేసుకో, తరువాత చూద్దాము"అనిఅనేవారు. హాల్డేర్‌గారి అనుంగు శిష్యులమైన మా బృందం ప్రతి శని ఆదివారాలూ హాల్డేర్‌గారింట "శ్రీ"విందుకు హాజరైది. బొంబాయిలో చిత్రలేఖనం నేర్చుకుంటూ ఉన్న ప్రియమిత్రుడు రామారావు చిత్రాలకలల వెన్నెల పాట పాడేవాడు. 'రామారావుకు సైదోడుగా ఉండకూడదా' అని నా ఆవేదన. అప్పుడనుకున్నాను.

'నాదు కలలన్ని పటములై నాదు మంది-
రాంతర స్నిగ్ధకుడ్యాల నందగించు,
తెలియబడరాని వర్ణికామిళిత నవ్య
తనులు రేఖాప్రవాహచిత్రంపు సుడులు
అస్మదీయ జీవితరహస్యమ్ము కలచి
వైచుదివ్యభావము లెప్డు పరిమళించు."

అని ఆకాశంవైపు మోముతిప్పి, చేతులు మోడ్చి, నా శశికళను తలుచుకొన్నాను.

"ఓయి నాయనా! త్రిరూపాత్మక మైన లలితకళాదేవిని సందర్శించి పూజించే శక్తి నీకు చాలునో చాలదో? ఏది ఎట్లయినా ప్రభుత్వ పురాతనశిల్ప పరిశోధనశాఖలో నీకు ఉద్యోగం ఇప్పిస్తాను, శిల్పదేవిని ఆకృతిగా ఆరాధించవోయి!" అన్నారు గురుదేవులు.

పిమ్మట గురుదేవులు ఇంగ్లండు వెళ్లడం, మహదానందపూర్ణమగు స్వరప్రపంచంనుంచి బహిష్కరించే బధిరత్వ మాయన్ని ఆశ్రయించడం, ఆ చిన్నతనంలోనే ఆకారణంచేత ఆయన పింఛను పుచ్చుకోవడం సంభవించింది. ప్రభుత్వ పురాతనశిల్ప పరిశోధనశాఖ నాకు కానిదైపోయింది.

మహాత్ముని పవిత్రశంఖారావము భారతపథాల మారుమ్రోగినప్పుడు, ఒడలెరగని దివ్యకామావేశంచేత ఇళ్లూ వాకిళ్లూ వదలి పావన బృందావన భూములకు పరుగెత్తిన గోపికల్లాగ, భారతీయ స్వతంత్రతా మాధవుణ్ణి వెదకుకుంటూ పరుగెత్తినవారితోగూడి కడలూరు జెయిలులో వసించేటప్పుడు కూడా నాశశికళ నాకు ఏకాంతదాస్య మనుగ్రహించి నాచేత పద్యాలు, పదాలు పాడించి,కథలు కథానికాలు అల్లించింది.

కటకటాలలోనుంచి గయా కాంగ్రెసు యాత్ర చేశాము. త్రివేణీసంగమస్థానం దర్శించాను. ఆ పుణ్యజలాలు సుడిగుండాలు తిరిగే లోతుల్లో సూర్యసుతరూపం ఈషత్తు స్ఫుటంగా మొదటిసారి ప్రత్యక్షమైంది. అదే నా 'సూర్యసుత' కథ.

ఆ రాకరాక గోదావరిఒడ్డుకు వచ్చి, ఒక సాయంత్రము గట్టుపైన అధివసించి, నది ఆవలిగట్టున అస్తమిస్తూ ఉన్న ఎర్రని సూర్యబింబ సౌందర్యం, సంధ్యాకాంతుల మాధుర్యం దర్శిస్తూ, ఆనందం పొందుతూ, సంధ్యానృత్యం భావపథంలో ప్రత్యక్షం చేసుకొని, పరవశుణ్ణౌతూ ఉన్న సమయాన ఒకబాలిక నా పక్కనే వచ్చికూర్చున్నట్లయింది. ఆమె చీరకొంగులు నన్ను స్పృశించినంతమాత్రాన నా ఒళ్లు ఝల్లుమన్నది. వేయితీపులు, వేయి మెరుపులు నాలో ప్రసరించిపోయినవి. ఆమెవైపు తిరగడానికి భయం.

"ఎవరోహో ఈ బాల!" అని నామనః పథాల మధురమైన ప్రశ్న?

"నీకు ఈ దివ్యముహూర్తం సన్నిహితం అయినప్పుడు నిన్ను చేరకుండా నేనెలా ఉండగలనోయీ!" అని కాకలీస్వరకంఠను నన్ను ప్రశ్నించింది.

ఆమెవైపు తిరిగాను. అహో, ఆమె నా సూర్యసుత!

"ఓ ప్రియ బాలికా!
నీకై నే ఎదురుచూస్తి,
నీకై నే వెదకినాను.

## 3-వ పేజి తరువాయి

తెరచాటున నీవను చూస్తిని,
తెరచాటున నీపాటలు విన్నా,
తెర చొచ్చిన నీకాంతి జొగితీ,
తెర వేమన్నా
తెలియలేకనే
కలిగి పోతినీ,
తెర ఉన్నాది బాలా!
తెర ఉన్నదే!
కన్నుల కానని రూపం పిలిచీ,
కౌగిలి కందని భావం తలచీ,
తెరవైపున నాచేతులు మోడ్చీ,
అరమూతలు నాతీవని కలచీ,
చీల్చిన చిరగని
తెరయివతలనే,
చేరగరానీ
నీ వవతలనే,
తెర ఉన్నాది బాలా!
తెర ఉన్నదే.”

అని పాడుకొని అస్రులు విడిచాను.

అవి కాలేజీప్రథమదినాలు. నా యీ ప్రేయసీ బాలను వాంఛించి వాంఛించి, మధుర తాపముచే ఉడుకెత్తి గౌతమీ సహోదరి హృదయాన వాలి, ఆమె చల్లని కరుణలో సొమ్మలాడుతూ, కొంచెం ఉపశమనం పొందేవాణ్ణి. నా గురువు కూల్డ్రే నన్ను దగ్గరకు చేర్చుకొని,

“ఓ బాపూ! నీకూ నాకూ చాలా పోలికలు ఉన్నాయి. నా ఆశాస్వరూపిణి నాకు ప్రత్యక్షం కాలేదు. ఇంతవరకూ నాకున్నూ తెర వెనకనే గోచరిస్తోంది. ఈజన్మంతా ఇట్లా బ్రహ్మచారినై, ఆమెకై తపస్సు చేయవల్సిందే!” అంటూ వాత్సల్య శీతలమైన చేతితో నాశిరసు పుణికినాడు.

ఒక్కణ్ణే వెన్నెల్లో గోదావరిఒడ్డుకు పోయి, అస్పష్టమూర్తి అయిన ఆ ఆశాబాలను ఉద్దేశించి,

“ఎదకలేనే రాణి నిన్నూ,
జీవనాధారమైన బ్రతుకులోనూ,
ఎదకలేనే రాణి నిన్నూ!”

అని ఆలాపన, నాకు గోచరింపని, నేను తెలియజాలని ఆ స్వప్నబాలికను పిలుచు వున్నాను.

తీవ్రమైన ఆవేదనలోనే నా ‘తొలకరి’ పాటల పాడుకున్నాను. కాలేజీచదువు పూర్తిఅయింది. నాగురువుతో ఎడబాటూ కలిగింది. వ్యక్తావ్యక్తంగా తోస్తూ శశికళాదేవి నాచేత పాటలు పాడించింది; కథలు రాయించింది.

గురువర్యులైన కూల్డ్రేగారు కవి, చిత్రకారుడు, గానకళానిధి. చిత్రకళా కౌశలం చేతులో ఉన్నది నాకు. క్రమశిక్ష లేని సహజశక్తితో ఏవో బొమ్మలు వేసుకొనేవాణ్ణి, రంగులు పులుముకొనేవాణ్ణి. చిన్నతనాన తరగతులలో చిత్రలేఖనానికి పదికి పదిమార్కులు వచ్చేవి. కాలేజీలో కూల్డ్రే గురువుగారిని “చిత్రలేఖనం నేర్పండి” అని అడిగితే, “బియ్యే పూర్తి చేసుకో, తరువాత చూద్దాము”అనిఅనేవారు. కూల్డ్రేగారి అనుంగు శిష్యులమైన మా బృందం ప్రతి శని ఆదివారాలూ కూల్డ్రేగారింట “టీ”విందుకు కూడేది. బొంబాయిలో చిత్రలేఖనం నేర్చుకుంటూ ఉన్న ప్రియమిత్రుడు రామారావు చిత్రాలకలల పెదవుల పాట పాడేవాడు. ‘రామారావుకు సైదోడుగా ఉండకూడదా’ అని నా ఆవేదన. అప్పుడనుకున్నాను.

‘నాదు కలలన్ని పటములై నాదు మంది-
రాంతర స్నిగ్ధకుడ్యాల నందగించు,
తెలియబడరాని వర్ణికామిళిత నవ్య
తనులు రేఖాప్రవాహచిత్రంపు సుడులు
అస్మదీయ జీవితరహస్యమ్ము కలచి
వైచుదివ్యభావము లెప్డు పరిమళించు.”

అని ఆకాశంవైపు మోముతిప్పి, చేతులు మోడ్చి, నా శశికళను తలుచుకొన్నాను.

“ఓయి నాయనా! త్రిరూపాత్మకమైన లలితకళాదేవిని సందర్శించి పూజించే శక్తి నీకు చాలునో చాలదో? ఏది ఎట్లయినా ప్రభుత్వ పురాతనశిల్ప పరిశోధనశాఖలో నీకు ఉద్యోగం ఇప్పిస్తాను, శిల్పదేవిని ఆకృతిగా ఆరాధించవోయి!” అన్నారు గురుదేవులు.

పిమ్మట గురుదేవులు ఇంగ్లండు వెళ్లడం, మహదానందపూర్ణమగు స్వర్గప్రపంచంనుంచి బహిష్కరించే బధిరత్వ మాయన్ని ఆశ్రయించడం, ఆ చిన్నతనంలోనే ఆకారణంచేత ఆయన పింఛను పుచ్చుకోవడం సంభవించింది. ప్రభుత్వ పురాతనశిల్ప పరిశోధన శాఖ నాకు కానిదైపోయింది.

మహాత్ముని పవిత్రశంఖారావము భారత పథాల మారుమ్రోగినప్పుడు, ఒడలెరగని దివ్య కామావేశంచేత ఇళ్లూ వాకిళ్లూ వదలి పావన బృందావన భూములకు పరుగెత్తిన గోపికల్లాగ, భారతీయ స్వతంత్రతా మాధవుణ్ణి వెదకుకుంటూ పరుగెత్తినవారితోగూడి కడలూరు జెయిలులో వసించేటప్పుడు కూడా నా శశికళ నాకు ఏకాంతదాస్య మనుగ్రహించి నా చేత పద్యాలు, పదాలు పాడించి, కథలు కథానికలు అల్లించింది.

కటకటాలలోనుంచి గయా కాంగ్రెసు యాత్ర చేశాము. త్రివేణీసంగమస్థానం దర్శించాను. ఆ పుణ్యజలాలు సుడిగుండాలు తిరిగే లోతుల్లో సూర్యసుతరూపం ఈషత్తు స్ఫుటంగా మొదటిసారి ప్రత్యక్షమైంది. అదే నా ‘సూర్యసుత’ కథ.

ఆ రాకరాక గోదావరిఒడ్డుకు వచ్చి, ఒక సాయంత్రము గట్టుపైన అధివసించి, నది ఆవలిగట్టున అస్తమిస్తూ ఉన్న ఎర్రని సూర్యబింబ సౌందర్యం, సంధ్యాకాంతుల మాధుర్యం దర్శిస్తూ, ఆనందం పొందుతూ, సంధ్యానృత్యం భావపథంలో ప్రత్యక్షం చేసుకొని, పరవశుణ్ణౌతూ ఉన్న సమయాన ఒకబాలిక నా పక్కనే వచ్చికూర్చున్నట్లయింది. ఆమె చీరకొంగులు నన్ను స్పృశించినంతమాత్రాన నా ఒళ్లు ఝల్లుమన్నది. వేయితీపులు, వేయి మెరుపులు నాలో ప్రసరించిపోయినవి. ఆమె వైపు తిరగడానికి భయం.

“ఎవరోహో ఈ బాల!” అని నామనః పథాల మధురమైన ప్రశ్న?

“నీకు ఈ దివ్యముహూర్తం సన్నిహితం అయినప్పుడు నిన్ను చేరకుండా నేనెలా ఉండగలనోయీ!” అని కాకలీస్వరకంఠను నన్ను ప్రశ్నించింది.

ఆమెవైపు తిరిగాను. అహో, ఆమె నా సూర్యసుత!

“ఓ ప్రియ బాలికా!
నీకై నే ఎదురుచూస్తి,
నీకై నే వెదకినాను.

కనుమూతల కలలల్లో,
మన మెరుగని తీపుల్లో
నీకై...
తపసైన నిరీక్షణలో
తలపులతో బొమ్మెత్తిని
నాతోనే లోకాలు
నాతోనే క్షణికాలు
నీకై...
ఒకపాటలో ఒదుగుల్లో,
ఒకరాగం స్వరముల్లో
నారాణీ కిరణంలా
మెరిశావే ఎదుట ఎదుటె!
నీకై...
గోదావరి ఆగంది,
గోవత్సం ఆడింది,
సాయంత్రం బంతిరంగు
చల్లెనె పన్నీటివాన,
నీకై..."

అని నాగళాంతరాలనుండి ఈపాట పోటెత్తింది.

ఆ బాలిక కంఠాన కస్తూరీ కర్పూర మందార పారిజాత పరిమళాల వెదజల్లుతూ తెల్లని నక్షత్రకుసుమమాల ఉన్నది. ఆ మాలికతీసి, చిరునవ్వులు తన అందాలమోమును వెలిగిస్తూఉండగా, నామెడను అలంకరించి—

'కుమారశిల్పీ; గోదావరి సాక్షిగా నిన్ను వరించాను. ఇదే మనకు గాంధర్వవివాహం' అన్నది.

నాకుడిచేయిని వెన్నెలకిరణాలలా మెత్తనైన తనచేతితో పట్టుకొని కర్పూరమాల ఒక్కటి చుట్టి తన బంగారుచీర చెరగు కప్పినది.

ఆమె నాకప్పుడు రూపకల్యాణి. నాహృదయం రాగచిత్రాలు వ్రాసింది. ఆమెమాటలు లాస్యమధురమైన నృత్తములో నన్ను పరవశుణ్ణి చేసినవి.

ఆ దివ్యముహూర్తాన్నుండి నా ప్రియురాలు కొన్నిదినాలు నాతో సాహచర్యము సలుపుతుంది, కొన్నిమాసాలు మాయమై ఏలోకాలకో, ఏపథాలకో విహరించబోయి నాకు సన్నిహితంకాదు. ఆమెకై నా విరహవేదన అనంతనీలిమను ఆవరించి,

"ఓ చెలీ ఎచ్చటే?
ఓ చెలీ ఓ చెలీ!
గాలిలో కరిగితో?
నీలమై పోయితో?
దివ్యమందాకినీ తేజ స్తుషారాన
భవ్యమూర్తి! ప్రవహించితో?
ఓ చెలీ ఎవరవే
ఓ చెలీ ఎచ్చటే
ఓ చెలీ ఓ చెలీ!
తేటి మధువానుతూ
పాటపాడేవేళ,
వెన్నెలలు మబ్బులో
వన్నె తీర్చేవేళ,
గౌతమీ దివ్యాపగా
సహోదరి నన్ను
లోతుల్లో భ్రమియించు
పూతలి స్తలాన
ఓ చెలీ ఎచ్చటే?
ఓ చెలీ! ఓ చెలీ!"

అంటూ వలపోసేది.

ఆ ఆవేదన నన్ను ఆంధ్రజాతీయ కళాశాలా పవిత్రభూములకు కొనిపోయినది. గంభీర సత్త్వుడు, విశాలఫాల సుందరుడు, మహాశక్తిసంపన్నుడు, ఒక నూత్నగురువు నా కచ్చట సాక్షాత్కరించినాడు. శ్రీ ఆస్వాల్డు కూల్డ్రే యొక్క భారతీయ అవతారమన్నట్లు వెలుగు శ్రీ ప్రమోదకుమార చటోపాధ్యాయుల పాదాలకడ మోకరిల్లినాను. ఆయనచిత్రకళాశక్తి హిమాలయ కాంచనగంగాశిఖర సదృశము. నాల్గేళ్లు ఆయనవ్రోల శుశ్రూష చేసినాను. ఐంద్రజాలికమైన కుంచె త్రిప్పినట్లాయన ఎట్టి మొరకుశిష్యులకైన హస్తమున పంచాక్షరి వ్రాసినట్లు విద్య నలవరింప కలిగిన కళామూర్తి. ఆదినాలు నాకు పరమపవిత్రములైనవి. శశికళాదేవి నాగురువు మాటలలో, నాగురువు హస్తాలలో, నాగురువు తీక్ష్ణసుందరదృష్టులలో వెన్నెలవెలిగే చిరునవ్వులతో ప్రత్యక్షమై మాయమౌతూ ఉండేది. ఆమె నాచిత్రపీఠముపక్కనే కూర్చుండి, నివేదన, సూర్యదేవ, నాగనాట్య, ప్రాణదేవి మొదలైన చిత్రాల చిత్రింపించింది.

నాపాటలు, నాకథలు ఇనుమడించాయి. ఆంధ్రులలో ఉత్తమ హృదయులలో ముందు వరసలో ఉన్నవాడు, కళాజీవి, కళారాధకుడు, కళామిత్రుడు రామకోటీశ్వరరావు నాకు ప్రాణమిత్రుడైనాడు. విశ్వనాథ, నండూరి, నాయని మొదలైన కవులతో, బెల్లంకొండ మొదలైన పవిత్ర జీవనులతో స్నేహాలు వృద్ధి అయ్యాయి. నాశశికళ తన దివ్యప్రేమలో నన్ను పవిత్రపూత చరిత్రుణ్ణి చేసే పథాలకు కొనిపొయ్యేది.

## ౪

ప్రతివ్యక్తినీ పురుషార్థపరుణ్ణిచేసే ఆశయస్వరూపిణి కొన్ని జన్మల్లో అతనితో విడిపడినా, కొన్నిజన్మల్లో మరల కలుసుకుంటూ, జన్మయాత్ర కలసిసాగిస్తూ, చివరకు అతనిలో ఐక్యమైపోయి, సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యాలు పొందిస్తుంది.

ఆమెవినా అతనికిగాని, అతడువినా ఆమెకుగాని ప్రత్యేకంగా మోక్షం లేదనే నా భావం. వా రిద్దరూ 'ప్రోటాను, ఎలక్ట్రానులు'. అలాంటి నా ఆశయరూపిణి, సూర్యసుత, శశికళాదేవి నాకు శిల్పబాల, కావ్యకన్య, నృత్యమూర్తి, గాంధర్వస్వరూపిణి. ఆమెచెంత మోకరించి, ప్రేమభిక్షం యాచించాను.

"తోటమాలీ కూతురైనా
తులసీకన్నెను చూసి,
మాటలేని మనసు పొంగింది
నాపాట పలకనిగుండె విరిసింది,
తులసీకన్నె
ఆటలాడని నృత్యమాగింది.
'వలపూ నామీద నిలుపూ!
తలపూలా నాబ్రతుకు ముంచూ
కలిపివేయవె ఎదలు రెండింటి
తులసీకన్నె
విలువమీరిన పథములేలంటే?
'మల్లె లెరుగుదు, మొల్ల లెరుగుదు,
ఎల్లపూవుల రంగు లెరుగుదు,
కల్లకానీ తావితెమ్మంటే,
తులసీ కన్నె

'వెల్లివిరిసిన పూవు ఏదం'దీ!
తోటతిరిగీ ఏటికరిగీ
దాటరానీ అడివి మరిగీ
మేటిపూవుల మర్మమెరిగితినీ
'తులసీకన్నే!
సాటిలేనీ పూవు కననం' టీ.
పెదవి విరచీ బొమలు ముడిచీ
చెదరిపోయిన కురులనెత్తీ,
'అదిర! ఇంతేనా ?' అనుచునవ్వింది
తులసీకన్నె'
'నిదురవచ్చే పోరపోమం'దీ.
వలపూను తావి చేస్తీ
కలలన్నీ దళములంటీ
చెలువాన్నే రంగువేశాను
'తులసీ కన్నే
నిలువూనా పూజలివి' అంటీ!

కళాస్రష్టలకు కళలే మోక్షసాధకాలైన నిష్కామకర్మలు. అట్టి ఉత్కృష్టకర్మమార్గమున కళాస్రష్టలను వారివారి ఆశయమూర్తులే ప్రాప్యమును చేరుస్తవి.

ఈ పవిత్రభావాన్ని పదునుచేసి 'వీణ', 'సంధ్యానృత్యము' వంటి అనేకకథానకములలో అల్లుకొన్నాను.

" 'ఓ శిల్పి నీవిద్య ఉపదేశమిచ్చేటి
నీతులేమ'ని నన్ను నిల్పి ప్రశ్నించావు!
'సౌందర్య విన్యాస చారు రేఖల్లోన
నారాణి మూర్తింప నా విద్య'లన్నాను.
'ఓ కవీ! నీపాట ఒదుగు మెలుపులలోన
శ్రుతుకాదు సత్యమ్ము సెలవీయు'మన్నావు
'జ్వలితగీతా తటిచ్చలిత కాంతుల్లోన
నారాణి దీపింప నాతపస్స'న్నాను.
'ఓహో! సంధ్యానటా! నీనృత్యవృత్తిలో
పరమభావ మేమ్మిది పలకవా' అన్నావు.
'ధకిటధిణతకిటా తాండవోద్వేగినై
దేవి నీకై ఆడి ఈవౌదు నేనం'టి."
అని ఆభావాన్నే గానం చేశాను.

ఉత్కృష్టమైన ఆశయాలే ఆరాధనాబలంచేత పరిపూర్తినొంది జీవితముతో సారూప్య మొందిపోవునుకదా!

ఆశయస్వరూపిణి, లలితకళాదేవి, చంద్రబాలికారాణి దివ్యకాంతులు భరించలేక మిరుమిట్లుపడి కళ్లుమూసికొని

"పాడకే నారాణి
పాడకే పాట!
పాట మాధుర్యాల
ప్రాణాలు మరిగెనే!
పాడకే...
రాగ మాలాపించి,
వాగులా ప్రవహించి,
సురుచుట్టుగీతాల
సురిగి పోనీయకే
పాడకే...

కరవీర మొగ్గలే
కదిలి నీపెదవులా
ప్రణయ పదమంత్రాల
బంధించె జీవనము,
పాడకే...

శ్రుతిలేని నాఎదను
చతురగీతం జేల?
గతిరాని పాదాల
కతులనర్తనమేలే?
పాడకే..."
అని వేడికొన్నాను.

స్వరాలకెంతైనాశక్తి ఉందంటారు. వర్ణాలశక్తి అద్భుతమైన దంటారు. శబ్దాలశక్తి దేనికీ లేదంటారు. ఈ మూడు మార్గాలచేతా ఆమెసాన్నిధ్యం కల్పించుకోవాలని చేసిన నాసాధనలన్నీ అసంపూర్ణంగానే ఉండిపోయినాయి.

నాహితులు వారివారి ఆశయములను 'యెంకి'గా, 'నందసుందరి'గా, 'కిన్నెరసాని'గా, 'వత్సలాదేవి'గా, 'ఊర్వశి'గా, 'హృదయేశ్వరి'గా, 'శబరి'గా, 'తృణకంకణధారిణి'గా అర్చించినారు. వారివారి భజనలు నన్ను తీయదనాల ముంచెత్తి వేస్తూ ఉంటవి.

ఇప్పుడు నాశశికళ నాకు దూరదూరాన గోచరిస్తున్నది. ఆమెపాదసేవమ్రోల ఇంతలో పూజలర్పింపగలనన్న ఆశచే మెరిసే చూపులతో, అర్పణజ్యోతి వెలిగే హృదయంతో కలలు కంటున్నాను. ఆనాటి 'మొనాలిజా','అనన్సియేషన్','మెడోనా' వంటి ప్రపంచప్రఖ్యాత చిత్రాన్ని రచించి, మహాకావ్యమొక్కటి ప్రవహింపచేసి శశికళాదేవికి చేసిన పూజాఫలం లోకానికి ధారపొయ్యాలని ఆశిస్తున్నాను. ఆసుముహూర్తం కోసం భావుకుల ఆశీర్వాదం అర్థించే

బాపిబావ :

కరములు మోడ్చి సెలవు తీసుకొంటున్నాడు.



# గెలుపు

'రావు'

అవి జగన్నాథ రాజుగారి హయాంనాటి రోజులు!

పెనుమెత్స జగన్నాథ రాజుగారి పేరు వింటే పిట్టలుకూడా నీళ్లు తాగేవి కావు. ఆయనది సుగ్రీవాజ్ఞ! విజయనగర సంస్థానం పొలిమేరలో ఆయనకి అణిగివుండని జీవం లేదు.

ఆయన ధర్మమూర్తి! పదికుటుంబాల్ని నిలబెట్టేమార్గం వెతకడమే ఆయన ఆలోచన!

చెడి బతికినవాడాయన! డఫేదారుగా ప్రవేశించి రోజుకు రోజూ ప్రభువుల అనుగ్రహాన్ని పొందుతూ పెద్దదివానై సంస్థానాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా పాలించేడాయన! ప్రభువులికి రాజ్యకార్యాల్ని గురించిన ఆలోచనే అక్కర్లేకపోయేది.

చదివినది ప్రయిమరీ అయినా ప్రతిభాశాలి అవడంచేత రాజ్యతంత్రప్రవీణుడయాడు. ఆంగ్ల భాషావాసన అణుమాత్రమూ ఆయనకి లేదు. ఒకప్పుడు గవర్నరు విజయనగరం వస్తున్నాడని తెలిసి మాట్లాడడానికి ఇంగ్లీషు కొంచెం అభ్యాసం చేసి, తన యేర్పాట్లను చూసి సంతోషించిన ఆ గవర్నరుతో '**What make is my Make? Your Honourable Make is a Make.**" అని అన్నాడట! 'మాలాటివాళ్లం ఏం చెయ్యగలమండి! మీవంటిప్రభువు చేసినదే చేత! అనే అభిప్రాయంతో. అది యిప్పటికీ జనుల్లో మాసిపోలేదు.

ఒకప్పుడు ఒక సబుకలెక్టరుకీ, యీయనకీ మాటా మాటా వచ్చింది. ఇతన్ని పరాభవించడానికి తలిచి ఆ కలక్టరు సాయంకాలం లోపుగా వీరి యింటికి ఎదురుగా రోడ్డుమీద శాశ్వతంగా ఉండే లక్కపందిరిని తీయించివేయాలంటూ ఆర్డరు జారీ చేశాడు. 'సాయంత్రంలోపుగా తప్పకుండా తీయించేస్తా'నంటూ యీయన జవాబువ్రాసి ఎగువకి — అంటే — చెన్నాపట్నం నైరిచ్చి నిమిషాల మీద కలక్టరుకి ట్రాన్సుఫరు ఆర్డరు తెప్పించాను. ఇతనంత పట్టుదలమనిషి. ఆ లక్కపందిరి యిప్పటికీ మంచిస్థితిలో వుంది.

*　　*　　*

ఒకప్పుడు ఒక దరిద్రుడు ఉద్యోగంకావాలని ఈయన్ని ఆశ్రయించాడు. ఏవీ ఖాళీలు లేక ఒక కంట్రాక్టుపని కల్పించి ఈయన ఇచ్చేడట! ఆతను పనిపూర్తిచేయించి అణా, పైసలతో లెక్కలు వ్రాసి దాఖలుచేయగా చూచి యీయన 'యీమాత్రం తెలియనివాడవు బతుకుతెరువు ఎలా తెలుసుకుంటావు? అని కూకలేసి లెక్కలు తారుమారు చేయించి ఓ వెయ్యిరూపాయిలసొమ్ము ముట్టజెప్పి పంపేడట!

గుమాస్తాలూ, ఉద్యోగస్థులూ ఎంత చేతకానివారయినా సరే యీయన వాళ్లపొట్టమీద కొట్టేవాడుకాడు. కొందరుగుమాస్తాలు ఒక రిపోర్టు వ్రాసి చేసిన. సంతకాలని చూసి ప్రభువులు ఇతనితో 'మన సంస్థానంలో యిలాంటివాళ్లే కదూ ఉన్నారు?' అని అనగా ఈయన 'ప్రభూ! ఎలాగైతే నేం లెండి! పని జరిగిపోతూన్నాది. జమాబందీ నిలిచిపోలేదు' అని సమాధానం చెప్పాడట! రాజులుంగారు ఏమీ చెప్పలేకపోయారట!

*　　*　　*

వెనకటి కోమారు విజయరామగజపతి మహారాజులుంగారు — అంటే — ఆనందగజపతి మహారాజులుంగారి తండ్రిగారు — (అప్పుడుకూడా దివాను జగన్నాథరాజుగారే లెండి!) ఒక భోగముదానికి అనాలోచితంగా లక్షరూపాయిలు యిమ్మని దివానుకి ఆర్డరుచేశారట! కాని వీరు ఉపేక్షించారట! ఆ స్త్రీ తనకు రావలసినది రాలేదంటూ మహారాజులుంగారివద్ద ఫిర్యాదు చేసిందట! దివాను "మహాప్రభూ! జమాబందీకి పంపించాను. ఖజానాలో డబ్బులేదు. ఈ రోజు సాయంకాలానకే కరణాలు, సముద్దార్లూ రూపాయలకావిళ్లు పట్టుకొని తమ అస్థానానికి వచ్చే యేర్పాటుచేశాను. తమరు ఖుద్దున బహుమతి యిప్పించవచ్చు" అని మనవి చేశాడు. ఇల్లాటి ఏర్పాటుకూడా ముందుగానే జరిగించాడు ఆయన.

సరిగ్గా ఐదుగంటలకి మహారాజులుంగారు దర్బారులో తఖ్తు అధిష్ఠించారు. ఒకొక్కరివిన్యూ యినస్పెక్టరూ — అంటే — సముద్దారూ కరణాలవెంబడి వచ్చే రూపాయిలకావిళ్లతో వచ్చి మహారాజులుంగారికీ, దివానుగారికీ నమస్కారం చేసి రూపాయిలు కుమ్మరించి రసీదు తీసుకుని వెళ్లిపొయ్యేవాడు. ఇలా ఒక గంట జరిగింది. రూపాయిల కొట్టు పడింది. అప్పటికి గాని లక్షా పూర్తికాలేదు. మహారాజులుంగారి దృష్టి ఆ పోకమీదనే వుంది. 'ఇందరు ఇంత ప్రయత్నంతో కష్టించి తెచ్చిన యీ పోకంతా ఒక భోగందాని వశం చేయడమా? అనే ఆలోచన కలిగింది వారికి! దివాను అన్నాడు 'మహాప్రభో! జమాబందీ వచ్చింది. లక్షా పూర్తయాయి. ఇక యేలినవారి-యిష్టంప్రకారం జరిగించవచ్చు' అని ప్రభువు ఏమీ చెప్పక దిగ్గున లేచిపోయాడు. భోగందానినోట్లో కరక్కాయ పడింది.

తరవాత ఏ స్వల్పంతోనో దాన్ని తృప్తిపరచి ఉంటారు ప్రభువులు!

ఇలాంటి దివానుకి వ్యతిరేకంగా అనిష్టంగా మహారాజులుంగారు ఏమి జరిగించగలరు?

అంచేత గెలు పెప్పుడూ దివానుదే!

విశ్వాసపాత్రుడైన ఇటువంటి దివాను వ్యవహారాలని చూసుకోవడంచేతే అభినవాంధ్రభోజు లైన ఆనందగజపతిమహారాజులుంగారు అనవరతమూ విద్యాగోష్ఠిలోనే ఆనందించేవారు.

*　　*　　*



రామావధాన్లుగా రంటే శ్రౌత,స్మార్తాల్లోనూ, అధ్యయనంలోనూ అఖండుడన్న మాట! ఆ రోజుల్లో గంజాం, విశాఖపట్నం జిల్లాల్లో ఆయనకి పైచేయి లేదు. కాబట్టే యీయన పెంకో బులుసు పాపయ్యశాస్త్రి గారికే ప్రసిద్ధి వచ్చింది; కాబట్టే వేగు రామావధాన్లుగా రయినా అ దెవరికీ తెలీదు. పాపయ్యావధాన్లుగా రనేదే లోకంలో వారి కున్న పేరు.

జీవికకోసం రామావధాన్లుగారు స్వగ్రామమైన గరికెవలస అగ్రహారం విడిచి పట్నం చేరుకుని రాజాశ్రయం సంపాదించి మహారాజులుంగారిపురోహితవర్గంలో స్థానం ఆక్రమించుకున్నారు.

రోజూ జరపవలసిన ఔపాసనాగ్నిహోత్రాల్ని తదితర స్మార్తకర్మలనీ జరపడానికి కోటలో పాపయ్యావధానులుగారిదే యాజమాన్యం!

అనేకపర్యాయాలు సుస్వరంగా ఇంపుగా వుండే వీరి వేదపారాయణాన్ని విని, మహారాజులుంగారు అగ్నిహోత్ర గృహానికి వచ్చి నిహితకృత్యాల్లో వీరికి గల శ్రద్ధని పరిశీలించి ఆనందించేవారు. అవధాన్లగారిమీద అనేకమైన అభిమానం కలిగింది క్రమశః ప్రభువులకి.

లక్ష్మీకటాక్షం ఎక్కువ లేకపోయినా ఆ అభిమానమే పదివేలంటూ మురిసిపోయేవా రవధాన్లుగారు!

అయినా దరిద్రం అనుభవించలే దాయన! అద్దెకొంపబాధ లేకుండా అయ్యకోనేటి తూర్పుగట్టున విశాలమైన స్వంతయిల్లూ; అతిథి, అభ్యాగతుల ఆదరణా; పెద్ద కుటుంబం; ఇం కేం గావాలి?

మహా రాజులుంగారు ఎక్కడికైనా 'క్యాంపు'కు వెళ్లారంటే అవధాన్లుగారు కూడా వెనకాల ఉండవలసినదే.;

* * *

మహారాజులుం గారు భీమునిపట్నం క్యాంపుకేసి వారంరోజులకి పయిగాయింది.

పదోనాటోజుని తిరిగివస్తామని కబురన్నా కేరు.

అసలు దివానుగారికే తెలీదు ఏ సంగతిన్నీ.

బుధవారానికి, బుధవారం యెనిమిదీ, లక్ష్మింవారం తొమ్మిదీ, సుక్కురారం పదీ— ఆ పదోరోజు వుదయం వక సిపాయి దివానుగారింటికి పరిగెత్తుకుపోయి—అంటే వారియిల్లు కోటకి పదిగజాల మేరలో వుంది లెండి!—మహారాజులుంగారు వస్తున్నారని మనవి చేశాడు.

దివానుగారు వాకబుచేయగా వాడుచెప్పిందదీ. తాను కోట దక్షిణపు బురుజుమీద గస్తీ తిరుగుతూ వుండగా చింతలవలస మెరకల మీద రెండుజోడుగుర్రాల బగ్గీ, ముందూ, వెనకా తురుపుసవార్లూ చూచాయగా కనిపించారనీ.

తొందరగా కోటుతొడుక్కొని తలపాగా పెట్టుకుని కనబడినవాళ్ల నల్లా హెచ్చరిస్తూ, సందేహం తీర్చుకోడానికి తానూ కోటబురుజు ఎక్కి కోసుదూరంలో వున్న తురుపులనీ, బగ్గనీ, చూసి, హడావుడిగా దిగి అంతా తగిన సరంజామాలో వుండాలని హుకుం జారీ చేశా డాయన.

కోటగోపురంమీద ఢంకా, నౌబత్తులు మోగుతున్నాయి. మోతీమహలు బయట ఉద్యోగస్థులందరూ ప్రభువుగారిని ఎదురుకోడానికి బారులుతీర్చి నిలిచివున్నారు.

దేవపూజ ముగించి పూజారి తీర్థప్రసాదాలు పట్టుకొని ఎదురుగా నుంచున్నాడు. వేదపండితులు విభూతి పెండికట్లు ధరించి శాలువలు కప్పుకుని వేదపారాయణం ప్రారంభించారు.

ఇలా జరిగించటం అప్పటి ఆచారం!

---

బగ్గీ తురుపుసవార్లతో మోతీమహలు చేరింది.

ఉద్యోగస్థు-----గా దుస్తుల్నీ, పెదవుల్నీ సవరించుకుంటున్నారు. జగన్నాథరాజు గారు—అంటే—దివాను గబగబా దగ్గిరికి వచ్చి బగ్గీ తలుపు తీసి చేతులు జోడించుకు నిలుచున్నారు.

బగ్గీలోంచి దిగినవా రెవరూ?

మహారాజులుంగారు కాదు. వారి పురోహితులు రామావధాన్లుగారు!

నుదుట విభూతి పెండికట్లతో బిళ్ళగోచీ నీర్కావి దోవతితో చంకలో అంగవస్త్రంతో పైమీద నీర్కావి వాణీతో ఆ విగ్రహం బగ్గీలోంచి దిగి ఈ ఆర్భాటం అంతా అర్థం కాక నిశ్చేష్టతతో నిలిచిపోయింది!

దివానూ కొయ్యబారి నిలిచిపోయేడు.

భోగం అంటే ఏమిటో ఎరగని ఆ చాదస్తపు బ్రాహ్మడికి పదిహేను నిముషాలపాటు రాజభోగం జరిగింది.

తడబడినమాటలతో ఆయన దివానుగారితో మహారాజులుంగారు వెనుకనుంచి వస్తారట! ముందు నన్ను వెళ్ళమన్నారు? అని మనవి చేశాడు.

దివాను తనలో అనుకున్నాడు చిన్నబోయిన మనస్సుతో—'యీసారి మహారాజులుంగారిదే గెలుపు' అనీ, 'తన్ను గెలవడానికే యీ పంగిడీ అంతా పన్నే'రనీ.

(ఇది ౫౦ ఏళ్ల క్రితం జరిగినకథ)

31-వ పేజీ తరువాయి

మయిన బ్రహ్మానందము వీని యన్నిటికంటెను విలక్షణ మయినదని నిరూపించినది. కావుననే వ్యాఖ్యాత "అవిద్యావృత స్వరూపానందానాం" అని యీ యానంద విశేషముల యవిద్యావృతత్వమును నిర్దేశించుచున్నాడు. అకామహతుండైన శ్రోత్రియుని యం దీయవిద్య దగ్ధ బీజతుల్యముగ నశించునుగావున వానికే బ్రహ్మానందసిద్ధి యగును. కావున నవిద్యావృతుండైన జీవుని యానందముగూడం గారణ గుణ సంక్రాంతినొంది యవిద్యావరణము కలదియే యగును.

అయినచో రసమునకుం బ్రకాశానందసంవిద్రూపత యెట్లు ప్రాప్తించుననంగా, నా యానంద సంవిత్తు జీవలక్షణములైన దోషములకుం గట్టుబడినదేయని వ్యాఖ్యానము చేసికొనవలసియుండును. లేదా "అంశో నానా వ్యపదేశా" దిత్యాది వ్యాససూత్రమును వివరించు పట్టున "అంశ ఇవ అంశః" అని చెప్పిన చొప్పున ప్రకాశానంద సంవిద్రూపమువంటి ప్రకాశానంద సంవిద్రూపమని యైనను నర్థము చెప్పికొనవలసియుండును.

కావుననే రసములు త్రివర్గఫలకములనియు, నొక్క శాంతరసము మాత్రమే మోక్షఫలక మనియు నాలంకారికు లుపదేశించినారు. "అత్ర చతుర్వర్గమధ్యే సర్వప్రాణి సులభస్య కామస్య సర్వహృదయంగమత్వాత్ ప్రథమం శృంగారః. తత స్తజ్జన్యత్వేన హాస్యః, తత స్తద్విరోధిత్వాత్ కరుణః, తత స్తన్నిమిత్తభూతో ఽర్థప్రధానో రౌద్రః, తతో ఽర్థకామయో ర్ధర్మమూలత్వా ద్ధర్మప్రధానో వీరః, తస్య భీతాభయప్రదానసారత్వా త్తదనంతరం భయానకః, తత స్తత్కారణభూతో బీభత్సః, వీరాక్షిప్తభయానకా ద్యనంతరం వీరరసఫలభూతో ఽద్భుతః, త్రివర్గఫలక రసానంతరం మోక్షఫలక శ్శాంతరసః."

ఇందు రౌద్ర మర్థప్రధానముగాం జెప్పంబడినది. కాని యిది లయాత్మక మనియుం, దమోగుణవిశిష్ట మనియు నా యభిప్రాయము. కాని యీవిషయమునం బలువిధములగు నభిప్రాయభేదములు గలవు. కరుణరసము హాస్యమునకు విరోధిగాం జెప్పి, యా విరోధగుణము చేతనే దానికిం బ్రాధాన్య మిచ్చిరి. కాని కొందఱు దీనిని రౌద్రమువలన జన్యమని వ్రాసిరి. ఇంతవఱకు బ్రకృతమునకు వత్తము. మోక్షఫలకమైన శాంతరసమునకుం బ్రకాశానంద సంవిద్రూపత యేర్పడవచ్చును. కాని యనుభూతిదశలో నుపాధిసంవలితమై యున్నప్పుడు దాని నట్లు చెప్పుటకు వీలుండదేమో. ఎట్లయినను గొందఱాలంకారికులు శాంతమును రసముగానే యెన్నలేదు. "శాంతవర్జ మష్టౌ రసాః" అని ధనికాదుల యభిప్రాయము. దీనిని రసగణమునుండి తొలంగించి, వైరాగ్యబోధోపరతు లాలంబనము గాం జెలంగు బ్రహ్మోపాసనముగా స్వీకరించినచో నీ విరోధమే నశించును. కావుననే శమము తక్కిన స్థాయుల యభావాత్మక మయినదన వచ్చునని మొదటనే చెప్పియుంటిని.

ఎట్లయినను లౌకికుల యనుభవములో నిది సుఖస్వరూపముగాం గానవచ్చుచున్నది. అట్టిచో లయాత్మకములైన రౌద్ర బీభత్స భయానక కరుణరసములు సుఖస్వరూపము లెట్లగునని ప్రశ్నింపవచ్చును. ఈ యంశము నాలంకారికులే వివరించిచెప్పిరి. కరుణాదులయం దశ్రుధారాపతనాదు లున్నను నది సంభోగమునందు దంతసంఘట్టనాదుల వలనం గలిగిన యశ్రుపాతమువంటి దనిరి. దీనిని కుట్టమిత మందురు. అం దనుభూత మగుచున్నది సుఖమే. ఆ యశ్రుపాతము వట్టి దేహసంబంధి. మనసుమాత్ర మానందమునే యనుభవించుచున్నది. * అట్లే కరుణాదిరసము లన్నియు నానందవికారములే యనవలయును. మఱియు నింకొక విశేషముకలదు. ఈ రసములు సృష్టిస్థితిలయాత్మకములైన సత్త్వ రజస్తమో గుణముల నాశ్రయించి ప్రవర్తించుచున్నవి. ఈ గుణముల సంయోగము కలిగినప్పుడా యానందమే యిన్ని వాసనలుగాం బరిణమించి స్థాయులని పిలువంబడుచున్నది. తరువాత నవి యనుభవదశలో రసరూపమును బొందుచున్నవి. ఇట్లు త్రిగుణ విశిష్టములైన యీ యష్టరసములును గుణభేదములచేత నిరువదినాలుగు విధము లగుచున్నవి. ఒకొక్క రసమునం దీ మూండు గుణముల సాన్నిధ్య ముండుటచే నుత్తమ మధ్యమాధమత్వములనుగూడం బొందుచున్నవి. రజోగుణము నాశ్రయించినప్పుడు సృష్టిశీలమును, సత్త్వగుణము నాశ్రయించినప్పుడు స్థితిశీలమును, దమోగుణము నాశ్రయించినప్పుడు లయశీలమును నగురసము ఉత్తమ మధ్య మాధమత్వములను బొందుచున్నది. కావుననే కేవలము తమోగుణము నాశ్రయించిన శృంగార రసాన్వితములైన కావ్యములను మనవారు హేయములుగాం బరిగణించుచు వచ్చిరి. ఒక్క శృంగారరసమే యననేల? తమోగుణ విశిష్టములైన సర్వరసములును బరిత్యాజ్యములే యగుచున్నవి. తమోగుణమునం దంధత్వమున్నది. రాగాంధత్వము రసము కానేరదుగదా! అది జగద్వ్యాపారలయహేతువు. ప్రపంచమును ధరించుచున్న నిత్యధర్మమున కది ప్రతిబంధకము. కావున నది పరిత్యాజ్యము. ఇట్టి కార్యములనుగూర్చియే 'కావ్యాలాపాంశ్చ వర్జయే' త్తను నిషేధశాస్త్రము జనించినది. ముద్రారాక్షసము నసత్కావ్యముగాం బరిగణించుట కిదియే హేతువై యుండవచ్చును. అందు తమోగుణ విశిష్టములైన వీరరౌద్ర రసము లభివర్ణింపంబడియున్నవి. బ్రాహ్మణుండైన చాణక్యుండు తన నిత్యధర్మమయిన శమమును బరిత్యజించి యకాండ తాండవము గావించుటచే నం దభివర్ణితములైన వీరరౌద్ర రసములకుం దమోగుణ మయత్వ మావహిల్లినది.

ఇట్లు జగదంతరంగమున సమస్తజీవుల నాశ్రయించి, చరాచర వ్యాప్తమయి యవ్యాకృతరూపమున నున్న రసశబ్ద పర్యాయవాచ్యమయిన యీ యానంద సంవిద్విశేషమును బీజావస్థనుండి ప్రచురమయిన యనుభవావస్థకుందెచ్చి, చర్వ్యమాణము నొనర్చు సంవిధానభేదములే కళలని ప్రపంచమున వ్యవహరింపంబడుచున్నవి. రసశబ్ద వాచ్యమైన యీ విజ్ఞానవిశేష మొక జీవియందుండి మఱియొక జీవియందుండదా? ఇది ప్రపంచ శరీరపంచక మనందగిన పంచ మహాకోశముల నుద్దీపింపం జేయుచున్నది. చరాచర రూపమైన ప్రపంచ వ్యవహార మంతయు దీనియందు నిమగ్నమై యున్నది. ఇది ప్రకృతియొక్క యుత్తేజితావస్థ. ప్రకృతి యందలి సౌందర్య ఖనులన్నిటిని ద్రవ్వి యందలి మణికాంతి పుంజముల నెల్లం దనయం దంకితము చేసికొన్న మహాకాంతిరాశి యిది. ఇట్టిదాని నుద్దీపిత మొనర్చి చర్వ్యమాణ మగు నట్లు వ్యంజింపం జేయు రచనా విశేషమును కళయని ప్రాచీను లేర్పాటుచేసిరి. ప్రాచీన సంప్రదాయము ననుసరించి కళ లఱువది నాలుగు. ఇవి యన్నియు వానివాని శక్తివిశేషము ననుసరించి తదధిష్ఠాతల యనుభూతి విశేషముల తారతమ్యముల ననుసరించి, వాని వాని జ్ఞానైశ్వర్యభోగ్య విషయతారతమ్యము ననుసరించి కళాసముదాయమునం దుత్తమ మధ్యమాధమత్వము లేర్పడుచున్నవి. ఈ కళాప్రపంచమునందుం గావ్యకళ యుత్తమోత్తమముగాం బరిగణింపం బడుచున్నది. గానము, చిత్రలేఖనము, అభినయము, స్థాపత్యము ము

న్నను కళలే జగద్విఖ్యాతమైన యఖండరసమును వ్యంజింపఁజేయుశక్తిని బట్టి వానివానికిఁ దగిన గౌరవస్థానములు వచ్చినవి. కావ్యకళ వీని యన్నిటికంటె నుత్తమస్థానము నాక్రమించి యున్నది. దీనికిఁ గారణముల నారయుదము.

జగత్సృష్టిక్రమములో శబ్దసృష్టి ముందుగా, జరిగినదని శ్రుతి చెప్పుచున్నది. "తస్మాద్యజ్ఞాత్సర్వహుతః, ఋచస్సామానిజజ్ఞిరే,ఛందాగ్ం సి జజ్ఞిరే,తస్మాత్,యజుస్తస్మాదజాయత" యని పురుషసూక్తమునఁ బరమేశ్వరుఁ డానతిచ్చియున్నాఁడు. శబ్దము ఆకాశమునకు గుణము. ఆకాశము పరమశివుని యష్టమూర్తులలోఁ బ్రథమమైనది. ఆయన ఢక్కానినాదమున నవపంచవారాహతములై పదునాల్గు మహేశ్వర సూత్రములను వర్ణసమామ్నాయ రూపమున సముద్భవించినవి. "అ ఇ ఉ ణ్-ఋ ఌ క్"ఇం దకారము వాయు బీజము. ఇ ఉ ఋ ఌ క్కులు క్రమముగా నగ్నిపృథివీజలాకాశబీజములు. ఇట్లు క్రమముగాఁ బంచభూతాత్మకమయిన వర్ణసమామ్నాయము పరమేశ్వరుని ఢక్కానినాదమునుండి సంభవించినది. పరమేశ్వరశబ్ద వివర్తమయిన వేదరాశికి మొదట నోంకార ముచ్చరితమయినది. ఈ ప్రణవమునుగూర్చి మహర్షు లనేకు లనేక వ్యాఖ్యానములు చేసిరి. ప్రథమవేదమయిన ఋగ్వేదమునకు మొదట 'ఓం అగ్నిమీళే పురోహితమ్" అని అగ్నిస్తోత్రము చేయఁబడినది. అగ్ని వాగధిష్ఠానదేవత. అతఁడు సర్వదేవతలకు ముఖము. "అగ్నిర్ముఖావై సర్వా దేవతాః" ప్రణవమును వీడినచో నందును ప్రథమమున నకారమే యుచ్చరితమయినది. ప్రణవమయిన యోంకారమునందుఁ గూడ బ్రహ్మస్వర మకారమే. అకారము బ్రహ్మవాచకము. మకారము జీవవాచకము. ఉకారమేవకారార్థకము. ఇట్లు ప్రణవము జీవబ్రహ్మైక్యమును బోధించుచున్నది. ఈ యకారమునుండియే సర్వవర్ణసమామ్నాయము స్థితిగాంచినది.

ఈ వాగ్రూపమయిన శబ్దబ్రహ్మము యొక్క యధ్యాత్మరూపములోఁ జాతుర్విధ్యము చెప్పఁబడినది. శబ్దబ్రహ్మము పరా పశ్యంతీ మధ్యమా వైఖరీ వాణులని చతుర్విధముగాఁ బ్రవర్తించుచున్నది. మూలాధారస్థితమయి వహ్నిదేవతాధిష్ఠితమయి పరావాక్కును, నాభిపర్యంతమును బవనప్రేరితమగుచు నీశ్వరాధిష్ఠితమయి యుండునది పశ్యంతీవాక్కును, హృదయస్థాన పర్యంతమును ప్రేరితమగుచు హిరణ్యగర్భాధిష్ఠితమయియుండునది మధ్యమావాక్కును, ఆస్యపర్యంతమును గాయాగ్నిప్రేరితమగుచు నకారాదిక్షకారాంతవర్ణ సమామ్నాయ గోచరమగుచుండునది వైఖరీవాక్కును నాఁబరఁగుచున్నది.
ఈ వైఖరీవాక్కే సమస్త భాషారూపముల నొంది ప్రపంచమునఁ బ్రవర్తించుచున్నది.

ఇట్లు సర్వ జగదధిష్ఠానమయిన పరబ్రహ్మవస్తువే శబ్దబ్రహ్మరూపమున వివర్తమునొంది శబ్దప్రపంచమున వెలసియున్నది. ఈ వివర్తదశలో జగత్ప్రపంచకోశములకు నధిష్ఠాన దైవతములైన యవ్యాకృత సూత్ర హిరణ్యగర్భాంతర్యామి విరాట్టులే శబ్దప్రపంచమునఁ గోశతుల్యములైన పరాపశ్యంతీ మధ్యమా వైఖరీ వాక్కుల కధిష్ఠానములుగా నభివర్ణింపఁబడియున్నవారు. వస్తుతః శబ్దప్రపంచమును, బూర్వోక్తమయిన రసప్రపంచమునుగూడ నసత్తులే; అవ్యక్తము యొక్క విలాసములే. ఇట్లు వాక్ప్రపంచమునకును సర్వ జగత్పరిపూర్ణమయిన రసప్రపంచమునకును సన్నిహిత సంబంధమేర్పడియున్నది. అయితే వ్యవహార దశయందు మాత్రము వాక్ప్రపంచ మాధారముగను, రసప్రపంచ మాధేయముగను భాసించుచున్నవి. తత్త్వావస్థయందు రెండును బరమార్థ వస్తువు యొక్క రెండుముఖములే యైన యీ వాగ్రస ప్రపంచముల యవినాభావ సంబంధము నెఱుకసేయునదియే కావ్యకళయని పిలువఁబడుచున్నది. ఇదియునుగాక జనకరసములైన శృంగారవీర బీభత్స రౌద్రములు వరుసగా సామర్గ్యజురథర్వములవలన నుద్భూతములైనవని యాలంకారికులు నిర్దేశించియున్నారు. ఈ యంశమునుబట్టియే వాగ్రస ప్రపంచములకుపాదాన మొక్కటియనియుఁ, గావుననే కావ్యకళ యన్నికళల కంటెఁ బ్రధానస్థానము వహించుట కెక్కువ యధికారము కలదనియు వ్యక్తమగుచున్నది.

వాగ్రసముల కవినాభావమగుటను బోధించుటకే కవిలోకగురువైన వాగనుశాసనుఁడు 'సా వాగ్యా రసవృత్తిః' అని సూత్రించెను. "యా వాక్ రసవృత్తిః రసప్రత్యాయన ప్రవణా, రసవ్యంజికా కైశికీ త్యాది వృత్తిర్యస్యా మితివా, రసవ్యంజక ధ్వని వ్యాపారో యస్యా మితివా రసవృత్తిః, సైవాత్ర వాగిత్యుచ్యతే.' ఇచట వాక్చబ్దము చేత రసవ్యంజకమైన వాక్యమే గ్రహింపఁబడినది. "తిఙ్సుబంతచయో వాక్యం క్రియాకారకాన్వితా" యను, మీమాంసకులు చెప్పిన వాక్యలక్షణమిందుఁ గుదురదు. వాక్యమహిమవలనఁ గలిగిన ధ్వనివ్యాపారమే వాక్యతాత్పర్యమగునని యానందవర్ధనాచార్యుల సంప్రదాయార్థము. వక్తృబుద్ధి సన్నిధాపితమైనదియును, వాక్యముచేత నవగమ్యమును నగు వాక్యార్థమైన రసాదిరూపమే తత్పదార్థమున కర్థము. తత్పరములన్నఁగాఁ దదాసక్తములైన విశేషణములు. వాని భావము తాత్పర్యము. ఈ రసాదులను వ్యంజింపఁజేయునదియే, లేదా ధ్వనించునదియే వాక్యము, లేదా వాక్కని చెప్పవలయును. 'వాక్యం రసాత్మకం కావ్య'మ్మను నాలంకారికోక్తియు దీని కుపోద్బలకమై యున్నది.

రసము సహజముగ జగత్పరిపూర్ణమై యుండియు నీకావ్యకళయందు వాక్కుచేత వ్యంజింపఁజేయఁబడుచున్నది. రసము జగన్మనోధర్మము. అది యుద్దీపితమైన మనోఽనుభావావస్థ. దానిని వాక్కు స్ఫురింపఁజేయును. బీజావస్థలోనుండి యనుభవావస్థలోనికి వచ్చునట్లు ప్రచలితము గావించును. కావుననే రసమారోప్యమని చెప్పఁబడినది. కాని వ్యవహారావస్థయందు వాక్యరసముల కాధారాధేయభావమును, నభేదావస్థయును జెప్పఁబడుచున్నవి. ఇట్లు వాక్కువలన రసమును వ్యంజింపఁజేయు వృత్తినే వ్యంజన యనిరి. వ్యంజకమైన శబ్దమువలన వ్యంజనావృత్తి ద్వారా వ్యంగ్యార్థము స్ఫురించుచున్నది. ఈవ్యంగ్యార్థము వాక్యమునందు ప్రాధాన్యము నొందినప్పుడది ధ్వనియని చెప్పఁబడుచున్నది. ఇది యుత్తమమైన కావ్యము. ఇట్లు ధ్వని యను నర్థవ్యాపారము వాక్ప్రపంచమునకును, రసప్రపంచమునకును సేతువు నిర్మించి రెంటికిని వ్యవహారదశయందు గూడ నభేదత్వమును సాధించుచున్నది. అభిధామూలకమయిన యీ ధ్వనియను వ్యంగ్యార్థమే సంలక్ష్యక్రమవ్యంగ్యము నసంలక్ష్యక్రమవ్యంగ్యము నని రెండు తెఱఁగులై వస్త్వలంకారములను ధ్వనించునపుడు సంలక్ష్యక్రమమయి, రసాదులను ధ్వనించునప్పుడసంలక్ష్యక్రమమగుచున్నది. అసంలక్ష్యక్రమ వ్యంగ్యమే రసమని పిలువఁబడుచున్నది. ఇట్లు వాగ్రసముల కభేదము సాధించు నీ యసంలక్ష్యక్రమవ్యంగ్య ముత్తమోత్తమమగుటచే కావ్యకళకు

వాయవ్యప్రాంతమునయున్నది. ఈ రసాది ధ్వని ప్రబంధ, వాక్య, పద, పదైకదేశ కచనా, వర్ణగతత్వముచేత షడ్విధము లగును గనుక ప్రబంధవాక్యపదములే గాక రచనా పద్ధతియును, తుదకు వర్ణములునుగూడ రసవ్యంజకములై యుండవలయునట. కావుననే కాళిదాస మహాకవి శకుంతలచేత నగ్నిప్రదక్షిణము గావించు సందర్భమున గాశ్యపుని యాశీర్వచనముగా, "అమీ వేదింపరితః క్లప్తధిష్ణ్యాః సమిద్వంతః ప్రాంతసంస్తీర్ణదర్భాః, అపఘ్నంతో దురితం హవ్యగంధై ర్వైతానాస్త్వాం వహ్నయఃపాలయంతు" అను శ్లోకమును సరిగా వేదములోని ఋక్కును వినుచుంటిమా యను భ్రమ వొడమునట్లు రచించెను. లేనిచో ప్రసాదగుణమున కాటపట్టగు కవితాకళను వెలయించిన యమ్మహానుభావునకు "పరితః క్లప్తధిష్ణ్యాః" అను కటుశ్రుతి గలిగిన పదమును బ్రయోగింప నవసరములేదు. ఇందలి వర్ణములుగూడ నగ్నిదేవతా విషయకమయిన పవిత్రత్వమును, ఛందోఽనురోధతయును వెల్లడింపవలయునని యా మహాకవి సంకల్పము.

ఈ రీతిగా జగదంతర్గతమయియున్న రసప్రపంచ స్వరూపమును, వాక్ప్రపంచ స్వరూపమును గ్రాంతదృష్టితో నవలోకించి, జగదంతరంగమున వాసనారూపమున నున్న స్థాయిభావములను దేనియత్నమైనఁ గదలించి, రసమను మధువును జగజ్జనులకుఁ బంచిపెట్టుట ప్రతిభావంతుఁడైన కవికే సాధ్యము. కావ్యకళా ప్రపంచనిర్మాణమునకుఁ గవి, వాక్కు, రసము నను నీమూఁడును త్రిమూర్తులు. కవికిని వాక్కునకును నభేదము. అప్పుడు వాగ్రసములు రెండును శేషించును. వాగ్రసములు రెంటికిని నభేదము చేసినచో రసమూర్తియైన కవి యొక్కఁడే యద్వితీయుఁడై భాసించును. ప్రపంచభానము లేనితఱిఁ జిన్మయవస్తు వద్వితీయమై భాసించినట్లు కావ్యకళా ప్రపంచము లీనము కాఁగా సర్వకళామూర్తియైన కవి యఖండరసమూర్తియై, యద్వితీయుఁడై భాసించును. కవిబ్రహ్మ పంచభూతాత్మకమగు వర్ణసమామ్నాయ ముపాదానముగాఁ, గావ్యరస మను చైతన్యమునోసి కావ్యకళా ప్రపంచమును సృష్టించుచున్నాఁడు. ఇతఁడు ప్రపంచ సౌందర్యమును గానముచేసి జగదన్నమయకోశమున కధిష్ఠానమయిన విరాట్పురుషుని దర్శించును. జగత్ప్రాణ ప్రదీపనమును గీర్తించి తదధిష్ఠానమయిన యంతర్యామిని దర్శించును. జగన్మనోధర్మఖనులను ద్రవ్వి చూపించి, తదధిష్ఠానమయిన హిరణ్యగర్భు నుపాసించును. జగద్విజ్ఞాన తేజస్సుల నుద్ఘాటనముచేసి తదధిష్ఠానమయిన సూత్రాత్మను సాక్షాత్కరించుకొనును. జగదానందరూప విశేషములను గొన్నియాడి తదధిష్ఠానమయిన యవ్యాకృతుని సన్నిధినొందును. 'నానృషిః కురుతే, కావ్య'మ్మనువాక్కు తనియందు సార్థకమగుచున్నది. దైవవశమున నీభూమికలను గడచి సద్రసస్థాయియైన శమము ననుభూతిగమ్యము నొనరించి చిదఖండకల్యాణస్వరూపుఁడైఁ బ్రహ్మస్వరూపుఁడై ప్రవర్తించుచున్నాఁడు. 'జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః, నాస్తి యేషాం యశఃకాయే జరామరణజం భయం.'

# ★ తార ★

(ఏకాంకిక)

మల్లాది అవధాని

**చరిత్ర:**—17 వ శతాబ్దమున శ్రీ ఛత్రపతి శివాజి పతాకము నెగురవేస్తూ ఉన్నరోజులు. దక్కనులో తుల్జాపూరనే నగరములో వ్యాసశాస్త్రి అను బ్రాహ్మణ పండితుడుండేవాడు. అతని కుమార్తె తార. తార చక్కని చుక్క. ఆమెకు తన ఆరవఏటనే పండరిపుర పూజారిగారి కుమారునితో వివాహమయినది. భర్త బాల్యములోనే మృతించినాడు. వైధవ్యమూ, దానితో సహా వైరాగ్యమూ వచ్చినవి. తార మతగ్రంథాలు చదువుకొన్నది. తన జీవితమును దుర్గాదేవి సేవలో గడపవలెనని సంకల్పించుకొని తాను 'మురళీ' (ఆలయ కన్యక)గా చేరినది. విషమ విషపరిస్థితులు తటస్థించినవి. ఆలయ కన్యకయున్నూ మహారాష్ట్ర యువతియున్నూ అయిన తార ఒక మహమ్మదీయుని వివాహమాడి తన ఆద్మరమును బంగరు గంటలు మ్రోగించుతూ చేరుకొన్నది.



## ప్రథమ దృశ్యము

**కాలం:** రాత్రి రెండవయామము

స్థలం: దుర్గాలయమున మంటప సోపానములు. మంటపములో [illegible] వివరములలోను ప్రమిదలలో దీపములు మిణుకుమిణుకుమంటున్నవి. మందముగా వెన్నెల.

సోపానములపై తార [illegible] మాలికను త్రిప్పుతూ ఉన్నది. క్రింద సజ్జలో [illegible] పుష్పాలున్నవి.

తారకు పదహారు సంవత్సరముల వయస్సుంటుంది. [illegible] యువతీ ప్రతిమవలె ఉన్నది. ఆమె కన్నులు నీలములవలె మెరుస్తున్నవి. [illegible] రేకులవంటి పెదవులలో [illegible] రిస్తూ ఉన్నది.

గర్భాలయములో [illegible] చేస్తూన్న ధ్యానగానము మంటపము దగ్గరకు వినిపిస్తున్నది.

ధ్యానగానము

హే! హరమోహిని!
త్రిలోక జననీ!
దయాంతరంగిణి! మా!
జననీ!
హే హరమోహినిమా!
విపత్తారిణీ!
భవభయహారిణీ!
పాపవినాశిని! మా!
జననీ
హే హరమోహిని! మా!
విశాలలోచని!
మధురదరహాసిని!
ప్రశాంతిదాయిని మా!
జననీ!
హే హరమోహిని మా!

మహిషమర్దనీ!
కాలరూపిణీ! హి
మాలయనందని! మా
జననీ
హే తారమోహిని మా!

(గర్భాలయములో నుండి తొందరగా తొం దరగా గంగ అనే ఆలయ కన్యక మంటపమువద్దరకు వచ్చినది. గంగ వయస్సు పద్దెనిమిది. చామనచాయ శరీరము.)

గంగ—తారా?

తార—ఏమి?

గంగ—ఇంతసేపూ ఎక్కడున్నావు?

తార—తోటలో.

గంగ—నీకోసమని గంటనుంచి వెతుకుతున్నాను. తోటలో యింత రాత్రివేళ ఏం చేస్తున్నావు?

తార—పువ్వులు కోస్తున్నాను.

గంగ—(ఆశ్చర్యముతో) పువ్వులా!

తార—అవును.

గంగ—అర్ధరాత్రి తోటలో పువ్వులు కోస్తున్నావా? బావుంది. అయితే ఎందుకీ పువ్వులు?

తార—చూస్తూ అడుగుతావేం? మాలిక గుచ్చుతున్నాను కాదూ?

గంగ—ఎవరికోసమని?

తార—(క్షణం నిశ్శబ్దము) గంగా! నువ్వు కలలు నమ్ముతావా?

గంగ—(నవ్వి) ఇపుడా ప్రశంస ఎందుకు?

తార—చెప్పుదూ!

గంగ—కలలు నమ్మడమనగా ఏమిటో నాకు బోధపడలేదు.

తార—కలలు యథార్థంగా జరుగుతాయనే విశ్వాసముందా?




గంగ—ఏమిటే వెర్రి మాటలు? కలలు నిజమయి పోతాయా?

తార—నీకు నమ్మకంలేదన్నమాట.

గంగ—నేనేకాదు యింకెవరయినా నమ్ముతారూ?

తార—నేను నమ్ముతాను. నాలుగేళ్లక్రిందట ఒకరాత్రి నాకొక కల వచ్చింది. ఆకలలో ఒక మహా భీకరస్వరూపం వొకటి మా అమ్మను మ్రింగివేసింది. మర్నాటి సాయంత్రం మా అమ్మ చని పోయింది.

గంగ—ఆఁ!

తార—గత సంవత్సరం స్వప్నంలో మా తమ్ముడు నిద్రపోతున్నాడట. ఒక అఘవిపంది వచ్చి వాడిరొమ్ము చీల్చినట్టు కలగని కేకలువేసి నిద్రనుంచి లేచాను. మూడురోజుల తరవాత కాలుజారి నదిలో పడిపోయి మా తమ్ముడు చనిపోయినాడు.

గంగ—ఎందుకా విషయాలన్నీ తలుచుకోవడం?

తార—నిన్నరాత్రొక కలగన్నాను.

గంగ—ఏమిటది?

తార—ఈరాత్రి మూడోజాములో నేను మృత్యువుగళాన పూలమాలిక వేసినట్టూ, మృత్యువు నన్ను గాఢంగా కౌగలించుకున్నట్టూ స్వప్నంవచ్చింది—ఈరాత్రి తప్పదు. మూడో జాములో నేను చచ్చిపోతాను.

గంగ—(వికావికా నవ్వి) నీకు రోజు రోజుకీ వెర్రి ముదిరిపోతూంది.

తార—వెర్రికాదు. నాకు వచ్చే ప్రతీ కలా నిజమవుతుంది.

గంగ—(నవ్వును ఆపుకొని) అయితే మరి యీ పూలమాలిక ఎందుకు?

తార:—నిన్నరాత్రి కలలో...

గంగ:—మృత్యుగళాన పూలమాల వేశావూ? చాల్లే. ఊరుకో. ఎవరయినా వింటే నవ్విపోతారు. అవుసుగాని మనవాళ్లు హాయిగా ధ్యానగీతలు పాడుకున్నారు. రారాదూ?

తార:—నాకు పాటలురావు.

గంగ:—నేర్చుకో!

తార:—ఉత్సాహం లేదు.

గంగ:—పోనీ మేమందరమూ పాడుతూ ఉంటాము. నువ్వు నిశ్శబ్దంగా దేవికి నమస్కారం చేస్తూ ఉందువుగాని!

తార:—దుర్గామాతకు నేనెన్నడయినా నమస్కారం చెయ్యడం చూశావూ?

గంగ:—లేదు.

తార:—నేను చెయ్యను.

గంగ:—(ఆశ్చర్య చకితురాలై) చెయ్యవూ? నువ్వు 'ముర్లి' (ఆలయ కన్యక) వి కావా?

తార:—అవును.

గంగ:—ఇవాళ విచిత్రంగా మాటాడుతున్నావే!

తార:—విచిత్రమేమీలేదు. ఈ రాత్రే నేనెలాగూ చనిపోతాను గనక నా ఉద్దేశ నీకెరింగించి వేశాను.

గంగ:—దుర్గామాత కెందుకొకు నమస్కరించవు?

తార:—నేను మా అమ్మ కన్న పిల్లను కాను. పెంచింది ఎరగను. నాకు మా అమ్మ దగ్గర భయం వుండేదికాదు. దుర్గామాత దగ్గరా నాకు భయంలేదు.

గంగ:—మహిషమర్దని అయిన కాళీదేవిని చూస్తే నీకు భయంలేదూ? తారా! నీవెటువంటి నిందావాక్కులు మాటాడుతున్నావో తెలుసునా?

తార:—నేనెవర్నీ నిందించను. నాల్గేండ్ల క్రింపట నన్నొకతల్లి విడిచిపోయింది. ఈరాత్రి నేనొక తల్లిని విడిచి వెళ్లిపోతాను.

గంగ:—ధ్యానానికి రావా?

తార:—మాలిక గుచ్చుకుంటాను. గనక రాలేను.

గంగ:—సరే (వెళ్లిపోయినది)



## ధ్యానగానము

(గర్భాలయంలోనుండి వినబడుతున్నది)

పరాశక్తీ!
త్రయీమూర్తీ!
స్ఫురచ్చంచల దృగంచలా!
జనని
దుర్గా!

(ఆలయ ప్రధానార్చకుడు మోరో తిరుమళ్ వచ్చి తారవెనక నిలుచున్నాడు. అతడు ముప్పదినాల్గు వత్సరములు దాటినవాడు. స్ఫురద్రూపి. పండితుడు)

తిరుమళ్—తారా!

తార—(చూచి దిగ్గునలేచినిలచి) జీ!

తిరుమళ్—ఎవరికోసమని ఆపూలమాలిక గ్రుచ్చుతున్నావు?

తార—ఇది...ఇది...

తిరుమళ్—దుర్గామాయి కోసమా?

తార—కాదు!

తిరుమళ్—(మందహాసముతో) మరి?

తార—దీనిని...(తడబాటు)

తిరుమళ్—నాకు తెలుసును (హాసము) పురుషకంఠము నామాలికతో అలంకరిస్తావు. ఎవరా ధన్యాత్ముడు?

తార—(నవ్వినది)

తిరుమళ్—నవ్వుతున్నావా? తార! ఆ మాలికను నాగళాన్నే వేయకూడదా?

కూడదు...కూడదు...

తిరుమళ్—ఎందుచేత?

తార—చెప్పలేను.

తిరుమళ్—వితంతువునని సందేహిస్తున్నావా?

తార—నేను వితంతువు ననేవిషయం నా భర్త చనిపోయినప్పుడే నా ఆరోఏటనే మరిచిపోయినాను.

తిరుమళ్:—మంచిపనే చేసినావు! అయితే మరెందుకు సందేహిస్తావు? ఆలయ కన్యకను కదా పవిత్రతకు భంగం కలుగుతుందేమోననీ దుర్గకు ఆగ్రహం వస్తుందేమోననీ భయపడుతున్నావా!

తార:—లేదు, నాకు దుర్గ దగ్గర భయం లేదు.

తిరుమళ్—మరెందుకు సందేహం? మార దూరంగా వెళ్లిపోతావేమి తారా! దగ్గరకు రా.. (ముందుకు నడచి ఆమెచేతిని పట్టుకొనబోయి) నాగళాన ఆమాలాను...

తార:—ఆ మాటమాత్రం అనవద్దు!

తిరుమళ్:—ఏమి?

తార:—ఈ మాలను మీ గళాన వెయ్యను. మిమ్మల్ని నేను స్పృశించను.

తిరుమళ్:—ఎందుకంత పగ నాపైని?

తార:—మీరు మృత్యువు కారు!

తిరుమళ్:—(ఆశ్చర్య చకితుడై) ఏమిటీ?

తార:—మీరు మంచివారు; పండితులు; దయాదాక్షిణ్యాలు గలవారు; మానవులు! కాని మీరు మృత్యువు కారు!

తిరుమళ్:—నీ మాటలు నాకు బోధపడ లేదు.

తార:—ఈ మాలికను మృత్యుగళాన వేస్తాను. (మెల్లగా సిగ్గుతో) నేను... నన్ను...మృత్యువే కౌగలించుకుంటాడు... ఇతరులను నేను స్పృశించను (పూలమాలను పట్టుకొని చరచర వెళ్లిపోయినది.)

తిరుమళ్:-(నిశ్చేష్టుడైనిలచిపోయినాడు)

(మంటపము వెనుకనుండి వికవిక నవ్వు వినబడుతున్నది.)

తిరుమళ్:—(రోషముతో) ఎవరానవ్వు!

(మంటపము వెనుకనుండి గంగ వికావిక నవ్వుకొంటూవచ్చి మోరోతిరుమళ్ బుజముపైని చేయివేసినది.)

తిరుమళ్:—(కోపముతో) గంగా! ఎందుకా నవ్వు?

గంగ:—(నవ్వాపుకొనలేక) కోపగించకండి! (తిరిగి నవ్వుతూ) చాలా రసవంతంగా వుంది!

తిరుమళ్—ఏమిటి?

గంగ—(నవ్వుతూ) శృంగారం? "మృత్యువు దానితో శృంగారం"

తిరుమళ్-(చింతతో) నీమాటలు వింటే నాకు—

గంగ—కోపమెందుకు? నేను నబద్ధమాడుతున్నానా? మీ శృంగారగాథ అంతా నేను మంటపంచాటున దాక్కొని విన్నానుకాదా?

తిరుమళ్—(చిన్నబోయినాడు)

గంగ—మోరో! తార గంగవంటిదనుకున్నారు కాబోలును తమరు.

తిరుమళ్—లేదు. ఎన్నడూ అనుకోను. గంగకంటే తార చక్కనిది.

గంగ—గంగకంటే కూడా వెర్రిది!

తిరుమళ్—(నవ్వి) గంగకు వెర్రిలేదు.

గంగ—లేకుంటే తమ మాయల్లో ఎందుకు పడిపోతుంది?

తిరుమళ్—(ఆమె రెండుచేతులూ పట్టుకొని దగ్గరకుతీసుకొని) వెర్రిలేదు గనకనే!

గంగ—(తనచేతులు విడిపించుకొంటూ) దూరంగా వుండండి! చాలచాలు! ఆలయ కన్యకా అస్పృశ్యురాలు యథేచ్ఛగా మసలుతే నలుగురూ నవ్వగలరు...ఎవరో వస్తున్నారు కూడాను.

(ఆలయ కన్యకలు వచ్చినారు)

౧ వ కన్యక—(తిరుమళ్ తో) తార దుర్గార్చన చెయ్యదట!

౨ వ కన్యక—కాళీకి నమస్కారమే చెయ్యదట!

3 వ కన్యక—తార దుర్గానామం జపం చెయ్యడమయినా నేనెన్నడూ చూడలేదు.

౪ వ కన్యక—ఇవాళ మహాపుణ్య దినం దేవిముందు నృత్యంచేదాము రమ్మంటే రానంది.

గంగ—తారకు దేవీభక్తిలేదు.

౧ వ కన్యక—భక్తా? (నవ్వి) దేవీద్వేషం వుంది.

3 వ కన్యక—నా పాటవిని నవ్వింది.

౧ వ కన్యక—నామస్మరణ చెయ్యడమెందుకని నాతో అంది.

౨ వ కన్యక—తారకు వెర్రెత్తినట్టుంది.

గంగ:—క్రొత్తగాకాదు. మొదట్నుంచీ వైరంది. కాని యీ రోజు ఎక్కువ అయి పోయింది.

3 వ కన్యక:—(వణ్కుతూ) తానీరాత్రి మూడోజాములో చచ్చిపోతుందట. తనకు నిన్న కలవచ్చిందట.

1 వ కన్యక:—తన కలలన్నీ జరిగి తీరుతాయట.

తిరుమల్:—రేపటి ఉదయం తారను ఆలయంలోనుంచి పంపించివేసే ఏర్పాటులు చేస్తాను. మీరందరూ వెళ్లి దేవిముందు సంకీర్తన చేస్తూ ఉండండి!

(ఆలయ కన్యకలందరూ వెళ్లిపోయినారు. మెల్లో తిరుమల్ క్షణము నిలచి ఆలోచించి, చకచక ముందుకు నడుస్తున్నాడు.)



## ద్వితీయదృశ్యము

కాలము: ఆ రాత్రి మూడవ యామము

స్థానము: గర్భాలయ ప్రాంగణము

[దర్పణమును చేతితో పట్టుకొని ప్రతిబింబము చూచుకొంటూ తార అలంకరించుకొంటున్నది. ఆలయ కన్యకలు జానుపతితలై దేవికి ప్రార్థన చేస్తున్నారు. అర్చకులు ఆలయ పాలకులు సంకులముగా హాహాకారములు చేస్తూ తిరుగుతున్నారు.

ఆలయము బయటనుండి మహమ్మదీయుల ఉగ్రకంఠధ్వనులును ఫిరంగిధ్వనులును వినబడుచున్నవి. తిరుమల్ తారకు కొంచెము దూరములో నిలచి ఆమెవంక తదేక దృష్టితో చూస్తున్నాడు. ఒక అర్చకుడు వచ్చినాడు.]

అర్చకుడు:—(ఆకులకంఠముతో) తురకలు ఆలయాన్ని చుట్టూ ముట్టడించివేశారు. ఫిరంగి పరిచేస్తున్నారు.

తిరుమల్:—(ఆలయ కన్యకలతో) దుర్గాదేవిని మనస్ఫూర్తిగా ప్రార్థించండి!

అర్చకుడు:— ఈ ఆలయాన్ని ఇప్పుడెవరూ రక్షించలేరు. ఫిరంగి గుండ్లు పిడుగుల్లాగ పడుతున్నాయి.

—దుర్గకు అశక్యమంటూ ఏమీ ... లయాన్ని తాను రక్షించు ...

... నాడు)

... వడు)

త్రయీమూర్తీ
స్ఫురచ్చంచల దృగంచలా!
జననీ!
దుర్గా!
మహిషమర్దనీ!
కాలరూపిణీ!
మధురమృదుల విలాసినీ!
జననీ!
దుర్గా!
మహామాయా!
దయాహృదయా!
పరమపూతా! జగన్మాతా!
జననీ!
దుర్గా!

గంగ—(తొందర తొందరగా వచ్చి) మోరో! మోరో! బయట ఫిరంగి పరిచేశారట.

(బయటనుండి ఫిరంగిధ్వని, తరువాత ఏదో కూలిపోయిన ధ్వని)

గంగ—సింహద్వారం కూలిపోయింది.

ఆలయ కన్యకలు—(తడబాటు విభ్రమము భయము) ఆలయద్వారం ... కూలిపోయింది (నాల్గుదిక్కులకూ పారిపోయినారు)

గంగ—(కళవళపాటుతో) ఎవరక్కడ?

తార—నేనూ.

గంగ—ఏంచేస్తున్నావు!

తార—అలంకరించు కొంటున్నాను.

గంగ—తురకలు ఆలయాన్ని ముట్టడించారు.

తార—అవునట. విన్నాను.

గంగ—సింహద్వారం ఫిరంగిదెబ్బకి కూలిపోయింది.

తార—అవును. శబ్దంవిన్నాను (తలలో పువ్వులు తురుముకొంటున్నది)

తిరుమల్—గంగా! అర్చకులెవరూ కనబడరేమీ?

గంగ—ఇంకెక్కడి అర్చకులు? అర్చకులూ ఆలయపాలకులూ అంతా ఇందాకనే వెనక తోటలోనుంచి పారిపోయినారు.

తిరుమల్—మరి దుర్గాలయం కూలిపోవలసిందేనా?

గంగ—కూలిపోతూంది. సింహద్వారం పడిపోయింది. ఇంకోక్షణంలో దుర్గావిగ్రహం ఛిన్నభిన్నా లయిపోతుంది.

తిరుమల్—దుర్గ నెవరూ రక్షించరానికి లేరా?

గంగ—దుర్గ ... రక్షించుకోలేని దేవతను ... డమే మేలేమో!

తిరుమల్—ఆలాగనకు గంగా ... తాను. నేను దుర్గను రక్షిస్తాను-

గంగ—తురకవాడి తుపాకి గుండుతో మీరు తుత్తునియలైపోతారు. మీరు ఏకాకి... నేను పోతున్నాను (వడిగా వెళ్లిపోయినది).

తిరుమల్—తారా!

తార—ఆఁ.

తిరుమల్—నాతో రా! ఇక్కడ క్షణమయినా ఉండడానికి వీలులేదు. అందరూ అర్చకులూ ఆలయపాలకులూ కన్యకలూ పారిపోయినారు.

తార—భక్తులంతా పోయినారా?

తిరుమల్—అవును. మనంవుంటే తురకలు తుపాకులతో చంపివేస్తారు.

తార—(చిరునవ్వుతో) మరిమీరు దుర్గను ఒంటరిగా తురకలకు వప్పగించి పారిపోతారా?

తిరుమల్—ఏకాకినినేనేమి చెయ్యగలను?

తార—అయితే దుర్గావిగ్రహం నాశనం కావలసిందేనా?

తిరుమల్—(నిశ్శబ్దము)

తార—తుల్జాదేవి ఈ తుల్జాపూరు నగరాని కధిష్ఠాన దేవతకాదా? ఆమె విగ్రహం నశిస్తే పట్టణమే నశిస్తుంది.

తిరుమల్—దేవి తన్ను తానే రక్షించుకోలేకపోయినప్పుడు...

తార—మరి భక్తులెందుకు?

తిరుమల్—అదుగో అదుగో ద్వారం బద్దలు కొట్టారు. తురకలు వస్తున్నారు. పద! పద!...యింకా యీ సమయంలో అలం... మేమిటి?

తార—నేను రాను. నేనీయాలం చనిపోతాను. చక్కగా అలంకరించు చనిపోతాను. నిన్నరాత్రి నాకు కల ...

తిరుమల్—ఉన్మత్తురాలవు! ( ... నాడు.)

తార—(దర్పణములో ... అలంకరించుకో ... ముఖ ప్రతిబింబమును చూచు ... లోనికి వెళ్లిపోయినది.)

(ప్రాంగణము నిర్జనముగా ... గాను ఉన్నది. స్తంభవివరము ... దీపాలు వెలుగుతున్న జ్యోతులు ... ముగా ఆరిపోతున్నవి.

... పేలినది.

తార:— ... నిశ్శబ్దము; తరు ...స్కరించి ...

భయము ... ఫజిల్ ఖాన్ అతనివెనుక చేత ఆయుధములతో మహమ్మదీయ సైనికులు ప్రాంగణమును ప్రవేశించినారు.)

ఫజిల్ ఖాన్— ఎవరూలేరు! పిరికిపందలు! అర్చకులు తమ దేవతను విడిచిపెట్టి పారిపోయినారు. (నవ్వి) హిందువులు! భక్తులు!

ఒక సైనికుడు— ఎక్కడనయినా దాగుకొని ఉన్నారేమో!

ఫజిల్— లేదు. లేదు. నేనీ హిందువుల శౌర్యాన్నెరుగుదును. మీరు ఆలయంచుట్టూ ఉండండి. ఎవర్నీకూడా బయటికి పోనీయకండి! ఏదీ తుపాకి!

(సైనికుడు ఒకతుపాకి ఫజిల్ చేతికందిచ్చినాడు.)

ఫజిల్— (తుపాకినిచూస్తూ) మీరంతా వెళ్లండి. నేనొక్కడనే మహమ్మద్ వారిని స్మరించుకొని కాఫర్ల దేవతగుండెల్ని వ్రక్కలు చేస్తాను.

(సైనికులందరూ వెళ్లిపోయినారు.)

ఫజిల్— (ఎదురుగా గర్భగుడిలో వేదికపై నిలుచునిఉన్న దుర్గా శిలావిగ్రహమునకు తుపాకిని గురిచేసి వికటాట్టహాసముతో) కాఫర్ల దేవత చక్కని ఆడపిల్ల!

(తుపాకిని ప్రేల్చబోతున్నాడు. చటాలున లోని అంధకారములోనుంచి తారవచ్చి తుపాకికెదురుగా తనవక్షమునుంచి నిలిచినది. ఆమె చక్కగా అలంకరించుకొన్నది. స్వర్ణాభరణముల ధరించినది. నీలి పట్టుచీరను కూడా రవికను తొడుగుకొన్నది. ఆమె నడుస్తున్న పాదాల ... మంజీరములు ధ్వని ... ముక్కునను బులాకీ తళతళ మెరు...

తార. ...

తిరుమ...

తార—

తిరుమళ్— (తుపాకి దించి తారను చూస్తూ

తార— (...) ఓహో! ఎవరమ్మాయి నువ్వు?

తిరుమళ్— నే... యిలాగ నాకు ప్రత్యక్షం

పురుషకంతము

ఎవరా ధన్యాత్ము... నువ్వుతో) లేదు! తుపాకి

తార— (నవ్వి

తిరుమళ్— ...ను ఆరాతి విగ్రహాన్ని తుస్తు మాలికను ...నికి వచ్చినాను గాని నీవంటి

... కూడా

తిరుమళ్— ఎందు.

చక్కని ఆడపిల్లను హత్యచెయ్యడానికి రాలేదు. నీపేరు?

తార— తార.

ఫజిల్— తార! తార అంటే మీభాషలో నక్షత్రంకాదా?

తార— అవును.

ఫజిల్— (నవ్వి) నిజంగా నువ్వు నక్షత్రంలాగానే వున్నావు సుమా!

తార— (సిగ్గుతో తలవంచుకొని) మీచూపులోనే. కాని నేను లోకానికి మాత్రం కురూపిని.

ఫజిల్— నీ చేతులో ఆ పూలమాలిక ఎందుకు? అది ఎవరిమెడలో వేస్తావు?

తార— (క్షణము గంభీరముద్ర నిశ్శబ్దము తరువాత) మీ... మీ...

ఫజిల్— (ఆనందముతో) నా మెడలో నేనా? తారా! (చేతిలోని తుపాకి నేలకు పడిపోయినది. చేతులుజాపి ముందుకు వెళ్లుతున్నాడు.)

తార— (పూలమాలను ఫజిల్ ఖాన్ మెళ్లో వేసినది)

తార— (నిద్రలో పలవరింతవలె) నాకల నిజమయింది. నాకల నిజమయింది. నేను చచ్చిపోయినాను. నేను చచ్చిపోయినాను.

ఫజిల్— తారా! భయపడుతున్నావా? నేను నిన్ను చంపుతానా?

తార— (తెలివితెచ్చుకొని) మా దుర్గను మాతల్లిని... మాజననిని చంపుతారా? మాజనని వక్షం తుపాకితో తునియలు చేస్తారా?

ఫజిల్— (...గా) నీ కిష్టంలేని పని చెయ్యనుతారా! మీ ...ను నేనేమీ చెయ్యను.

తార— మా తల్లిని తునియలు చెయ్యరు కదూ! ఆహా! ఆహా!

ఫజిల్— నాతో మా దేశం వస్తావా?

తార— మీతో ఎక్కడికయినా వస్తాను, సప్తసముద్రాలు దాటి ఆవెనక ఎడారిలోకయినా వస్తాను. నాతల్లికి, నా దుర్గకు ఫర్వాలేదు!

ఫజిల్— మరిపద. ఇప్పుడే వెళ్లిపోదాము.

తార— పదండి. నాజనని... నా దుర్గ... నాతల్లి బ్రదికింది... కాని తార చచ్చిపోయింది. ఇదిమూడోజాము రాత్రి. కల నిజముయింది.

(ఫజిల్ ఖానుతో తారవెళ్లిపోయినది— చాలసేపటివరకు నిశ్శబ్దము. మెల్లమెల్లగా ఆలయం వెనుకనుండి

---

మోరో తిరుమళ్ వచ్చినాడు తుపాకి తీసి చూసినాడు. తరువాత ఒక ఆలయ కన్యక వచ్చినది)

తిరుమళ్— (మెల్లగా) దుర్గాప్రతిమను తురకలు బ్రద్దలు చెయ్యలేదు! తురకలు వెళ్లిపోయినారు.

ఆలయకన్యక— దుర్గాప్రతిమ చెక్కుచెదరలేదు. ఆహా!

తిరుమళ్— జయ్! కాళీకరాళ వదనీ!

ఆలయకన్యక— మహిషమర్దనీ!

తిరుమళ్— ఏమి మహత్తు! తురకలను చెండాడింది. జనని. ఈతుపాకిచూడు! జనని విగ్రహాన్ని ఛేదించవలెనని తురకలు వచ్చి దేవి మహత్తువలన అశక్తులై తుపాకిని దిగవ విడిచి దేవికి నమస్కరించి వెళ్లిపోయినారు.

ఆలయ కన్యక— (అమితానందముతో) ఆహా! దేవిమాహాత్మ్యం! (తొందరగా వెళ్లిపోయినది.)

(ఆలయము వెనుకనుండి ఆలయ కన్యకలూ అర్చకులూ, ఆలయపాలకులూ వచ్చినారు)

తిరుమళ్— అందరూ చూడండి! దేవి మహత్తు! దేవి తనను తానెలాగ రక్షించుకొని మనల్ని రక్షించిందో! తురకలు పారిపోయినారు. ఈతుపాకిని చూడండి.

అందరూ— జయ్! కాళీకరాళవదనీ!

గంగ— (వస్తూ) నేను చూశాను 'నేను చూశాను!

తిరుమళ్— ఏమిటి చూశావు?

గంగ— తార... తార... తార...

ఆలయ కన్యకలు— తార ఏమిటి?

గంగ— తార ఆతురకసేనానాయకుడితో కలిసి రథమెక్కి వెళ్లిపోతూంది. ఆతురకవాడితో నవ్వుతూ మాటాడుతూ వెళ్లిపోతూంది.

తిరుమళ్— (ఆశ్చర్య చకితుడై) నిజమా?

గంగ— నేను కళ్లారా చూశాను.

1 వ ఆలయకన్యక— తార నా స్నేహితురాలు!

2 వ ఆలయకన్యక— తురకవాడితో లేచిపోయింది. కులట!

గంగ— కాదు. ఉన్మత్త...

తిరుమళ్— (ఆలో... నవ్వి) దేవీద్వేషం చూచి) కాదు కాదు.

మయిన భక్తురా... పాటవిని నవ్వింది.

...క— నామస్మరణ చెయ్యడ... నాతో అంది.

...వ కన్యక— తారకు ...

# శృంగారము

మైసూరు సిల్కులు నూటికి నూరు పాళ్లు శుభ్రమైనవి...

ఉతుకుట సులభము, చెడిపోవు.........................

వెక్కు రంగులలో రకములు వారిగా దొరకును...........

...నేడు యీ రకములు లభ్యపడుడు. అవి ఖరీదులో గూడ అధికము కావు.

# మైసూరు సిల్కు గుడ్డలు

గవర్నమెంటు సిల్కు-వీవింగ్ ఫ్యాక్టరి, మైసూరు.

స్టాకిస్టులు:

1. [illegible]
1/17-A మౌంటురోడ్డు, మద్రాసు.
2. [illegible] అండ్ కో., కమర్షియల్ రోడ్, ఉదకమండలం.
3. కాటేజి యిండస్ట్రీస్ సేల్సుడిపో., హెచ్. యి. హెచ్. ది నైజామ్స డొమినియన్సు, హైదరాబాదు, దక్కన్.

సిల్కు [illegible]
పరిశ్రమను [illegible]

# Reduced current consumption

if you fit *India* or *Bharat* Fans







నిజమైన సంగతులు [illegible] తెలిసికొని — ఇండియా, భారత్ ఫ్యానుల— అనేక యితర విశేషగుణములతోపాటు — మితవ్యయకారక మగు ప్రయోజనమును గుర్తించును. పైన తెలిపిన మాదిరి ఖర్చులతగ్గుపును చూపు బిల్లులను చూచుకొనుటకు, తృప్తిపొందుటకు మాఆఫీసుకు దయచేసి రండు. వచ్చిచూచినచో సమస్తము మీకే తెలియగలదు.

| ఇండియా డి. సి. కి | భారత్ ఏ. సి. కి |
|---|---|
| 60 | |
| 56 | 56 |
| 48 | 48 |
| 36 | 36 |
| 24 | 24 |





పిస్సకోట వెంకటరత్న శర్మగారు
ప్రస్తుతం మదరాసులో భగవద్గీతోపన్యాసములు ఇచ్చుచున్నారు.

## [illegible] చే రచింపబడిన గ్రంథములు

# "భగవద్గీత — బైబిలు — కొరాను"

సుమారు 800 పుటలకుపైగా 1/8 డెమ్మీలో చేయబడినది.

నిండు క్యాలికో బైండు రక్షు 2-8-0. } పోస్టు ఖర్చులు
లెదరు 3-8-0. } వేరు.

## శ్రీ కృష్ణ చైతన్యావతారము (వచనము)

షుమారు 800 పుటలు 1/8 క్రౌనులో చేయబడినది.
నిండు క్యాలికో బైండు రక్షు 2-8-0.

దొరకు స్థలములు:—

(1) హిగ్గిన్ బాథమ్సు రైల్వే పుస్తకాలయములు
(2) ఏలూరు వంకటారాం అండు కో,
(3) సింగంశెట్టి శేషాచలంశెట్టిగారు, కోవూరు, నెల్లూరు జిల్లా,
(4) బండా నరసింహారావు పంతులుగారు వకీలు, భీమవరము.

## ఈ గ్రంథకర్తచే రచింపబడిన ఇతర గ్రంథములు

అష్టోత్తర శతశ్లోకీ భగవద్గీత 0-8-0

## మహాపురుషుల జీవితములు

శ్రీ రామకృష్ణ, వివేకానంద, [illegible], [illegible] మొదలైనవి ఒక్కొకటి 0-1-0.

---

# బిడ్డల లివర్ అండ్ స్ప్లీను

వ్యాధులను నివారించుటకు

## అసలు విజయనగర ఔషధము

# బాలసంజీవిని

ఆంగ్ల ఆయుర్వేద వైద్యశిఖామణులిప్పుడు బాలసంజీవిని నే హెచ్చుగ వాడుచుండుట దీనియొక్క ప్రాశస్త్యమునకు తార్కాణము

వివరములకు:

**డాక్టరు పిళ్లా పాపయ్య పాత్రుడు బ్రదర్స్,**

**98-99 బ్రాడీసురోడ్డు, మైలాపూరు, మదరాసు.**

---

BANISH SUPERFLUOUS HAIR

with DELICATELY PERFUMED

# BADSHAHI

DEPILATORY POWDER

C.C. MAHAJAN & Co., BOMBAY 2

# బాదుషాహి

పౌడరు మరియు సబ్బు.

మదరాసు స్టాకిస్టులు:-

జె. ఎం. షేత్,

[illegible]

సి. సి. మహాజన్ అండ్ కో, బొంబాయి 2.

పేరు..............................

అడ్రసు..............................

(A. W. C


MYSORE CAFÉ

















## ముఖ్యగమనిక:—

ఆభరణపురాళ్లు, నగలు వ్యాపారమునందు దాదాపు 165 సంవత్సరాలుగా నమ్మకముగా వ్యాపారము చేయుచున్నాము. మా రంగూను వజ్రములు అసలు వజ్రములవలె అనేక కలర్లతో పూరింపు వుండుటవల్ల లక్షలాదిగా విక్రయించుచున్నాము.

60 వేల ఖాతాదార్లు ఆదరించుచున్నారు. మావద్ద [illegible] పుష్యరాగములు, రంగూన్‌వజ్రములు, డాజ్‌లో [illegible], వైక్రాంతములు, ఇమిటేషను ఎరుపు, పచ్చ, [illegible] [illegible]లుపురాళ్లు, ఫ్యాన్సీముత్యాలు, పారిస్ వుంగరముల [illegible]. లోలకురాళ్లు, బంగారు, వెండిరేకులు, నగల [illegible], కాటుకకోపులు, రోసు, నలుపుపౌడర్లు, కుక్క[illegible] [illegible]. [illegible]ట్టు గుడ్డలు, అన్నివిధములైన నగలున్న



[illegible] :

# పి. గోపాలస్వామి నాయుడు & సన్సు,

పరంగిమలై **P. O.** మద్రాసు.

బ్రాంచి ఆఫీసు : **234,** గోవిందప్పనాయకన్‌వీధి, మద్రాసు.

# P. GOPALASWAMI NAIDU & SONS

SAINT THOMAS MOUNT P.O. MADRAS.

## మహా ఘనతవహించిన నిజాం సర్కారువారి యినుపదారి

## దీపావళి

### "స్వేచ్ఛా ప్రయాణపు టిక్కెట్లు"

ఈరైల్వేపైన అక్టోబరు ౨౩ వ తేదినుండి నవంబరు ౪ వ తేది వఱకు ఉభయదినములతో సహా, మొదటి, రెండవ మూడవతరగతుల స్వేచ్ఛాప్రయాణపు టిక్కెట్లు యీక్రింద కనబఱచిన ధరలకు నివ్వబడును.

| | ప్రతిలైను పైన ఛార్జి |
|---|---|
| మొదటి తరగతి | రూ 30-0-0 |
| రెండవతరగతి | ౧౫-0-0 |
| మూడవతరగతి | ౫-0-0 |

చిన్నలైను పెద్దలైను టిక్కెట్లు వేరువేరు వరుసతో నివ్వబడును.

**(ii) ఉపయోగము:—** ఈ టిక్కెట్లు అన్నిస్టేషనుల వద్ద ఇవ్వఁబడును. అవి యే లైనుకు యివ్వబడెనో ఆయాలైనుమీద, మితములేని ప్రయాణమునకు గాను, యివ్వఁబడిన తేదిలగాయతు పదిదినముల వరకు గడువు గలవై యుండును.

**(iii) టిక్కెట్లు యివ్వఁబడు నిబంధనలు:—** ఈటిక్కెట్లుమార్చకూడదు. టిక్కెట్లుపొందువారు వానిపై సంతకము చేసి, కోరినయెడల రైల్వే వుద్యోగస్థులకుఁ జూపవలెను. టిక్కెట్టుమీది సంతకమును పోల్చుటకుగాను కోరినప్పుడు ఒక చిన్న కాగితముపైన తన సంతకములను వ్రాయవలెను. ఈటిక్కెట్లు ఇండియన్ రైల్వే కోచింగ్ టారిఫ్ నెం ౧౦లోని నిబంధనలకు లోబడి యొసఁగఁబడును. మఱియు మార్పిడితో లాగుకొనఁబడును. ప్రయాణీకులు ఒక లైనుకు వర్తించు టిక్కెట్లతో మఱియొక లైనుపైన ప్రయాణముచేయుట కనుగొనఁబడినచో నిబంధనలననుసరించి ఛార్జియును అపరాధసొమ్మును వసూలుచేయఁబడును.

**IV. పిల్లలకు ఛార్జి:—** మూడుసంవత్సరములకుపైన పండ్రెండు సంవత్సరములకు లోపుగల పిల్లలకు పై రేట్లలో సగము ఛార్జి చేయఁబడును.

**(v) లగ్గేజి (బరువులు):—** ఒక ప్రయాణపు టిక్కెట్టుపైన మామూలుగానిచ్చే వుచితపు బరువును మొత్తమే ఈ టిక్కెట్టుకును వప్పుకోఁబడును.

**(vi) సొమ్ము వాపసులు:—** ఏ సందర్భము వల్లనైనను ఈ టిక్కెట్లమీద సొమ్ము వాపసుచేయబడదు. మఱియు ఛార్జిలలోని భేదమును చెల్లించినను టిక్కెట్లగడువు కాలము హెచ్చింపఁబడదు.

**(vii) టిక్కెట్లను పైతరగతిలోకి మార్చుకొనుట:—** ఈటిక్కెట్లదార్లు ఛార్జి భేదములను చెల్లించినను, పై తరగతిలో ప్రయాణము చేయనివ్వబడరు.

## మహా ఘనతవహించిన నిజాం సర్కారువారి ఇనుపదారి

## దీపావళి

### ౧౯౩౭ వ సంవత్సరము చౌకధరల రిటర్న్ టిక్కెట్లు.

౧౯౩౭ వ సంవత్సరము అక్టోబరు ౨౩ తేది శనివారమునుండి నవంబరు ౪ వ తేది గురువారమువరకు ఉభయదినములతో సహా దీపావళికి చౌకధర రిటర్న్ టిక్కెట్లు యివ్వఁబడును. ఇవి నవంబరు ౧౪ వ తేది ఆదివారము అర్ధరాత్రివరకు చెల్లునవై యున్నవి.

**మొదటి, రెండవ తరగతులకు:—** ఎంత దూరమైనను పోయిరాను రెండు ప్రయాణములకు ౧⅔ ఏక ప్రయాణపు ఛార్జీ చొప్పున.

**మూడవ తరగతికి అన్ని బండ్లకు:—** ఎంతదూరమైనను పోయిరాను రెండు ప్రయాణములకు ౧⅓ ఏక ప్రయాణపు ఛార్జీ చొప్పున.

పై ఛార్జీలు యీక్రింది చూపబడిన కనీసపు మొత్తములకు తగ్గియుండవు.

| | | ఛార్జీలు. |
|---|---|---|
| మొదటి తరగతికి | రూ. | ౧౯—౧౩—౦ |
| రెండవ తరగతికి | ,, | ౮—౪—౦ |
| మూడవ తరగతికి | ,, | ౨—౧౨—౦ |